# జయంతి.

సంపుటము ౧ సంచిక ౨

జయంతి తే సుకృతినో
రససిద్ధాః కవీశ్వరాః.

భర్తృహరి.

సంపాదకుడు:
విశ్వనాథ సత్యనారాయణ, బి, ఏ.

# 'జయంతి' ఆలోచనాసంఘము.

సారస్వతము:—

శ్రీ వున్నవ లక్ష్మీనారాయణపంతులుగారు, బారిష్టరు, గుంటూరు
,, వింజమూరి రంగాచార్యులుగారు, ఎం, ఏ, బి, ఎల్ ,,
,, ఇవటూరి కనకాచలం పంతులుగారు ఎం, ఏ, ఎల్ టి, పర్లాకిమిడి.
,, నందూరి వెంకట సుబ్బారావుగారు, బి, ఏ, బి, ఎల్, ఏలూరు,

ధర్మశాస్త్రము:—

శ్రీ మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయశాస్త్రిగారు, విజయనగరం
,, కిళాంబి రంగాచార్యులు గారు, ఎం, ఏ, బి, ఎల్, ,,
,, బంకుపల్లి మల్లయ్యశాస్త్రి గారు, పర్లాకిమిడి.
,, కావ్యవ్యాకరణతీర్థ పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు
చెన్నపట్టణము.

లలితకళలు:—

శ్రీ అడివి బాపిరాజుగారు బి, ఏ, చెన్నపట్టణము.
,, బెల్లకొండ రాఘవరావుగారు, పమిడిపాడు.
,, గొడవర్తి రామదాసుగారు, బి ఏ; యం, ఆర్, ఏ, యస్, జయపురము

వార్తాశాస్త్రము:—

శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్యగారు. ఎం, ఏ, ఎల్, టి, విజయనగరము.
,, బసవర్సు రామచంద్రరావుగారు, ఎం. ఏ, కలకత్తా

చరిత్ర – రాజనీతి:—

శ్రీ భావరాజు వెంకటకృష్ణారావుగారు, బి, ఏ, బి, ఎల్,
రాజమహేంద్రవరము.
,, వింజమూరి గోవిందరాజాచారిగారు, బి, ఏ, బి, ఎల్, చెన్నపట్టణము.
,, కోలవెన్ను రామకోటీశ్వరరావుగారు, బి, ఏ, బి, ఎల్, బందరు.

భౌతికశాస్త్రము:—

శ్రీ డాక్టరు ఏ, ఎల్, నారాయణగారు, ఎం, ఏ, డి, ఎస్, సి.
యస్, ఐ, పి, విజయనగరము.
,, డాక్టరు జయంతి చినకామేశ్వరరావుగారు, ఎం, ఏ, డి, ఎస్, సి,
చెన్నపట్టణము.
,, పాతూరి, పట్టాభిరామయ్యగారు, ఎం, ఏ, ఎల్ టి, బందరు

రసాయనశాస్త్రము:—

శ్రీ కొల్లకూరి సూర్యనారాయణగారు, ఎం, ఏ, ఎల్ టి, చెన్నపట్టణము
,, సుసర్ల రాజు గారు బి, ఏ, బందరు.

ప్రకృతిశాస్త్రములు:—

శ్రీ గోపరాజు రామచంద్రరావుగారు, ఎం, ఏ, ఆనందకళాశాల,
కొలంబో
,, డాక్టరు వుప్పల లక్ష్మణరావుగారు, ఎం, ఏ, డి, ఎస్, సి, (జర్మనీ)
,, పురాణం సూరిశాస్త్రి గారు, బి, ఏ, బందరు.

# విషయసూచిక.




# సాక్షాత్కారము.

ఈయనిలాధ్వమెల్ల నినదించెను మువ్వలమోత దూరమై
పోయిన గోతతిన్ బిలుచుపోలిక నేదొ వినిస్వనించెడున్
రాయిడి పొందుచున్ దలచరాక వగర్చి పురానుభూతముల్
తీయని భావముల్ స్మృతికిఁ దెచ్చుకొనన్ వలవంతఁ గుందెదన్.

ఒకసారి నాలోన నూహించి యేమియో స్త్రీవోలె సిగ్గుపొందెదను నేను
ఒకసారి యెదపొంగి యూగించి కవివోలె మృదుకంఠమెత్తి పాడెదను నేను
ఒకసారి హృదయమూరక బాధపడి కంటి తుదలందు నీరు జార్చెదను నేను
ఒకసారి పీతసంతోషకముగా సౌఖ్యమ్ము విరిసిపడ్డట్లు నవ్వెదను నేను

ఏమహాభావమో వచ్చి హృదయ మూప
రించి నాసంఘములను గదలించివైచు
నామహాభావ మెందెద నన్నకొలది
నావిలోచన పథమెల్ల నల్లనయ్యె.

అనవసరమ్ముగా హృదయమంతయు సంచలనమ్ము పొంది క
న్గొనలను బాష్పముల్ తిరుముకొంచుఁ బ్రవాహము కట్టివచ్చునే

ధ్వని వినిపించినన్ హృదయతాపము వాపునదే యటంచుఁ గ
న్గొనెదను కాకపోయి కనుగొందును శూన్యములైనద్మకన్నులన్.

మనసున నేదియో చిఱుతప్రమానల చేరువ నాలగుఁవున
ల్లనియొక పెద్దకాల్వ దవులన్ ప్రవహించెడునట్లు లీలగా
గనబడు భావ సుస్థిరతఁ గాంచగఁ గన్నులు మూయునంతలో
వెనుకటి లీలగూడ కనిపించక శూన్యతయే బయల్పడున్.

ఇది అతిలోకభావ మొకొ యెన్నగలౌకిక భావమో పదిం
బది హృదయాంబుజాతమును వచ్చిబయల్పడఁ జూచులోసనే
యొదిగి చరించఁజూచు మరియున్ తనువెల్ల వడంకిపోయి నా
హృదయ మనంతవేగమున నిట్టటు కొట్టుకొనం దొడంగెడున్.

అతిభయవేగసంచలితమైన హృదంతర మోర్వలేకయే
గతినయినన్ విదల్చుకొనగా మదినెంచెద దీని గాని నా
యతనములెల్ల వ్యర్థమయి యంతకునంతకుఁ బీటవెట్టి నా
మతికదలించి వైచు నొకమాదిరిగా విడదన్నయట్లుగా.

ప్రతినిముసంబునన్ హృదయభారము తగ్గునటన్న యాశయే
మతిఁగలుగున్ గతించక క్రమక్రమ వర్ధితమైన యీభరో
న్నతి అతిసూక్ష్మవైఖరిని నాహృదయాంతరితాంతరప్రవి
స్తృతగమనంబులన్ జెలగిరేపెడు నా యొద మూలముట్టుగన్.

ఈదృఙ్మార్గములన్ నిరాకృతులు కావే! సాకృతుల్ గావు కా
దేదో నల్లదనాలలో మెరుపులై హేలాచలద్రేఖలై
ప్రోదింగట్టెడు మొల్కలై త్రిజగతీ పుణ్యంబు సాకారమై
నా దేహం బతివేల కంపము కడున్ సప్రమత్వమున్ పొందెడున్.

వీడెవడో కుమారకుడు వేదపుఁగ్రొంజివురుల్ ఫలించియే
పోడిమిలేని నాహృదయముఁ దనవైపున కాకృషించుచు
న్నాడు శిరస్తటీచలిత నవ్యవిలాస మయూరబర్హాస
ప్రౌఢభిరమ్యచూడుడు సరాగవిలోచన మందహాసుడుఁ.

విశ్వనాథ సత్యనారాయణ.

# తదియ చంద్రుడు.

నాకు మూడవనాటనే నాగమింప
వలయు వలయంపుకొనలు రేకలను దీర్చు.
నేను వైశాల్యములను గుణించుచుండి
అట్టికన్మాత్రు నాదుకార్యక్రమాన.

నేను నాయంత నన్ను పూర్ణింపసలుపు
యత్న సాఫల్యములను నూహాప్రపంచ
మందు నిర్మించి యానంద మందుచుండఁ
కన్ను మెరపించిపోవు నాగమ్యరేఖ.
లక్ష్య మెఱుగక యే.—కాగలాడు
తనదుజతకునై వేచియుండు సున్నతపదమ్ము
లనెడు నమ్మికతోడ—తానై యతించి
ఫలముగనునట్లు—వలయరేఖలను నింపి
పూర్ణమారాత్రియందు సొంపులను గురియు
నాసొగసుచూడ నాకె యానందమొదవు.

ముత్తేవి నరసింహదాసు.

సూరపనేని రామగోపాలరావు.

# ఫలశ్రుతి.

౧

నీ ప్రసన్న మాధుర్యములు జీర్ణించుకొన్న
చేత నవ్వుదొంతర పిసాళించెబోలు
కాక యిది యేమిటే యీ వికచవసంత
నవ్య మృదు మల్లికా ప్రసూనముల పొలుపు ?

నా యెద పరిమళ సనాథమై యనంత
భావ వీథులయందు శంపా ప్రకాశ
రమ్యమౌ నీయపాంగానురాగ రేఖ
రీతులను పోల్చుకొనుచు పరిభ్రమించు.

౨

నా హృదయ మూలమున సముత్పన్న పరిమ
ళాభిరామమ్ము తో ప్రణయాంక భావ
కుసుమమాలలు నీ ముందు కుప్పవోసి
చూచుకొమ్మని నీవంకఁ జూచినాను.

అమృత వాహినులయిన విశ్వాసములు [illegible]
నీవు కన్నులలో నవ్వినావు దేవి !

గళిత గర్వాండనైన నాకంఠ సీమ
రంజితమ్మైన దివ్యహారమ్మి దేమి!
ఈయమూల్య భాగ్యము భరియింపలేక
తడవ తడవకు పెట్టెలో దాచుకొందు.

నాయని సుబ్బారావు.

# కిన్నెరసాని పాటలు.

## ౧ కిన్నెరసాని పుట్టుక.

[కిన్నెర మహాపతివ్రత. అందరు తెలుగుకన్నెలకి మల్లేనే ఉద్విగ్నహృదయ. ఎక్కువ తెలుగుకుటుంబాలకి సామాన్యమైన అత్తాకోడళ్లపోరాటం ఆయింట్లో వెలిసింది. కొడుకు సుఖమెరగని అత్తకు కిన్నెరమీద నిందలారోపించటం పనిఅయింది. ఒకప్పుడు ఆవిడచేసిననింద భరించటం కష్టమయింది. కిన్నెరహృదయం శోకంచేత ప్రళయసముద్రమై పోయింది. కిన్నెరభర్త యేంచేస్తాడు. తల్లిని కాదనాలేడు. తల్లిని వోదార్చనూలేడు. ఆవేశహృదయంతో కిన్నెర అడవులవెంట పరుగెత్తుతోంటే భర్త పట్టుకోపోయినాడు. అతనికౌగిలిలోనే ఆవిడ కరిగి నీరై వాగై ప్రవహించింది. భర్త శోకించి శిలఅయినాడు. ఈకథజన ప్రచారంలో లేదు, కిన్నెరసానివాగు భద్రాద్రిపోయేత్రోవలో వుంది. ఆవాగుచూసి ఆమధురనామం నిరంతరం మననంచేసుకోటం వల్ల కల్పించుకొన్నకథ. ఈవాగు గోదావరిలో పడుతుంది.

[ఆంధ్రనదీగౌతమీప్రవాహంబునకును
నిత్యజీవన దాత్రి కిన్నెరలసాని.]
వనములను దాటి 'వెన్నెలబయళ్లు' దాటి
తోగులను దాటి దుర్గమార్గములను దాటి
పులులయడుగుల నడుగులు కలుపుకొనుచు
'రాళ్లవాగు' దాటి పథాంతరములు దాటి —
అనట కిన్నెరసాని —
నాయాత్మయందు
ఇప్పటికి దానిసంగీతమే నటించు.

(వెనక వ్రాసిన పద్యము.)

ఓహో కిన్నెరసాని
ఓహో కిన్నెరసాని
ఊహామాత్రములోపల
నేలనిలువవే జవరాలా — ఓహో!
కరగిపోతి నిలువెల్లను
పరవశించితి నామనము.

మరగిపోయి నాగుండియ
నురిగిపోయె నా ప్రియురాలా! ఓహో
తనయెడ తప్పే యున్నది
అనుకోవే నాథుని దెస
వనితలు నీవలె కఠినలు
కనిపించినవే యెందును — ఓహో!

ఇంత కోపమేమిటికే
యింత పంత మేమిటికే
యింతులు జగమునపతులకు
ఇంతలు సేయు దురటవే - ఓహో!

ఇప్పుడె గదె నాకౌగిట
తప్పితివి శోకమూర్తి
అప్పుడె నిలువున నీరై
యెప్పుడు ప్రవహించితివే - ఓహో!

అంత పగే పూనితివో
అంత కోప మందితివో
ఇంతీ నను శిక్షింపగ
నింకొక మార్గము లేదటె - ఓహో!

రాలపైన తొలి నాళుల
కాలిడగా నోర్వలేవు
రాలను కొండల గుట్టల
నేలా ప్రవహించెదవో - ఓహో!

నీవు మహాపతిశీలవు
కా వని నేనంటి నటే
అటు లంటిన నాకంఠము
కటారి త్రెంచక పోతిన — ఓహో!

వెన్నెల వలె తెల్లనినీ
సన్నని మేని పసందులు
కన్నులకును కనిపించెను
చిన్నితరగ చాలువోలె - ఓహో!

నీయొయ్యారపు నడకలు
మాయురె కనిపించెనుపో
మలకలుగా ప్రవహించిన
సెలయేటిభవమ్మూర్తిని - ఓహో!

నీనవ్వులు నురుగులుగా
నీవళు లవి తరగలుగా
నీకన్నులు మీనులుగా
నీకరణిని ప్రవహించెద - వోహో!

నీజఘనము నిసుకతిన్నె
గాలించిన నాకన్నులు
ఊడి పడవు నేలపైన
సరిసి పోవులోసలోస - ఓహో!

మున్ను భగీరథభూపతి
వెన్నువెంట పరుగెత్తిన
అన్నాకథ నీవైఖరి
నున్నది నీచన్న త్రోవ — ఓహో!

పరుగెత్తెడు నీవేణీ
బంధము పూనితి చేతను
కరమున వేణికి బదులుగ
కాల్వగట్టె నీటిధారలు - ఓహో!

ఎడమచేత నీ కొంగును
ఒడిచి పట్టుకొంటి చెలీ
తడిచేతను కొంగులేక
తడబడితిని ప్రియురాలా - ఓహో!

నీపాదమ్ములు మోపిన
నాఫాలమ్మున చెమ్మట
యీపగిదిని వాగునైన
నీపై ప్రేమము నెరపెడి - ఓహో!

నీవే నాజీవితమణి
నీవే నా జీవేశ్వరి
నీవే నాచూడామణి
నీవేనే ప్రియురాలా! ఓహో!

నీవే యిట్లైతివిపో
జీవములుండునె నాకై
నీవలె నేను ప్రవాహం
బై వచ్చెదరానీవే- ఓహో!

ఈపురసాకృతి వగుటను
ఈవైఖరి ప్రవహించితి
నేను శిలాహృదయుండను
పూనదునె ధునీవైఖరి- ఓహో!

మునుపే నీకన్నులు కని
అనుకొంటిని నీవు నదీ
వనితవు మానుషజన్మము
కనినావని మనసులోన- ఓహో!

ఈతరగల కదలికలో
నోతరుణీ! నీకంత
శ్రీతారుణ్యముతో చగ
పోతివ చేపరువులెత్తి- ఓహో!

నినుకౌగిట నదిమిననా
తనువు పులకలణగలేదు.
కనువిప్పితినో లేదో
నిను కానగలేనైతిని- ఓహో!

ఈమురదృష్టుడ నేమని
రోదించెద నడవులందు
నీదే నీదే తప్పని
వాదించిన వడవులెల్ల- ఓహో!

ఇదిగో చేతులను చాచితి
ఏడ్చుచుంటి కంఠమెత్తి
వనితా వినిపించుకొనక
పోతివ చే ప్రియురాలా- ఓహో!

ఇన్నాళ్లును నాజీవిక
వెన్నెలవలె వెలుగచేసి
కన్నులక్రమ్మెడి చీకటి
కప్పిపోతివే ప్రియురాలా- ఓహో!

నీకై యేడిచి యేడిచి
నాకంఠము సన్నవడియె
నాకన్నులు మందగించె
నాకాయము కొయ్యబారె- ఓహో!

ఈయేడుపు రొదలోపల
నాయొడ లేనే నెరుగను
నాయీ దేహమదేమో
ఱాయివోలె నగుచున్నది- ఓహో!

విశ్వనాథ సత్యనారాయణ.

# ఋగ్వేదసంహిత

## ద్వితీయాష్టకము. సూక్తము ౧_౨౯.

దేవత — ఇంద్రుడు ఋషి. — పరుచ్ఛేపుడు.

పిలిచిన తోడ శీఘ్రముగ పేర్మిని బోవుచు నెల్లవారికిన్
ఫలము నొసంగి హవ్యము నపారముగా గొనుచుంటి వింద్ర మా
లలితనుతిం గుశాదుల జెలంగెడు హవ్యమునందు నీవు ని
చ్చలువిడి వచ్చి కర్మ గల శాలలలో నివసింపవే వడిన్.

అరులనుదునుమాడి యందఱరక్షింపుమను దీనవాక్యముల్ వినునెవండో
శూరులతో గూడి వీరవైరుల జంపి యుద్ధభయంబుల నుడిపెనెవడో
విప్రస్తుతులనొందివివిధాన్నములొసంగిచరుపురోడాశముల్ మరగెనెవడో
సుప్రసిద్ధగుణాళి శోభగల్గుచు నుతికృతులు వీనుల నాలకించునెవడో

యట్టి దేవేంద్రునకు నరు లధికగమన
విలసితాశ్వంబునకు గడ్డి వేయునటుల
యజ్ఞముల హవ్యముల నిచ్చి యతిశయముగ
సేవజేయుచు నున్నారు చింత లేక.

శూరుడు పారుమానవుని సూక్ష్మముగా నరికట్టునట్లు నీ
బీరము చూపి నీరదము వేగ నదల్చిపయఃప్రవాహముల్
పారగచేసినాడ వనపాయముగా నతిశుష్కమేఘముల్
శూరుడ! లేవగొట్టితివి చూడగశక్యమె నీదుకృత్యముల్.

తావకాద్భుతకృత్యముల్ పావకునకు
వరుణునకు మిత్రునకు నీకు వాసవుండ!

తెలియునట్టులు చాటించి దివ్యలోక
మంతటను వెల్గఁజేసెద నధిక భక్తి

యాగపూర్తిం జేసి యభిమత ఫలముల నిచ్చువాఁడా! ధనమిచ్చువాడ!
సర్వయజ్ఞములకు సాగుచు వైరుల గొట్టువాఁడా! గట్టిపట్టువాడ
ఘనమరుత్తులకెల్ల మొనగాడవై యన్న మొసఁగువాఁడా! సుఖ మొసఁగువాఁడ
ఇష్టికర్మలలోనఁ గష్టము లేకుండ జూచువాఁడా! మమ్ము గాచువాడ

దోషులగు శత్రువుల పారదోలువాడ
ప్రధనములయందు బాధింప బడనివాఁడ!
ఋత్విజాళికి మంగళ మిచ్చువాడ!
ఇంద్రుడా! రమ్ము వేగ మాయిష్టిఁ జూడ.

శత్రువగు వృత్రువలెమా
శత్రువులను బారద్రోలుశక్తి గలిగి నీ
వాత్రతఁ బితరులకు వలెన్
జిత్రముగా మాకు ఫలము జేర్పు మహేంద్రా!

పాపఘ్నుఁడ వని నిను జన
మొప్పి కడుం జెప్పుచుండ నో యింద్రుడ మా
పాపము గొట్టుమ! వజ్రప్ర
తాపముసఁ బ్రపంచని ఘోర తాపమును వలెన్.

ఇంద్రునిబోలి మాకడకహీనసుతుల్ వినగోరి వచ్చునా
చంద్రుడు మాకుబాధలిడుశత్రులబుద్ధులు మాన్పుగాక, ని
స్తంద్రతమాధనమ్ములుచు తస్కరునుచ్చపదంబు నుండియూ
చంద్రుడె వారిచందమున జారగజేయును గాక ప్రీతితో.

మిక్కిలిసామర్థ్యదవై
మిక్కిలి రమణీయ మానమేయ ధనంబుఁ
జక్కని పుత్త్రులఁ బౌత్త్రుల
నక్కజ మగునట్లు మాకు నందింపు హరీ!

దురధిగముండవు హరి! మా
నిరవధి నుతివాక్యసరణి నిన్నే పొందఁ
బరమకృపాయత్తుడవై
బిరబిర రావేమి మాదుపిలుపును వినుచున్.

దుర్మతు లగునరివీరుల
మర్మములను గొట్ట హరి సమర్థుడునుండీ
ఒర్మిలి హరి రక్షకుడై
ధర్మము కాపాడమనక ధర్మంబెటులా!

పాపవిరహితమార్గముం బట్ట వలయు
నంతధనమును గైకొని చెంతఁ జేరు!
దూరముననున్న దగ్గరఁ జేరియున్న
మమ్ము రక్షింపశక్తుడ! రమ్ము ప్రీతి.

అధికబలము గలిగి యందఱ రక్షింతు
మరణరహిత! నీవు మాకువలయు
ధనమొసంగి మమ్ము ధర్మాత్ములం జేసి
యుద్ధరింపవలదె! యుద్ధచరిత!

స్తుతుల నతులమహిమ సూర్యనిభా నిన్ను
బ్రీతిఁ బరప నీ వరాతిఁ గొట్ట

నెట్టిరథము నైన నెక్కి మాదగుయజ్ఞ
శాల గూర్చి రమ్ము శక్రదేవ!

సర్వత్ర శత్రు పుత్త్రిలు
గర్వాత్ములు గాన వారి గర్వమునడపన్
బర్వన వచ్చి మహేంద్ర! యు
ఖర్వ బలముతోడ వారిఁ గడదేర్పఁగదే!

సరసనుతిప్రపంచమున సంతసమందెదవయ్య! వైరికిన్
విరసత పుట్టఁజేయుదువు విస్తృతపాపుల సంహరించి శ్రీ
కరయజమాన యాగముల గాచెద వెప్పుడు, ప్రాణికోటులన్
స్థిరముగఁగావ నీశ్వరుడు సృష్టిని జేయడె నిన్ను శక్రుడా!

కావ్యతీర్థ నేమాని వెంకట నరసింహశాస్త్రి.

[శ్రీకావ్యతీర్థ పండిత నేమాని వెంకట నరసింహశాస్త్రి గారు బరంపురంకల్లికోట కళాశాలలో సంస్కృతాధ్యాపకులు. వారిదర్శనం కళింగవర్థంతి చూడటానికి వెళ్లినప్పుడు నేను ముఖలింగంలో చేశాను. వారు ఋగ్వేద సంహితలు తెలుగు చెయ్యటం ఆంధ్రభాషకి మహోపకారం అనిమాతలంపు. వారిశైలి మరీపలచసగాక మరీ బిగువుగాక చక్కగా అర్థబోధ అయ్యేటట్టు వున్నది. వారుచిన్నప్పటి నుంచీకవిత్వం వ్రాసినవారుకాదు. కాని ఈకావ్యం మొదలెట్టినతోనే వారిలో అవ్యక్తంగా దాగివున్న ఒక మహాశయ్యబయటికి వచ్చింది. ఆశయ్యాసౌందర్యం మా ప్రచురించిన యీకాస్తలో కనపడుతుందో కనబడదో అని మాసందేహం. పూర్తిగా అదిచదివితే తెలుస్తుంది. ఒకమహాపురాణం తెలుగుచెయ్యటానికి తగినమహాశయ్యా ధారాశుద్ధీ వారికవిత్వంలో వున్నవని మాఊహ. జ. సం.]

# గ్రామ్యమా? వాడుక భాషా?

(విశ్వనాథ సత్యనారాయణగారు, బి.ఏ. బందరు.)

వాడుక భాషనే కొందరు 'గ్రామ్యభాష' అంటున్నారు. గ్రామ్య భాష అనటం ఎంతవరకు సమంజసమో చూద్దాము. గ్రామీణులైన జనులు వాడుకునేది గ్రామ్యము. గ్రామ్యమనగా అసభ్యమని యర్థము. గ్రామీణులు మోటువారు. నాగరికతలేని వారు. అందుచేత వారు నగరస్థులు సభలలో వాడేఅంత భావగౌరవం కలభాషవాడరు. దానివలన గ్రామ్యం అపరిగ్రాహ్యం కావచ్చును.

మేము మాపత్రికలో వాడేభాష గ్రామ్యభాష అని ఈమధ్య ఎవరో వ్రాశారు హైదరాబాదు "సుజాత"లో. సజీవమైనభాషా ఆభాష పొందేమార్పులూ ఆభాష మాట్లాడేందుకు బొడ్డుఅయిన ప్రదేశాల్లో సువ్యక్తంగా కనబడతవి. అక్కడ దాన్నిగురించి సానుభూతి వుంటుంది. అట్లాగే ఇంగ్లీషుభాష నేటికాలంలో అసలయిన వాడుకభాష కావాలి అంటే, లండన్లో కనపడుతుంది. తెనుగుభాష కృష్ణా, గుంటూరు, గోదావరి, విశాఖపట్నంజిల్లాల్లో మాట్లాడేది అట్లాంటిది. ఇతర భాషలతో కలసివుండే ప్రదేశాల్లో ఈభాషమార్పునందు అంతసానుభూతివుండదు. బరంపురం, హైదరాబాదు, చిత్తూరు ఇటువంటి యితర భాషా సంపర్కం కలచోట్ల వాళ్లకి గ్రాంథికభాష నిలబెట్టుకోటమే కష్టం. అందుచేత భాషపొందేమార్పు లని కూడా యెక్కడ సంబాళించుకుంటారు? దాని మూలంగా వాళ్లకి దీనియందు సానుభూతి తక్కువగా వుంటుంది.

అయితే మీచోట్లనే వాడుకభాషని నిరసించేవాళ్లు వున్నారు గదయ్యా అంటే వున్నారూ! మేముచెప్పింది సామాన్యవిషయం. ఉత్సర్గంకాదు అంటాము.

గ్రామ్యశబ్దం విచారిస్తే ఈగ్రామ్యశబ్దం వాడుకభాషయందు ఎందుకు ప్రయోగింపబడుతోంది అంటే 'యస్త్వపభ్రంశో గ్రామ్యః' అన్ననన్నయ్యగారి సూత్రంవల్ల. తెలుగుకి సంస్కృతం మాతృకగా చేసిన నన్నయ్యగారు తెలుగువ్యాకరణం వ్రాశేటప్పుడు సంస్కృతమర్యాదలు పాటించారా? కాదు. తెలుగు భాషాస్వభావం వారికి బాగా తెలిసి ఆమర్యాదలన్నా చేశారా? 'శాస్త్రీ మపౌరుషమాద్యం' అన్ననన్నయ్యగారికి తమయందు ఋషిత్వం సిద్ధించిందేమో చూశారా! అట్లాగయితే మనం ఆంధ్రశబ్ద చింతామణి తెరుస్తూనే 'ఓంనమో నన్నయా థర్వణ చిన్నయసూరిభ్యో మహాఋషిభ్యః' అనటం లేదేమి?

సంస్కృత లాక్షణికులు 'కటి గల్లాది' శబ్దాలు గ్రామ్యములన్నారు; కాని 'గచ్ఛతి' అన్నదానికి ఏఅపభ్రంశరూపమో 'గచ్ఛైతె' అంటివి తీసికొని అది గ్రామ్య మనలేదేమి?

ఆ, కటి గల్లాది శబ్దాలు మనగ్రంథాల్లో బహుగా ప్రయోగించారే మరి?

అందాకా యెందుకు? సర్వభూపాలీయంలో 'కన్నులు' 'చన్నులు' గ్రామ్యాలుఅన్నాడు. మరిఅవ్విలేకండా మనకు కావ్యం నడవదే. ఎట్లా?

అసలు గ్రామ్యంఅంటే మనపూర్వుల వుద్దేశం ఏమిటి? మనమే మనుకుంటున్నాము. పూర్వులవుద్దేశం అసభ్యమైన భాష అని. కొన్ని బజారుమాటలు సలుగురు పెద్దమనుష్యుల్లో సభలలో మాటాడరానివి వుంటయ్యి. అవీ. పూర్వం సంస్కృతంలో కటి గల్లాదు లట్లాంటివి. చన్నులు ఇప్పుడు అట్లాంటివి.

సభలలో మాట్లాడేది సభ్యం. ఈవాడుకభాష, సభలలో, అది గ్రామ్యం అనేవారుకూడా మాట్లాడుతున్నారు. బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారి ఉపన్యాసం రక్తిగా వుంటుందిఅంటే యెందుకని? వారు వాడుకభాష ప్రయోగిస్తారు. కాకుధ్వని వాడుక భాషలోనే

వున్నది. గ్రాంథిక భాషలో కాకువు సాధించుకోవాలి. గ్రాంథిక భాషా వాది అన్నకొద్దీ కాకుపుస్ఫూర్తి తెలియనివాడని అర్థం.

ఈ కాకువు గ్రాంథిక భాషలో ఇమిడ్చేటందుకు తిక్కన్న పడ్డకష్టం భగవం తుడికి తెలుసు. అందుకునే భాగవతం అర్థం చెప్పటం కష్టం భారతం చదవటం కష్టం అనీ అంటారు. భాగవతంలో వేదాంతార్థం పెగలదు. భారతంలో కాకుస్వరం తెలియదు. అది తెలియకనే భారతంలో ఏమున్నదీ అంటారు కొందరు.

కాకువు అంటే భావద్యోతకానికి ఉచ్చారణలో చూపేబడువు. ఒక భాషాసామర్థ్యం ఆ భాషలో కాకుధ్వనినిపట్టి తెలుస్తుంది. ఆ కాకు ధ్వనిని గ్రాంథిక భాషకన్న వాడుక భాష మిక్కిలిగా ప్రయోగిస్తుంది. వాడుక భాషా అంటే ప్రత్యయాల మార్పుమాత్రమేగా అనుకో వచ్చు. నేటి కొందరుకవులభాష ప్రత్యయాలు మారిస్తే, వాడుక భాషకన్న అమితకనాకష్టం అవుతుంది. ఏ శ్రీనాథుడి కవిత్వమో ప్రత్య యాలు మారిస్తే దానికి గ్రామ్యత్వం సిద్ధించదు.

సంస్కారం పొందినహృదయం, వాక్కు కలవాడు వ్రాసినా మాట్లాడినా భాషకి కొంతగౌరవం వుంటుంది. గౌరవంగల శబ్దా లువాడతాడు. సంస్కారరహితమైన హృదయమూ, వాక్కు కల వాళ్లు గ్రాంథిక భాషలో వుండేప్రత్యయాలు చివర కనిపినా, అది అట్లాగే వుంటుంది.

ఈ వాడుక భాష ఎందుకు వద్దూ! అని అడిగితే పండితులు చెప్పేకారణాలు ఏమిటంటే ఇందులో శబ్దాలు ఇష్టంవచ్చినట్లుగా మారుతున్నవి. ఆ మార్పుకు హద్దులేదు. అందువల్ల గ్రాంథిక భాష మారిపోతుంది. అని. మార్పుకు హద్దులేదూ అంటే హద్దువున్నది. గోడని ఎవ్వరూ 'గేడ' అనరు. 'చూడటం' 'చూట్టం' అవుతుంది. ఒక్కరితే కు రూపైరూపాలు వ్రాసినవ్యాకరణం ఈ మాత్రం చెయ్యలేదూ?

కొందరు నన్ను అడిగారు! పద్యాలూ వ్రాస్తావు నువ్వు. వాడుకభాషా వ్రాస్తున్నావు! నీ కది యిష్టమా! ఇది యిష్టమా? అని. రెండూ ఇష్ట మేనన్నా! దానికి వారు ఒప్పుకోరు. ఒప్పుకోక 'ఆ! అది ఏట్లా'! అంటారు. వా రన్నది నాకు తెలియటం లేదు.

బ్రహ్మశ్రీ ఆచంట సాంఖ్యాయనశర్మగారు మనదేశానికి భీష్ముల వంటివారు. వారు అన్నారుగదా! 'ఈక్రొత్తభాషవల్ల భారత భాగవతాలు మూలపడతవి' అని. ఈభాషవల్లనే అట్లా జరిగేటట్లయితే అదియిదివరకే జరగాలి. బొబ్బిలిపాటలు, కామమ్మకథలు, రామదాసు కీర్తనలు, కొంతదాకా త్యాగయ్యకృతులూ ఇవన్నీ వాడుక భాష లోనే వ్రాయబడ్డవి. అవ్వీ అచ్చుపడ్డవి. దానివల్ల భారత భాగవతాలకు వచ్చిన నష్టం లేదు అన్నా.

అయితే భారతభాగవతాలు ఈభాషలో వ్రాయవచ్చునా? అని అడిగారు. నేను కాదు అన్నాను. వాడుకభాషకి అంతసామర్థ్యం లేదు. నేను రామాయణం ఈభాషలో వ్రాయాలని కాదు. ఈభాషలో వ్రాసినా ఆభాషలో వ్రాస్తే, ఏఅందం వచ్చిందో, ఆఅందం రాదు. ఆరెంటి తారతమ్యానికి బొబ్బిలికథని రంగారాయవిజయంతో పోల్చి చూస్తే తెలుస్తుంది.

ఈభాషచదివితే పిల్లలు పాడయిపోతారూ అన్నారు. ఈయూని వర్సిటీవారూ గవర్నమెంటువారూ పెట్టే గ్రాంథికనామక గ్రంథాల వల్ల పాడవుతారేగాని, శక్తిగల జీవంగల నుడికారం ప్రయోగించిన వాడుకభాషాగ్రంథాలు చదివితే చెడిపోరు అంటాను.

భాషస్వభావం తెలుసుకోకండా గ్రంథస్థభాషలోవున్న ప్రత్య యాలకి మాత్రమే ఆగౌరవం కలిపిస్తే, దానివలన భాషకి చాలా నష్టం వుంది. పిల్లలకి అటువంటిబాష నేర్పరాదు. ఆభాష తగినంత జీవంగల

భాష అయివుండాలి. నిర్జీవమైతే గ్రాంథికభాషఅయినా పిల్లలకు నేర్పకూడదు. గ్రాంథికభాష అన్నపేరుతో తప్పురూపాలు కోటాన కోట్లుగావున్న భాష(ఇప్పటి స్కూళ్లల్లో పెట్టే పుస్తకాలభాష)వాళ్లకి నేర్పరాదు. సామాన్యంగా పిల్లలచేత నేను స్కూళ్లల్లో చదివించేనవల లూ అవ్వేని, కుర్రవాడికి భాషలోవుండేశక్తిని తెలియనివ్వటంలేదు. భాషశక్తి కారకంలోనూ కాకువులోనూ హృదయోద్వేగం ప్రకటించే మాటల్లోనూ వుంటుంది. ఆశక్తి తిక్కనవచనలో సమృద్ధిగా వుంది. కొందరి కవులల్లో అది కనపడనే కనపడదు.

'వచ్చుచున్నది' 'వస్తున్నది' 'వస్తోంది' అన్నరూపాలు దగ్గర కాదు తగాదా. బాహుళ్యంమీద, భాషాస్వభావంమీద. ఈరూపాలన్నికూడా వాడికి తెలియవలసిందే. అవి వాడేచోట్లు వేరుగా వుంటవి. పసిపిల్లలకి చెప్పే చిన్నిచిన్నికథల్లో 'వస్తోంది' అని వాడవచ్చు. ఇంకేదైనా అయితే 'వస్తున్నది' అనవచ్చు. 'వచ్చుచున్నది' గ్రాంథిక భాషారూపం తెలిసేటందుకు.

మనభాషలోకి యితరదేశ్యాలు యథేష్టంగా ప్రయోగించవచ్చు. 'ఫీలు' కూడా భాషలోకి వచ్చింది. 'సప్లయి' మొదలైనవి శబ్దరత్నాకరంలోనే వున్నవి. 'వస్తాడు' అన్న నింద్యగ్రామ్యం. ఇది యెట్లా వుందంటే, దొరగారితో కలిసి, 'టీ' త్రాగచ్చుకాని పంచముణ్ణి దగ్గరకు రానీయరాదు. మహమ్మదీయుడికి శూద్రమర్యాద వచ్చింది. దొరకి దొరమర్యాదే సిద్ధించింది. మాలవాడికి?

అనింద్య గ్రామ్యమైనది 'కలకంటుడు.' ఎందుచేత? అనుశాసనుడికి పూర్వం వ్రాశాడు ఏకవో ఆమాట. కవులందరూ వ్రాసేవరకూ యీఅనుశాసకుడు ఆగరాదూ! అనింద్యగ్రామ్యాలు అన్నీ తెలిసేవిగా! ఎవరో కొందరు పండితులు 'ఇదిగ్రామ్యం వద్దు' అంటే ప్రతివాడున్నూ 'ఛీ! యిది గ్రామ్యం' అనే వారికన్న పదిరెట్లు ఎక్కువగా!

'అన్నాడు ధర్మరాజు' అన్నవాక్యంవుంటే 'అది గ్రామ్యంలే' అనటం. బాబూ! అది చాలా గ్రాంథికం! 'ఏకవాక్యంబునం దొకానొక్కచో దక్క సర్వపదంబులు క్రమనిరపేక్షంబుగం బ్రయోగింపం జను' అన్నాడయ్యా చిన్నయ్యఅంటే, దానికర్థం తెలియదుమళ్ళీ.

భాష ప్రవాహిని. మారుతూవుంటుంది. కనుక మారేభాషని పట్టుకోటానికి వీలులేదు అని భాషావాదులతర్కం. దీనికొక పండితులు చక్కని అభ్యంతరం చెప్పారు. ఏమని అంటే. అవును. మారటం స్వభావం. ప్రకృతిలో ఆదోషం వున్నది. ఆదోషం తీసివేసేందుకే మేము దాన్ని యిట్లావుండాలని నియమించాము, దాన్ని సూత్రబద్ధంగా చేశాము అని. ఇది బాగుంది. కాని సూత్రబద్ధం చేయకమునుపు ఆభాషయొక్క పరిణామానికి,దాని వైశాల్యానికి ఎవమిచ్చి చెయ్యాలా? సర్దా? కుర్రవాణ్ణి అల్లరిచిల్లరగా తిరగనీవద్దు. అయిదయింతరవాత, వాడు ఆడుకోవద్దూ! ఇంట్లో అదేపనిగా కూర్చుంటే గుద్దులెత్తి బోదకాళ్లువస్తవి. మనభాష కిదివరకే బోదకాళ్లు వచ్చినై. కొంచెం కాలు సాగనివ్వాలి.

కొందరన్నారూ! మార్పు మార్పు అంటావు. మార్పే ప్రధానమా? ఇంకేం కారణాలు అక్కరలేదా? మార్పుకోసమే మార్పా? అని. మార్పుకోసమే మార్పుకాదు. వాడుకభాషలో చెప్పే కొన్ని భావాలు సరిగ్గా తెలియచెయ్యటానికి గ్రాంథికభాషకి సామర్థ్యంచాలదు. అని. పూర్వం చిన్నయ్యగారు నిబంధించిన నిబంధన చాలకనే భాషయింతగా మారిపోయిందని. కనక ఆసామర్థ్యం ఎంతవరకు వుందో, అంతవరకూ వదలి పెట్టవలె నని. అప్పుడు దానికి సూత్రాలు నిర్మించు. ఏసూత్రాలు దాటి చెప్పమాను.

అట్లాఅయితే వాడుకభాషకే సామర్థ్యం చాలదు. వాడుకభాష వాడుకలో వున్నభావాలని మాత్రమే చెపుతుంది. గ్రాంథికభాషలో మనకు వాడుకలో లేని భావాలు చెప్పవలసి వస్తుంది. పైగా గ్రాంథికభాష.కి అటువంటి భావాలతోనే యెక్కువపని వుంటుంది. అని అన్నారు.అవును

ఆభాషాసామర్థ్యం ఆభాషది. ఈభాషాసామర్థ్యం ఈభాషది. రెండు నూకాలవలయున నేనాఊహ.

నిజమైనమాటకి పద్యమూ గద్యమూ రెండే మార్గాలు. మూడవది పాట. పాట ఏభాషలోనైనా వుండవచ్చు. పద్యం గ్రాంథికభాషలో వుండాలి. గద్యం వాడుకభాషలో వుండాలి. పద్యం ఎందుకు గ్రాంథికభాషలో వుండాలి అంటే, ఛందోబద్ధమైనభాషకు పద్యమూ, పద్యానికి ఛందోబద్ధమైనభాషా సరిపోయినవి. ఇదివరకు మనవాళ్లు సృష్టించి యేర్పరచిన వృత్తభేదాలు గ్రాంథికభాషాస్వరూపానికి తగిపోతవి. వాడుకభాషలోనే పద్యాలు వ్రాయాలి అంటే, ఆవృత్తాలు మారాలి. కాదు. ఈవృత్తాలే ఆవాడుకభాషలో వ్రాస్తాము అంటే ఆవృత్తాలకి ఆభాష తిరిగిపోయింది. మళ్లీఅంత ప్రయత్నంచేసిన కవులు ఆవృత్తాల్లో యీభాషని వంచితేగాని అంతసాఫీ తిరగదు. అది కాలగర్భంలో వున్నపని.

వచనంలో వాడుకభావాలు చెప్పటానికి వాడుకభాష - కుదిరినట్లుగా గ్రాంథికభాష కుదరదు. వాడుకలో లేనిభావాలకు గ్రాంథికభాష కుదరవచ్చు. మిక్కిలి వాడుకలో వుండేభావాలు ఆభాషలో చెప్పటం పరమ అసహ్యం.

వాడుకభాష వ్రాస్తే కొందరు మాకర్థం కావటంలేదు. చదవటం యెట్లాగో తెలియటంలేదు అంటారు. వారు మాట్లాడటంలో వున్నఒడుపు తెలియక అట్లా అనటం. ఆ ఒడుపే భారతంనిండా వున్నది. వారు భారతం చదివికూడా అట్లాగే అంటారు అయితే.

కొందరు "దుయ్యబట్టటం" మొదలయినవి ప్రాంతీయాలు. అవి వాడితే యెట్లా గబ్బా అంటారు. ప్రాంతీయాలు గ్రాంథికభాషలో కొల్లలుగా వాడతారుగా మరి. ప్రాంతీయశబ్దాలు అని తోసివేయటం గ్రాంథికభాష చేయదు. ఆవిషయంలో గ్రాంథికభాష భాషావైశాల్యం పరిగణించిందన్నమాట. అట్లా తప్పు పట్టుకుంటే వాడుకభాష తనవైశా

ల్యం సంకుచితపరచుకుంటోంది అనిఅర్థం. ప్రాంతీయశబ్దాలు భాషా దేవి విస్తారమైనతనువు. అవి తీశేస్తే ఆవిడ గుజ్జు అయిపోతుంది. కావ లిస్తే ప్రాంతీయశబ్దాల పట్టికలు ఇవ్వవచ్చును.
వస్తోంది, వెళుతోంది, ఇటువంటి మాటలు వికారంగా వున్నవనీ అవి కుంటినడక వ్యత్యస్తపుమాటలనీ అంటారు.
"వస్తోంది" అన్నమాట "వస్తున్నది" అని ఉండాలని వారిఊహ. వాడుకభాషకు కూడా కొన్ని నిబంధన లేర్పరచి, దాన్ని సంస్కరిద్దా మని వారి ఉద్దేశం.
ఇదివరకు నన్నయాదులసంస్కారం వీరు ఒప్పుకోలేదు. ఎందు కనీ. దానికి సామర్థ్యంలేదని. అది వికృతంగా వున్నదనీ. మరితాము చేయబోయే సంస్కారానికి ఆదశ పట్టదూ,కొంతవరకే నాయెను.
కొందరుకవులకు అదొక మోస్తరు ఒత్తుఅక్షరాలు రాకుండా నీళ్లవలె సాఫీగా నడుస్తున్న కవిత్వమే కవిత్వ మనిపించినట్లు, కొందరికి అందరికీ అర్థమవుతున్న శబ్దాలే యేరి అదొక మోస్తరు సాఫీగా వుండాలని వాడుకభాష.
ఎవడు వాడేభాషవాడు వ్రాస్తాడు. నేనుమా 'నందమూరు'లో చిన్న తనంలో నాకువచ్చిన భాషానేను చదువుకోగా నాకువచ్చిన భాషా రెండూ నాలోకలిసి యేపరిణామంపొంది నానోటివెంట వస్తుందో అది మాట్లాడతాను. అదే వ్రాస్తాను.
ఎవరు ఎట్లాంవ్రాసినా ఎట్లామాట్లాడినా వారివ్రాతకి వారిమాటకి భిన్న త్వం వుంటుంది. ఆవ్రాసేవారూ ఆమాట్లాడేవారూ వ్యక్తిత్వంకలవా రైతే అదీ కనపడుతూ వుంటుంది. తనువ్రాస్తోంటో తనఆత్మ అందులో కనబడుతూ వుంటుంది. ఆ ఆత్మనిబట్టి అతను వాడేశబ్దాలూవుంటవి. మన కునచ్చితేఅందం. కాకపోతే బాగులేదు అంటాం. ఒకడికి పుల్లకూర ఇష్టమైతే ఒకడికి ఇగురుకూర ఇష్టం.
ఇది నాచెవికి మహా అసహ్యంగా వినబడుతోంది అంటే, నాచెవికి చాలా శ్రావ్యంగా వున్నది.

అనేకమారుమూల శబ్దాల్లో క్రొత్తక్రొత్త రకంగా కొత్తగా సమాసా
లల్లో తెనాలి రామలింగ కవికి సౌందర్యం కనుక్కొని అతని ఆత్మలోంచి
ఆకవిత్వం వచ్చింది. అటువంటి మార్గం పోయినవాని తేట భాషలో
మళ్లీ. అతన్ని కాదంటానికి మనకు వాక్కు చాలదు.
ఒకకవిఅన్నాడు నాఆత్మ యిదిరమ్యం అనినిర్ణయించిన దానికి నువ్వె
వరు కాదనేందుకు అని.
ఒకొక్కని స్వభావం వేరయినకొద్దీ అతనిశబ్దసముదాయం అది చెప్పే
రీతీ భేదిస్తూవుంటుంది. అతని స్వభావంవల్ల ఆశబ్దాలే ఒకొత్త నాదు
తిరుగుతవి. ఇతరులకు అంతా అది కొత్తగావుంటుంది. అతనిభావం తె
లుసుకోవాలీ అంటే, ఆ అతనిమాటలవంపు వాని స్వభావంవల్ల ఆమా
టలకు వచ్చే మార్పూ ఓపికతో తెలుసుకుంటేనేకాని తెలియదు.
అది అందిరికీ తెలిసేటట్టు గా వుండాలికానీ అందరూ అతన్ని తెలుసుకు
నేందుకు ప్రయత్నిస్తారా అని అంటే? అందరూ అతన్ని తెలుసుకునేందు
కే ప్రయత్నించాలి.
కవి, న్యాయనకాడు ప్రభువువంటివాడు. వాడిభాష మనము చదువు
కోవాలి. ఆ సేతుశీతాచలం ఇంగ్లీషుచదవటంలే! ఎందుకు? దొర వా
డూ! కాని వాడిభావం మనకు తెలిసిసేటందుకు వాడూ ప్రయత్నం
చేస్తాడు.
గమ్యతావిషయమే చెవివల్ల నిర్ణయించాలి అంటే దానికచివర నొర
కదు. "సహృదయ" శబ్దానికి లక్ష్యం నిర్ణయించాలిశిసట్లు. నీచెవికి
అందం తెలియదూ అంటే నీచెవికి తెలియదు. చివరకు పదిమంది
అన్నమాటకు పైచేయి యిస్తే అది ఒక బోర్డులోవున్న మెంబర్ల చేత
చేతులెత్తించినట్లే. భాషకికూడా ప్రజాస్వామ్యపద్ధతిసూత్రాలు
పట్టించి పాడుచెయ్యటం అవుతుంది.
మార్గు మూలశబ్దాలు అని యింకోతగాదా. ఇది యింగ్లీషులోంచి
"అబ్ సోలీటు" మాటలు అన్నదానిలోంచి తెచ్చుకున్న కొత్తవిష
యం. ఒకపండితులు అన్నారుగదా ఒకకవి తానొకశబ్దమువాడకలో

ఘుండగా వినవంతసేపు అది ప్రాతశబ్దమనీ; వాడుకలో వినటంతోనే క్రొత్త నవనవ లాడుశబ్దమవుతుందనీ. అన్నారు. ఆవాడటం ఒక్కడు వాడినాఅవుతుంది. అయితే ఒకచక్కనివాడుకలో ఉన్నమాట కాలకర్మదోషంచేత తనువినకపోతే అంతచక్కనిమాట తనభాషలో నుంచి ప్రాతమాట అని మినహాయించుకోటమేనా! అందుకనే శబ్దానికి వాడుతున్నారా! లేదా! అనికాదు. అది సుందరమైన దవునాకాదా అని. ఈబహుధా విచారాలన్నీ కట్టిపెట్టితే—

ఏకవికి, ఏవ్రాతగాడికి, ఎప్పుడు ఏది రమ్యంగా వుందనితోస్తే అది వ్రాస్తాడు. అది రమ్యంకాదూ అని తోస్తేకాలం తోసేస్తుంది. ఒకప్పుడు రమ్యమైనదాన్ని రమ్యంగాలేదని కాలం అనుకునివదిలివేస్తే అదేమళ్లీకొన్నాళ్లకు దాన్నిపునరుద్ధరిస్తుంది. అటు జరగదూ! ఈఅనంత కాలంలో, అనంతభాషల్లో, అనంతమార్గాల్లో, కొన్నిమంచివిపోకా, కొన్ని చెడ్డవే నిలవకా, ఎట్లా వుంటుందో యెవ్వరుచెపుతారూ!

వి. సత్యనారాయణ.

# నన్నయ తిక్కనలు

## కద్రూవినతలశీలము.

విశ్వనాథ వెంకటేశ్వర్లు గారు.

నన్నయ తిక్కనలిర్వురును ఆంధ్రసరస్వతి నోచుకొన్న నోములు పంటలు. తెలుగులో కవులెవ్వరున్నా రని చప్పరించు నాంగ్లేతరభాషా పండితులకుఁ గూడ వారిపేరులు వదనముద్రావతారసూత్రములు.

ఇంక నాంధ్రసారస్వతాభిమానులయందుఁ గొందరికి నన్నయ్యయే కవి. కొందరికిఁ దిక్కన్న యేకవి. సంస్కృతభాషయందు పరిపాకము కలవారికి నన్నయ్య తిక్కన్నను దాటినవాఁడు. తెలుగునుడికారమునకుఁ బడిపోవువారికి తిక్కన్నకు బృహస్పతియే చాలఁడు. వారివీరికైనను తమయుద్దేశములను స్పష్టీకరించుటకుఁ ధైర్యము చాలదు. నన్నయ్య తిక్కన్నలపోలిక గాంధిఠాకూరులను పోల్చుట వంటిది. గాంధి వడుకునూలుగోచి ధరించును. ఠాకూరు పట్టుచొక్కాయి నిమ ద్రము కెరటాలు తాల్చును. గాంధి సర్వముండిత శిరస్కుఁడిగాఁ గనఁబడును. ఠాకూరు గడ్డపు దీర్ఘమనోహర వక్రకేశ స్నైగ్ధ్యములు మనవిమర్శనాబుద్ధికి చోటియ్యవు. లోకమునకు కొందరలో గాంధి బోసి నవ్వుకన్న ఠాకూరు ప్రయత్నతః పరికల్పిత నాగరక మృదుమందహాసమే హృదయము నకెక్కును. కాని గాఢమనస్కునకు హృదయ ముడికిపోవువానికి బహిస్సౌందర్యమునకుఁ దక్కువ నెలకట్టు వానికి గాంధిబోసినవ్వు స్వభావసిద్ధమైన ఛందోగమనము యత్నముచేసి కల్పించినది కానిది గోచరించును. అదినిడివిగాఁ ద్రవ్వ రెండువైపుల ఛాయావృక్షములు నాటి నెమ్మదిగా ప్రవహింపచేసిన పంటకాలువవంటిది కాదు. అడివిలో స్వతఃప్రవాహిని యగు సెలయేటిలో గలస్వభావసంపద. దానిలో నన్న ఛందోగమనము స్వభావమైన హృదయమునకే గోచరించును.

తిక్కన్నరచన గాంధి వంటిది. నన్నయ్య రచన ఠాకూరువంటిది. నన్న

య్య వచ్చితేనియలకాలువ ప్రవహింపఁజేయును. తిక్కన్న భాగీరథి ప్రవాహము తరుముకొని పోవును. నన్నయ్య తేనెకాలువయడుగున నేమున్నదో కానిపించదు. ఆకాలువలో నున్న తొంబది పాళ్లసౌంద ర్యము పైన చిన్నారి తరగలతో ముగ్గులు పెట్టునా తేనెలోనేయున్నది. తిక్కన స్వచ్ఛభాగీరథీ పయఃప్రవాహమున నద్దమునవోలె నడుగు ననున్న సకలజంతు సంతానము రత్నసమూహముకనబడుచునే యుం డును.

వారి రెండు ప్రత్యేక ఘట్టములు తీసికొని పోల్చిచూపుటకన్న నేకకథావస్తువు వారు రచించిన తావుగలదేని యచట వారిని పోల్చి చూచుటకు వీలుకలదు.

ఆదిపర్వము ద్వితీయాశ్వాసమున నన్నయ్యయు అనుశాసనికములో ప్రథమాశ్వాసమునఁ దిక్కన్నయు గరుత్మంతుని చరిత్రము కథాంగ ములు గారచించిరి. ఆరచనలు పోల్చినచో వారియిర్వురిరచనామార్గ ములు మనకు దెలియ గలవు.

అంగమైన కథ నన్నయ్యకుఁ బ్రధాన కథవంటిదికాదు. నన్నయ్యతా నొక పురాణ మాంధ్రీకరించుచుండె ననుకొనెను. ఆయనకు కథనడి పించుకొని పోవుట ప్రధానము. అందు మనకు కథ నడచుటతక్క నేమియు కనబడదు. తిక్కనతనకథాంగమునకు సైతము ప్రధానకథకెట్టి శక్తియిచ్చునో అట్టి శక్తినిచ్చును. ఈయనకుఁ గథనడుపుకు పోవుట ప్రధానముకాదు. ఔచిత్య భంగము రాకూడదు. తాను వ్రాయునది పురాణము. ఇదిదానికి అంగము అని తలచడు. తాను వ్రాయుచున్న కావ్యమన్న యూహయే ఆయనకు గలదు. ఆయనపాత్రములు సప్రా ణములు. వారిహృదయ మాడుచునే యుండును.

తిక్కన్న మాట తూచి వేయును. నన్నయ్య తేనె ప్రవహించుటయే చూచుకొనును. తిక్కన్న తనపాత్రల భావోద్వేగము మానసికస్థితి వారుపన్యసించు వాక్యములలోని సందర్భశుద్ధి యివన్నియు ప్రధాన ముగా పరిగణించును. నన్నయ్య ఆవంకకే పోడు. తిక్కన్న పాత్ర

ములు గాఢశీలములు కలవారు. హృదయము పరిపక్వమై తాము చేయుకార్యముల యొక్క తాము చెప్పుమాటల యొక్క ఫలాఫలములు చక్కగా తెలిసికొని వాని నను భవింతువారు

వినతకద్రువలు కశ్యపుని సేవించి యిరువురు వేవురసుతులను బడసిరి. వినతయండంబు లెన్నాళ్లకు నవియలేదు. కద్రువ కువేయిమంది బిడ్డలు పుట్టిరి. వినత, వగపు, మత్సరము, గదిరి తనయండములలో నొకదాని నవియించెను.

> దాని నపరార్ధకాయవి
> హీనుడు పూర్వార్ధతనుసహితుడు ఘనుఁడరుణుం
> గా నుదయించె సుతుండు మ
> హానీతియుతుండు తల్లి కప్రియమొనగన్?

—నన్నయ్య.

'అపరార్ధకాయ విహీనుడు' అనినం జాలును. పూర్వార్ధతనుసహితు డననక్కరలేదు. కాని ఆయన కవిత్వ మా సమాసఘటనంబున నున్నది. 'మహానీతి యుతుండు' అని యీ సందర్భమున చెప్పనక్కర లేదు. దానివలన సమకూరు మహార్థము లేదు. కాని ఆశబ్దములవలన పద్యములకు ధారాశుద్ధి వచ్చుచున్నది.

> పులు గొక్కడు పూర్వాంగము
> గలిగి జనించుటయు వాని గని యాసలి గ
> న్నుల నశ్రుజలంబులు పె
> ల్లొలుకగ శోకమున మునుగు నుల్లముతోడన్.

నివ్వెఱ పడియుండ—'

—తిక్కన్న.

ఇందు నన్నయ్యను బోలిన యొక శైలియెడల ప్రయత్నము లేదు. ఎంత వరకు నవసరమో అంతవరకే చెప్పఁబడినది. ఆగ్రుడ్డు నవియించుకొన్న వినతమనోభావములు తిక్కన్న చిత్రించినాడు. దానినే నన్నయ్య 'తల్లి కప్రియమొనగన్' అని ఒక మాటలో త్రోసివేసినాడు.

అట్లుపుట్టిన యరుణుడు తల్లికి శాపమిచ్చి తనదారినిఁబోఁజనినాఁడు. నన్న య్యగారియరుణుడు తల్లినెడలఁ గోపించి శాపమిచ్చి కోపముతోడనే నిష్క్రమించినాడు. అతనికి కోపము వచ్చినకారణము కూడతనకు సంపూర్ణదేహాత్వసిద్ధి లేకుండచేసినందులకే. తిక్కన్నగారి యరుణున కందునకుఁ గాదు. ‘మత్సరమున జాపలంబునను’ అవియించిన దని. ఆదుర్గుణము లామెలో నున్నందులకు.

ఇట్లు శాప మీయగా—

> వెలవెల బారుచు వడకుచు
> నలుకుచు తనమోము చూచు నయ్యంగన స
> ప్పలుగు కృపఁజూచి తల్లీ!
> వలవ దడల నిది విధాత్రృవశమున వచ్చెఁ’

ఇది తిక్కన్నరచన. వినత వెలవెలబారుచు ననూరుని మోముచూచుచున్నదట.

ఆవినత యప్పటి మౌగ్ధ్యము దుఃఖము. సుతప్రేమ దిగ్భ్రాంతి యెంత రమ్యముగా నొక్కమాటలోఁ జెప్పఁబడినవి. దిగ్భ్రాంతయైన తల్లిని జూచి యరుణుడు తనయౌద్ధత్యము మానినాఁడు. కరగిపోయినాడు. ‘తల్లీ! వలవ దడల నిది విధాత్రృవశమునవచ్చెఁ’ ఆ ‘తల్లీ’ అన్నసంబోధనలో ననూరుని హృదయదుఃఖము తరుముకొని వచ్చుచున్నది. ఆశాపము విధాత్రృవశమున వచ్చినదట. ఇదినీతి. నన్నయ్యగారు వ్రాసిన ‘మహానీతియుతుండు’ అన్నవిశేషణము తిక్కన్నయనూరునకు బాగుగాఁ జెందును.

ఉచ్చైశ్శ్రవమును చూచినసందర్భమున కద్రూవినత లిద్దరును సముద్రతీరస్థ ప్రమదవనమునవిహరించుచుండిరి. ఆసమయమున నన్నయ్యసముద్రమును వర్ణించినాడు. తిక్కన్న ఉద్యానవనమును వర్ణించినాడు. నన్నయ్యసముద్రవర్ణనలో అప్రతిహతుడు. ఆసముద్రగాంభీర్యమునకును నన్నయ్యశైలీగాంభీర్యమునకును సరిపోవును. ఇతనిశైలీగాంభీర్యము

ఆగాంభీర్యమును ధ్వనించుచున్నది. అరణ్యపర్వము తృతీయాశ్వాస మున అగస్త్యుడు సముద్రము చుళుకించబోయినప్పుడు, నన్నయ్య చేసినసముద్రవర్ణన ఆమహాకవిసముద్రమును చూచి యెంత పొంగి పోయెడువాడో తెలుపగలదు ఇంగ్లీషులో కొందరుకవులు కొండలను చూచి సముద్రమును చూచి తన్మయత్వమునుపొంది వానినిగూర్చి కవిత్వము వ్రాసినవారు కలరు. మన యాధునికకవులు వారివలె మనకవులు ప్రకృతిచిత్రములను చూచి హృదయము పొంగి వ్రాయలేదనియనుకొనుచుందురు. నన్నయ్యసముద్రవర్ణనలు చూచి నచో ఆయన ఆసముద్రము వంకఁ జూచుచు నెన్నాళ్లు గడపెనో యని పించును.

తరువాతకథలో నన్నయ్య తిక్కన్నల పాత్రపోషణలో చాలభేద మున్నది. ఇద్దరికద్రువలు వినత నెట్లామోసముచేయుట యని యూహిం చుచున్నవారలే. కాని కద్రువ యిట్లూహించుచున్న దని నన్నయ్య విషయమున చెప్పిన తెలిసికొనవచ్చును. తిక్కన్న కద్రువభావము తెలిసికోరాదు. తిక్కన్నవినత ముద్దరాలు. సద్భావ. 'అయాగో' 'ఒథెల్లో'ను ఎట్లు మోసములోనికిదించెనో, కద్రువ వినతను అట్లు దించి నది. తిక్కన యిట్టిచోట్ల మహాశిల్పియనదగును. గుర్రమును చూచుట తోడనే దానితోక నల్లగా నున్నది అన్నది నన్నయ కద్రువ. వినత కాదన్నది. వెంటనే కద్రువ పందెమునకు చరచినది.

ఇందు కథారమ్యత లేదు. అంత వెంటనే కద్రువపందెము పట్టమనిన వినతకు సంశయము కలుగకపోదు. కాని యిట్టి యూహాలతో లాభము లేదు. ఇంక తిక్కన్నగారు.

'వినతహయమింతయొప్పునె
అనూనధవళప్రభాఢ్యమై యని పలుకన్
విని కద్రువ యపరాంగం
బున నీలిమ దోచె ననియె.'

వినతహాయు దేహథావళ్యము మెచ్చుకొనుచున్నది. 'చివరతోక నల్ల గా నున్నదిలే,' అని కద్రువ యన్నది. వినతమాటయేగిట్టదు కద్రువకు. వినతఅనినమాట కాదనుటయే కద్రువపని. వినతయన్నచో కద్రువ కంతయీర్ష్య. తనయెడల కద్రువ యింత యీర్ష్యగలదియని వినతకు తెలియదు. వినత యన్నదిగదా?

'యిటులాడితి, నవ్వులకాడితో, నిజంబునకునో నీదుచూపునకు పోలిన భంగియె చెప్పుము' అన్నది.

కద్రువ మోసముచేయుటలో అందివేసిన చెయ్యి. 'అయ్యగో' కులప్ప గారు. నవ్వుతెచ్చుకుని తానుసద్భావవలెనే ఆ! 'అదేమిమాట! నల్లగా కనబడుచునే యున్నదిగదా!' అన్నది. పాపము వినత మరల చూచి కాదన్నది. అప్పుడు కద్రువ 'వృథామాటలెందుకు! పన్నిదమేమి చెప్పు' మన్నది. నన్నయ్య కద్రువవలె యిది హాఠాత్తుగా చెప్పినమాటగాదు. మాటమీదమాట పెంచి తనదురుద్దేశ్యము వినతకు తెలియకుండ జేసినపని.

"అనిన విని కద్రువ వినతవదనంబున చూడ్కినిలిపి
        నీవు గెల్చిన దాస్యంబు నీకు నేను
        చేయగలదాన నేను గెల్చినను నీవు
        నాకు చేయంగగలదాన వీకడింది
        పన్నిదము సర మని తెగబాటి బలికె"

ఇందు 'వినతవదనంబున చూడ్కినిలిపి తెగబాటిపలికె' అనుటలో చిత్రమున్నది. ఆచూపు ఆ తెగబాటిబలుకుట పీనివలన వినతబెసికి పో లేదు. ఆచూపుతైక్ష్ణ్యము ఆమాటవేగము కద్రువచేయుచున్న మోస మునుగూర్చి ఆలోచించనీయదు. వినతరక్తమును గూడ వేడి యెక్కింగ కద్రువపందెమునకు సరియే యనిపించెను. అప్పుడు

        "ఆపొలతి యట్లు వలికిన
        శాపమ్ముప్రేరేపనరుణాజననికి నుతా్న

హాహా పేత మయ్యే చిత్తం
ఆపన్నిదమునకు నేమి యనగల దధిపా"

కవికి సామాన్యబుద్ధికి గోచరించనిభావములు గోచరించును. మనమొక చెడ్డపని చేసినచో, ఇట్లెందుకు చేసితివనియితరులధిక్షేపింతురు. మనము నితరుల నట్లే యధిక్షేపింతుము. కాని దైవముతోసుక వచ్చుచున్నప్పుడు అదిచేయుట చేయకపోవుటలకు మనమెవ్వరము? ఈజిజ్ఞాస కర్మసిద్ధాంతికి దెలియును. అటే కవికిగూడ దెలియును. కనుక వినతపడినయీతొందరకు వినతయే కాదు కారణము. అరుణుడిచ్చిన శాపము కూడను. తరువాత 'నరుణజననికి' యన్న ప్రయోగము ఎంతయర్థవత్తుగా నున్నదో చూడుడు.

"ఆపన్నిదమునకు నేమి యనగల దధిపా" భారతము వ్రాయుచున్న మహానుభావునకు ఈమాత్రపు రోషమెక్కించుపన్నిదము లోనున్న చురుకుదనము తెలియదా? అందుకనియే యాపన్నిదమున కేమి యన గలదన్నాడు. అప్పుడు కద్రువ "పతిపరిచర్యకుం గాలంబయ్యె.మఱివచ్చి యశ్వంబు నాలోకింత మని నెపంబిడి యప్పటికింజూపు దప్పించె."

అప్పుడే పోయి గుఱ్ఱపుతోక చూచిరో కద్రువయోడిపోవును. అంతరోషముతో అంతయుత్సాహముతో చరచినపన్నిదపుమాట వినత యంత తేలికగా వదలదు. అందుచేత కద్రువ పతిపరిచర్యమీద సాకు కల్పించినది. మహాపతివ్రత యైనవినత తప్పుకోలేకపోయినది. నన్నయ్యగారి కద్రువ "యిప్పుడు ప్రొద్దులేదు. రేపకడ చూతమన్నది" ఆమాటలోని సామర్థ్యరహితత ఇందలిసామర్థ్యసహితత్వము చూడనగును.

తరువాత గుఱ్ఱపుతోక నల్లగాచేయవలసినదని కొడుకులను అడుగుటలో ఇద్దరు కద్రువలకు భేదమున్నది. నన్నయ కద్రువ పిచ్చిదానివలె బేలవలె "మిమ్మందఱ వేడెద నన్నలారనాపంపుసేయుఁడు నన్నురక్షింపుండు కామచారులకు దుష్కరము కలదె" అని వేడుకొన్నది. తిక్కన కద్రువ 'కుటిలంపుతలపున కొడుకుల రావించినది.' నన్నయకద్రువ

కొడుకులకడ కేగినది. రావించి కద్రువకన్నీరుపెట్టుచు వారికుప్రేమపు ట్టునట్లుగా తన యధికారమును చూపుచు మాట్లాడినది.
ఇద్దరుతల్లులు కొడుకులకు శాపమిచ్చిరి. నన్నయకద్రువకొడుకు శాపా సుభవభీత చిత్తుడు కర్కోటకుడు తల్లిపంచినరూపంబున 'గుఱ్ఱము వాలమ్మున నీలమ్ముగాఁ బట్టి వ్రేలుచుండె.' తిక్కనకద్రువకొడుకులు కొందరు 'శాపపాతనవృత్తికి వెరచి, అయ్యశ్వవాలధిరోమము లావ్రిదిపి నీలరోమసంచయ మైరి.' పలుకునుడికారమున కిది యుదాహరణము. కద్రువ కొడుకులు నీలరోమసంచయ మైనారట. ఒకవేళ వినత దగ్గరకు పోయి చూచినను తెలిసి కొనలేదు. నన్నయవినత దగ్గరకుపోయి చూచె నా వ్రేలాడుచున్న కర్కోటకుడు కనంబడడా? తిక్కన్నగారు ప్రతి మాటయు నంత తూచివేయును. అప్పుడు తిక్కన్న కద్రువ సంతో షముతో పోయి వినతను పిలచి తోకనల్లచూపించెను. వినతదైన్యము నొందెను.

'నగుచు న్గద్రువ వరవుడ వగుము విచారంబువిడచి' అన్నది. తనమోసము నెగ్గిన దని కద్రువచూపిన దురుసుదనము వినతను పెట్టిన తొందర తానేమొ లెక్కలేనట్టునటించుట ఇందు గోచరించుచున్నది. ఇట్టివేవియు నన్నయయందు గనరావు.
తిక్కన్న తాను పోయినత్రోవ అంతట రత్నములు గూఢ నిక్షిప్తము ములు చల్లుచుపోవును. నన్నయ్య ఊరక తేనె కాల్వకట్టించుచు పోవు ను. నాకు మాత్రము తిక్కన్నగారి రచన సర్వోత్కృష్ట మని. నన్న య్యగారికన్నతిక్కన్న చాలా గొప్పకవి. మహాశిల్పి.
నన్నయ్యయేభారతమంతా వ్రాయకుండుట తెలుగుభాష నోచుకొన్న నోముపంట. నన్నయ్య గారు అసలే వ్రాయక యుండుట నేను కోరను. భాషకు నామహాత్ముని మధుస్రవంతికయు కావలయును. ఈమహాభాగుని రత్నాపణమును కావలయును.

బందరు. వి. వెంకటేశ్వర్లు.

# పురాతన భారతీయ పురనిర్మాణము.

శ్రీమాన్ కిళాంబి రంగాచార్యులుగారు. ఎం, ఏ, బి, యల్
(అధ్యాపకులు. శ్రీవిజయనగరం మహారాజావారి కళాశాల.)

గ్రామపురపట్టణాది నిర్మాణవిషయమయి పూర్వ మార్యు లెట్టిజ్ఞాన మును గలిగియుండెడివారో, యేరీతిని వారలట్టి జనసంఘనివేశస్థానము లను గట్టుచుండెడివారో, మనకు శిల్పశాస్త్రంబు వలనను, పురాణ ములవలనను, శ్రీరామాయణ మహాభారతములవలనను, జ్యోతిషశాస్త్ర గ్రంథములవలనను, నీతిశాస్త్రగ్రంథములవలనను దెలియుచున్నవి. శిల్ప శాస్త్ర మేకారణములవలననో సంస్కృతవాఙ్మయమునందుఁ దదితర శాఖలవలెగాక యత్యధికంబగు శైథిల్యంబును బొందియున్నది. శిల్ప శాస్త్రగ్రంథములు వ్యాఖ్యానాదిరహితములై యుండుటంజేసియు, శిల్పశాస్త్రజ్ఞులు దేశమున లేకుండుటంబట్టియు, శిల్పశాస్త్ర గ్రంథ ములు దురవగాహములై యున్నవి. పూర్వమునమాత్రము పురనిర్మాణ ములంగూర్చి ప్రజలలో విస్తారమగుజ్ఞానము వ్యాపించియుండె నని యును, శిల్పశాస్త్రము మనపూర్వులచే నత్యధికముగఁ గృషి చేయఁబడుచుండెడి దనియును నిశ్చయించుటకుఁ దగిన విషయములు గాన్పించుచున్నవి. భృగు, అత్రి, వసిష్ఠ, విశ్వకర్మ, యమ, నారద, నగ్నజిత్తు, విశాలాక్ష, పురందర, బ్రహ్మకుమార నందీశ, శౌనక, గర్గ, వాస్తుదేవ, అనిరుద్ధ, శుక్ర, బృహస్పతి, యనుపదునెనమండ్రు శిల్పశాస్త్రకర్తలగు ఋషులు మత్స్యపురాణంబున (జేర్కొనఁ బడు చున్నారు. మానసారంబున నిరూపింపఁ బడిన విశ్వకర్మ, విశ, విశ్వ సార, ప్రబోధక, వృత్ర, మయ, త్వష్ట, మానబోధ, విశ్వబోధ, మహాతంత్ర, వాస్తు విద్యాపతి, ఆదిసార, నయ, విశాల, విశ్వకాశ్యప, వాస్తుబోధ, పరాశరీయక, కాలయూప, చైత్య, చిత్రక, అవశ్య, సాధ

కసార, సంహిత, భాను, ఇంద్ర, లోకజ్ఞ, సౌర, అను శిల్పశాస్త్రజ్ఞచుంచువుల నామపట్టికను, తోదరానందమునఁ జెప్పంబడిన వరాహమిహిర. చ్యవన, కశ్యప, వృద్ధగర్గ, ఉత్పల, మాండవ్య, భరద్వాజ, వృద్ధవాశిష్ఠ, లల్ల, అను శిల్పశాస్త్రకర్తల నామములను మనము పరికించి చూచినచోఁ, బూర్వకాలమున భరతఖండంబున శిల్పశాస్త్ర మెటులఁ బ్రజలచేఁ బఠింపంబడుచుండెడిదో మనము కొంతవఱకు తెలిసికొనంగలము. వీరిలోఁ జాలమంది నామములే మనకుఁ దెలియునుగాని వారియుద్గ్రంథములు మనకేమియుం దెలియవు. తిరువాంకూరు మహారాజుల యనుగ్రహమువలనఁ గొంతకాలముక్రింద శిల్పశాస్త్రములు కొన్ని ప్రకటింపఁబడినవి. ఇప్పటికి దేశమునఁ గనుంగొనంబడిన శిల్పశాస్త్రగ్రంథములలో మానసారం బనునదియు, మయమతం బనునదియు, ముఖ్యమైన వానిగఁ బరిగణింపఁ బడుచున్నవి. ఈపుస్తకము లెవ్వారిచే నేకాలమున వ్రాయబడినవో నిర్ణయించుట బహుకష్టము. మానసార గ్రంథరచనాకాలనిర్ణయముంగూర్చి విద్వాంసులు చర్చలు గావించిరి; కాని కాలనిర్ణయముమాత్రము కాలేదు. ఈయుద్గ్రంథములయొక్క కర్తనుగూర్చి వివిధరీతులఁ బండితులూహించుచున్నారు. మయమతముంగూర్చి విద్వాంసులేమియును వ్రాసినట్లు గానిపించదు.

వాస్తుశాస్త్ర మనఁగా గృహనిర్మాణ విషయికశాస్త్రము, శిల్పశాస్త్రములో నొకభాగముగఁ బరిగణింపఁబడఁ దగియున్నను, సాధారణముగా నయ్యది శిల్పశాస్త్రములం దుండు విషయముల నన్నిటినింగూర్చి చెప్పుచున్నది. "దేవతలును, మనుష్యులును వసించియుండునట్టి ప్రదేశము వాస్తు వనంబడు. ధరాహర్మ్య యానపర్యంకంబులిం దిమిడియున్నవి. వీనిలో ధర నాశ్రయింపక యుండున వెవ్వియులేవు; గాన ధరయే ముఖ్యమైనది. ప్రాసాద, మండప సభాశాలా ప్రపామండపములు హర్మ్యవిభాగములుగ చెప్పంబడుచున్నవి." అను మానసారవచనం బీదిగువ నుదాహరింపఁబడిన మయమతవచనములతో సరిపోవుచున్నది. "అమర్త్య

శ్చైవ మర్త్యైశ్చ యత్రయత్ర వసంతి హి, త ద్వాస్త్వితి మతం త
జ్జ్ఞైః తద్భేదంచ వదామ్యహమ్, భూమిప్రాసాదయానాని శయనంచ చతు
ర్విధం, భూరేవ ముఖ్యవస్తు స్యాత్ తత్ర జాతాని యానిహి, ప్రాసా
దాదీని వస్తూని వస్తుత్వాత్ వస్తుసంశ్రయాత్, వస్తూన్యేవ హి తాన్యే
వప్రోక్తాన్యస్మిన్ పురాతనైః, గ్రామాదీన్యేవ గౌణాని భవత్యంగీ మహీ
మతా, సభా శాలా ప్రపా రంగమండపం మందిరం తథా, ప్రాసాద ఇతి
విఖ్యాతం....శిల్పశాస్త్రమితి పురాతనమ్. అనినుడువుచు "హావెల్"
అనుపాశ్చాత్యవిద్వాంసుఁ డీరీతిగ వ్రాయుచున్నాఁడు. "శ్రౌతశాస్త్రము
తో జ్యామితిపద్ధతికింగల నత్యధిక సంబంధమును, స్థపతి కర్మిష్ఠిగఁ బరిగ
ణింపఁబడియుండుటయు నీశాస్త్రము బహుపురాతనకాలమునుండియుఁ
బ్రబలియుండిన దని తెలియఁజేయుచున్నవి. సమచతురస్రముల ఫలము
లుగలవృత్తములను గనుంగొనుట మున్నగుక్లిష్టకార్యములఁజేయ నవస
ర ముండిన వైదికకర్మలవలన రేఖాగణితము నార్యులు గనుంగొనిరి.
ఆర్యగ్రామనిర్మాణము యజ్ఞభూమిపరికల్పనపద్ధతిని శిల్పశాస్త్రము
లలో వ్రాయఁబడినది. అందువలన నీశాస్త్రము వైదికకాలమునాఁటి
దనియు, ఆర్యాక్రామకుల పరిఖాది పరివృతనివాసస్థానముల సంబం
ధము గల దనియు, నేను నిశ్చయించుట సత్యవిరుద్ధము కాదు.

ఋగ్వేదంబున పుర మనుపదంబు తఱచుగఁ గాని పించుచున్నది. ఈపద
మున కొకయర్థము దుర్గము. రెండవది పరిఖ. అట్టిదుర్గము లొకప్పుడు
విశాలములైన వనియును, విపులమైన వనియును జెప్పఁబడుటచే నాబ
హు పురాతనకాలమునాటికే కొన్ని దుర్గములు బహువిశాలములయిన
వియై యుండెడివని మనము చెప్పవచ్చును. అశ్మమయము లైన దుర్గ
ములును బేర్కొనఁ బడుచున్నవి. ఇనుపకోటలు (అయసీ) ఋగ్వే
దములోఁ బేర్కొనఁబడుచున్నను, బహుశః దుర్గములదుర్గమత్వ మీవ
నముచే నిరూపింపఁబడుచున్నది. బహుగోవులు గల దుర్గములు చెప్పఁ
బడుటచే (గోమతీ) నీదుర్గములయందె గోవులనుంచు నాచారముండెడి

దని మన మూహింపవచ్చును. వేయిగోడలు గలకోటలును (శతభూజి) శరత్కాలదుర్గములును (శారదీ) చెప్పంబడుచున్నవి. ఈశారద దుర్గములు దస్యుల వనియును, నయ్యవి యార్యులనుండి సంరక్షించుకొనుటకును, నద్యుపప్లవములనుండి సంరక్షించుకొనుటకును దస్యులచే నుపయోగింపఁబడుచుండెడి వని విద్వాంసు లూహించుచున్నారు. సంహితలలోను బ్రాహ్మణములలోను గూడఁ గోటల ముట్టడియు నట్టిసమయముల నగ్నిప్రయోగమును జెప్పంబడుచున్నవి. వేదకాలమునం దార్యులు గ్రామములలో నివసించుచుండెడివా రని స్పష్టము. కొన్నిచోట్ల గ్రామములు దగ్గఱదగ్గఱ నుండుటయు, మఱికొన్నిచోట్ల నయ్యవి యతిదూరముగ నుండుటయు, నట్టిగ్రామములఁ గలుపుచు రాజబాట లుండుటయు వేదములవలన నిశ్చయ మగుచున్నది. గ్రామములలో నశ్వ,గో, వృషభాది పశువు లుండెడివి. దినమంతయుఁ బశువు లడవుల మేతమేసి సాయంసమయమున గ్రామములం జేరికొనుట వేదములో వర్ణింపంబడినది. గ్రామములలో ధాన్యము మున్నగు వానిపాతరలు వేయబడుచుండెడి వని తెలియవచ్చుచున్నది.

పురాణాదులలోఁ బురవర్ణనముల మనము పరీక్షించినఁ గవీశ్వరు లాయాపట్టణములను వర్ణించుటలో నతిశయోక్త్యలంకారము తప్ప వేఱొకయలంకారమును స్వీకరింపకుండుట కనుచున్నారము. ఇట్టివర్ణనలు కవీశ్వరుల పౌరానుభవమును దెలియఁజేయుచున్నవి. శ్రీమద్రామాయణములో నయోధ్యా పురవర్ణనమును బరికించిచూచిన వాల్మీకి మహర్షికి నయోధ్యాపురమునం దుండిన యత్యధికగౌరవంబు స్పష్టమగును. ఆపురమునందైన ప్రాసాద, మందిర, గోపురాదులఁ దలఁచి తలఁచి మైమఱచి యవ్వాని నత్యధికసంతోషముతో నత్యధికగౌరవముతో నభివర్ణించుచుండును. వాల్మీకిమహర్షి తాపసియయ్యు నత్యధికముగ నయోధ్యను బ్రేమించియుండెను. అయోధ్యయందైన యత్యధికప్రేమచే వాల్మీకికిఁ గల్గిన పౌరధర్మజ్ఞానంబు, పౌరాధికారబుద్ధి, పౌరా

నుభవంబు, లంకాపురవర్ణనలో సువ్యక్తమగుచున్నది. నడురేయిని హను మంతుఁడు లంకారక్షకురాలైన రాక్షసిని గలిసికొనినపుడు ఆమె "అహం హి నగరీ లంకా స్వయమేవ ప్లవంగమ" అని ప్రత్యుత్తర మిచ్చెను. ఇట్టిపౌరానుభవమును మించిన మఱియొకటి యెచ్చోటను గాన్పింపదు, ఇట్టిపౌరానుభవముతో నాధునికులు సంచరించిన పురంబు లభివృద్ధిం జెంది సకలసుఖముల కాటపట్టులై సిరికిని వాసస్థానములై యుండుననుటలో నాశ్చర్యమేమియు లేదు.

విజయనగరము.

కిడాంబి రంగాచార్యుడు.

# దామెర్ల రామారావుగారు.

అడవి బాపిరాజుగారు, బి. ఏ.

దక్షిణదేశం యాత్రార్థమై పోయేవాళ్లు గమనించే ఒకముఖ్యవిషయం అక్కడ దేవాలయాల్లో చిత్రాలు చిత్రించేవాళ్లు, తంజావూరి చిత్రలేఖనాలు మొదలైనవి సృష్టించినవాళ్లు ఆంధ్రచిత్రకారక కుటుంబాలని అజంతాలో కొన్నిగుహలు ఆంధ్రులు నిర్మించినవే. వాటిలో చిత్రములు వాళ్లు చిత్రించినవే. మధ్యయుగంలో కొండపల్లి బొమ్మలు, చిత్రలేఖనాలు చాలాప్రసిద్ధి పొందినాయి. కొండపల్లి దశావతార ఆటపేకలు, కఱ్ఱబొమ్మలు తెలుగువాళ్లు ఎరగనివాళ్లు వుండరు. నైజాము సంస్థానములో ఆంధ్రులే హైద్రాబాదిఅను చిత్రలేఖనా సాంప్రదాయానికి మూలపురుషులు.

ఆటుతరువాత ఇటీవలవరకు ఆంధ్రులలో ప్రసిద్ధ చిత్రకారకులు ఎవ్వరు ఉదయించలేదు. ప్రప్రథమాన్ని ఆలోటు తీర్పించింది దామెర్ల రామారావుగారు.

ఇరువది యారు వర్షాలు ఆనందజీవియై చిత్రబ్రహ్మయై విచిత్రమగు నూత్న సాంప్రదాయం ఒక్కటి సృష్టించి రామారావుగారు తనసాంప్రదాయ తత్వం పూరిగా మూర్తీభవింప చేయకుండా చిన్నతనంలోనే వర్ణాత్మకంబైన సూర్యబింబంలో ఐక్యమైపోయారు.

ఈయన సాంప్రదాయాశయం పూర్తిగా గ్రహించాలంటే ఈయన చిత్రలేఖనాచరిత్ర కొంచెం గమనించాలి. చిన్నతనాన్నుంచి ఈయన బొమ్మలు గీస్తూనే వుండేవారు. పాఠాలు చదవడంకంటె పుస్తకాల్లో బొమ్మలు చూసివెయ్యడం ఈయనముఖ్య విద్యగా వుండేది.

ఇంతలో "రామ్" అను చిత్రకారకుడొకడు గున్నేశ్వర్రావుగారి నాటకాలకి తెరలు చిత్రించడానికి రాజమహేంద్రపురము వచ్చినాడు. ఈయన

చెన్నపురి ఆంధ్రనాయుడు కుటుంబానికి చెందినవారు. బొంబాయి పోయి చిత్రలేఖనవిద్య నభ్యసించి ఖ్యాతిపొందిరి. చెళ్లపిళ్ల వేంకటశాస్త్రులుగారు బందరులో నివసించడంచేత అనేకమంది యువకులలో సరసకవితాప్రౌఢిమ ఎట్లాపైకుబికిపోయిందో అలాగే రాముగారి రాకవల్ల రాణ్మహేంద్రపురాన యువకులలో చిత్రవిద్య ఉద్భవన్నమై పోయింది.

రామారావుగారున్ను రాముగారికి ప్రథమశిష్యులై అద్భుతంగా చిత్రములు వ్రాయ నారంభించారు. రమణారావుగారికి కుమారుని వర్తన నచ్చిందికాదు. గౌరవనీయమైన తనకుటుంబానకు రామారావు అపకీర్తి తెస్తున్నాడనిన్నీ, చదువులు చదివి పెద్దకుమారుడైన వెంకట్రావు గారివల్లే కీర్తిపొందాలిగాని బొమ్మలువేసుకుంటూ డ్రాయింగు మాష్టరవుట నీచమనిన్నీ ఆయన కూకలు వేసినారు.

కళోపాసకులకు శారద వివిధమార్గాల సహాయ్యం చేస్తూనే వుంటుంది. రాజమహేంద్ర బాలచిత్రకారకులప్రాపై వాళ్లు కళాతత్వాన్వేషులయ్యేటట్లు చేయుటకు వచ్చారా అన్నట్లు రాజమహేంద్రకళాశాలకు ఆస్వాల్డుకూల్డ్రేగారు అధ్యక్షులుగావచ్చారు. కూల్డ్రేగారు రసోపాసకులు కళాస్వరూపిన్నీ. చిత్రలేఖకులు. కవి. సంగీత విద్యావిశారదులు. అయిన ఈపాశ్చాత్యగురువు నెమ్మదిగా తనచుట్టున్ను పదిమంది కళాధిష్ఠానదేవి నారాధించు బాలకులను పోగుచేసుకున్నాడు. అందులో రామారావుగారొక్కరు.

రామారావుగారు స్ఫురద్రూపి. పలచని, పొడుగాటి రూపంతో, రసములు సుడులు తిరుగు నయనాలతో, అందమైనమోముతో, కళానిపుణత్వము వెల్లడించు దీర్ఘాంగుళులతో, తోడిబాలుర అస్పష్టగౌరవ సింహాసనాధ్యక్షుడై తిరుగుతూవుండడం కూల్డ్రేగారు చూశారు. తండ్రితో మాట్లాడినారు. పర్యవసానము రామారావుగారు బొంబాయిచిత్రకళాశాలలో విద్యనభ్యసించుటకు పోవుట.

ఆకళాశాలవారు రామారావుగారి కళాప్రౌఢిమచూసి మూడవయేటి తరగతిలో చేర్చుకున్నారు.

౨

బొంబాయిలో రంగులువేయు మెలకువలన్నీ చక్కగా బోధించేవారు. కాని ఆకళాశాల చిత్రలేఖనావిద్యార్థులు అయిదేండ్లు పూర్తిచేసి ఛాయాపటాల్ని నూనెరంగులతో పెద్దవిగా లిఖించడమో, లేక రవివర్మ గారి పద్ధతుల ననుసరించడమో చేస్తూవుండేవారు. వారికి భారతీయ సాంప్రదాయాలేమీ నేర్పబడుతూ వుండలేదు. విదేశమైన పాశ్చాత్య సాంప్రదాయములో తరఫీతుఇస్తూంటే భారతీయ కళాశయ భావాలలో తేలియాడు చిత్రకారకులు ఒక సంకరసాంప్రదయాన్ని జీవింపచేసారు. రవివర్మగారు దురంధరుగారు ఈసాంప్రాదాయానికి ఆదిపురుషులు.

సమస్తదేశాల్లోవుండే చిత్రకళాభిజ్ఞులూ భారతీయ మహాసాంప్రదాయమున వివిధరాష్ట్రీయమైనట్టి, వివిధయుగాల్లో విజృంభించినట్టిన్నీ పైన అన్నీ సాంప్రదాయాలుగుర్తించి వాటి అద్భుతతత్వముగ్రహించి ముగ్ధులైపోయారు; కాని వాళ్లెవరికి బొంబాయిలో పుట్టిన ఈనూత్నప్రాచ్య ప్రతీచీసాంప్రదాయసాంకర్యముఏమీనచ్చలేదు. రామారావుగారున్నూ తోడివిద్యార్థులు వల్లేకాక, నిర్మలభారతీయసాంప్రదాయము గుర్తిస్తూ చిత్రరచనాకౌశలమే మాత్రం కళాశాలలో నేర్చుకునేటట్లు కూల్డ్రే గారు కట్టుదిట్టాలు చేసారు. తనతో అజంతా ఎల్లోరా ఎల్ఫాంటా భువనేశ్వరం మొదలైన ప్రదేశాలికి రామారావుగారిని కూల్డ్రేగారు తీసుకువెళుతూవుండేవారు. భారతీయకళాసాంప్రదాయాన్ని వర్ణించు గ్రంథాలు చదివించేవారు. ఉదాహరణముగా మొగలు రాజపుత్ర మొదలగు అన్నిసాంప్రదాయములలో బయల్వెడలిన చిత్రాలనుండి తీసిన పటాలు కనబరుస్తూ వాటిలో వున్న కళాతత్వం ఉపదేశంచేస్తూ వుండే వారు. కళోపాసకుడి కళాశక్తి గ్రహించు నిధి ప్రకృతిని రామారా

వుగార్ని కూర్మశాస్త్రిగారు పాపికొండలు మొదలగు ప్రదేశాలకి తీసుకు పో
య్యేవారు; మా బెరాకా లోనవాలా ఖండాలా నాసిక త్ర్యంబకాది
ప్రదేశాలకు పోయేటట్లు చేసేవారు.

విద్యపూర్తిచేసుకుని రామారావుగారు దేశాలు చూసుకుంటూ జన్మ
స్థలమగు రాజనరేంద్రనగరం చేరినారు.

3

రామారావుగారికుటుంబం అంతా కళోపాసకులు. వారి మేన
మామలు చిత్రలేఖనయందు కొంచెం పేరుసంపాదించుకున్నారు. గాడే
పల్లి రామమూర్తిగారు సత్యనారాయణగారూ చిత్రలేఖనయందు
చాలా కృషిసలిపినారు. అభినవాంధ్రకవులలో నూత్న సాంప్రదాయకర్త
లైన కవికొండల వెంకటరావుగారు రామారావుగారి పెత్తల్లి కుమా
రుడు. భారతిలో మృదుమధురములగు కథలరచించే కవయిత్రి ఆదుర్తి
భాస్కరమ్మగారు రామారావుగారి అక్కగారే. అన్నగారైన వెంకట్
రావుగారు ఎమ్. ఏ, ఎల్. టి, ప్రభుత్వ చిత్రవిద్యోన్నత పరీక్షయందు
ప్రథమంగా కృతార్థత పొందారు. చెల్లెలు దిగుమర్తి బుచ్చికృష్ణమ్మ
గారు, ఆనంద చిత్రకళారసస్వరూప. తమ్ముడగు ప్రబోధచంద్రుని
ఒకపటానికి బొంబాయి నగరంలో జరిగిన చిత్రకళా ప్రదర్శనంలో
బహుమతీవచ్చింది. రసోపాసకులున్న యీకుటుంబం యావత్తూ
రామారావుగారి రసజ్ఞత మహాపుష్పంలా వికసించడానికి కారణస్వరూ
పులయ్యారు.

నూనెరంగులతో రామారావుగారు చిత్రకల్పనా పథాలలో విహరింప
ప్రారంభించారు.

మానవశరీరము అద్భుతరూపము. మగవాని తల. ఆలోచనలుతిరిగే
కళ్లు ఫాలంలోనిదిమ్మెలు చాతీ. పొంకాలు తిరిగినభుజాలు, చేతులు
నడుము గీతలు తొడలు పిక్కలు చిత్రమైన పాదాలు, స్త్రీమూర్తి
యొక్క వెచ్చని అంగాలు, ప్రేమలుట్టిపడు పెదవులు, సన్వేకళ్లు, సక

సాలు ఆలకించే తిరిగిపోయిన లేతతామరాకులు చెవులు. ముక్కు, మూడు రేఖలకంఠము ఆ దేహాలమిలమిల, మెరసి పోవునట్లు కూర్చు కొని యున్న వర్ణాలు ఇవి చిత్రకారుని ముగ్ధుణ్ణిచేస్తాయి. సృష్టికర్త లా పారకిస్తాడు వాళ్లే దిగంబరత్వం, సకలభావాలకు పుట్టినిల్లే అం టాడు. ఈవిధంగా పాశ్చాత్యశిల్పి చిత్రకల్పనాభావోన్మాది అయి పోతాడు. రామారావుగారు పాశ్చాత్య శిల్ప చాక చక్యం చవిగొ న్నాడు. ఎప్పుడు నవీనత్వం ఒలికించే మానవదేహ మాతని ఆకర్షించివేసింది. ఒక బాలికను ఒకయువకుణ్ణి సంపూర్ణ దేహాలు సకల విధాల ప్రదర్శించడానికి ఏర్పాటుచేసికొని నవరసాలు, నవభంగులు, అర్థభంగిమలు విరిగిపోవ స్రష్టకూడా ముగ్ధుకయ్యే చిత్రప్రపంచం అల్లివేసినాడు.

చిత్రరూపమైన ఈమహారాగంలోంచి గోపికాకృష్ణ అంజతావిహార విహారిణిరాణి, మొదలైన చిత్రాల కృతులకు కర్త అయ్యాడు. ఈచి త్రాల్ని చూచి కూర్డ్రిగారూ, భారతీయ శిల్పాచార్యులగు ప్రమోద కుమారచతోపాధ్యాయులూ, ముగ్ధు లయ్యారు.

కూర్డ్రిగారు భారతీయ సాంప్రదాయము సర్వస్వముగా సంపూర్ణము గా అవగతంచేసికొని హావెలులాం ఆనందకుమారస్వామియుక్తై పోయేవాళ్లలో ఒకడు. రామారావుగారి భారతీయశిల్పరహస్యం యావత్తూ బోధించా డు. అయినప్పటికీ ప్రతీచీ సాంప్రదాయాన్ని పూజిస్తాడు. ఆసాంప్రదా యసిద్ధాంతి కూడాను. శిల్పహిమాచలపంక్తులు అవతరింప దీక్ష వహించిన మాత్రికుడు. రామారావుగారు ఎండాకాలపు భూమిలా కూ ర్డ్రిగారి శిల్పజ్ఞానము తనివితీరగా యిమిడించుకొన్నాడు.

తాను రచించే చిత్రకల్పన రామారావుగారికి అశాంతిని ప్రసాదిం చింది. ప్రతీచీసాంప్రదాయము పూర్ణముగా అవగతంచేసికొన్న ఈ బాలశిల్పికి ఏమో ఆవేదన కలిగింది. కొన్ని నెలలు ఆతడేమీ చిత్రించ లేదు. "తీవ్రసంచయబాధితునికిదేశాటనం అన్నట్లు రామారావుగారు

దేశాలన్నీ యాత్ర ప్రారంభించారు. కతిపయప్రయాణాల్లో కలకత్తా చేరుకున్నారు.

ఇదివరకే కలకత్తాలో చిత్రప్రపంచంలో ఒక తీవ్రసంచలనం బయలుదేరింది. భారతీయనాగరికతకు ఆశయాలకు అత్యంతమధురంగా సరిపోయే మహాసాంప్రదాయం ఒకటి వుంటూంటే, ఏమీ సంబంధం లేని ఈ పాశ్చాత్య సాంప్రదాయం ఏమిటీ అని ఆనంద, కే కుమారస్వామి, హావెలు మొదలైన కళాభిజ్ఞులు వాదనలు చేసారు. మహాశిల్పిఅగు అవనీంద్రనాథ ఠాగూరు. నందలాలుబోసు, అసిత కుమారహాల్దారు, ముకుందారు, చట్టోపాధ్యాయులు, వెంకటప్ప మొదలగు శిష్యులతో పూర్వ భారతీయ సాంప్రదాయములు ఆధారం చేసికొని, ఒకనూత్న సాంప్రదాయం సృష్టించాడు. ఆసాంప్రదాయ కృతములైన చిత్రాలు దేశదేశాల విఖ్యాతి తెస్తూవున్నవి. రామారావుగారు ఈనూత్నవిజృంభణ పరికించుటకే కలకత్తా వచ్చారు.

కలకత్తాలో అవనీంద్రునిమ్రోల రామారావుగారు కొన్నిదినాలు నివసించారు. ఈక్రొత్త భారతీయ సాంప్రదాయభావము గ్రహించి, రాజనరేంద్రనగరానికి తిరిగి వచ్చారు. ఇన్నాళ్ళు ఆవేదనలోబడి, ప్రాచ్యప్రతీచీ సాంప్రదాయసమ్మేళనాత్మకమై నూత్న యుగాశయమైన వేరొక్క సాంప్రదాయము సృజింప ఒక్కశుభముహూర్తాన రామారావు సంకల్పించారు.

మానవరూపానందం సరిచూడ స్త్రీపురుష... (మోడెల్సు) ను వదలలేము. చిత్రఫక్కీ భారతీయం అవలంబించారు. మానవరూపానికి ప్రాధాన్యం యివ్వాలి. భారతీయాశయాలకి ప్రాధాన్యం యివ్వాలి. ఈలాటి సరససంయోగం తీసుకురావటం ఆంధ్రుల ప్రత్యేకశిల్పసాంప్రదాయమని వారివుద్దేశం. అందుకు తార్కాణం అమరావతీ స్థూపాంతరాలైన శిల్పాలే అన్నారు.

౪

"గోపికాకృష్ణ" "అజంతావిహారములో రాణి" "సిద్ధార్థుడు — యశోధర" "పుష్పాలంకార" "నందిపూజ" "దేవాలయము" "రాముడవనవాసోన్ముఖుడు" "విరహరాధిక" అను ప్రఖ్యాతి చిత్రాలు, ఇంకను "అభిమన్యు" "భీమ" "పాండవుల ధనుర్విద్యాభ్యాసము" అనే చిత్రాలు ఆయన లిఖించారు.

"గోపికాకృష్ణ" ఒక ఆనందమయగీతిక అని కూల్డ్రిగారు నుడివారు. పూర్వభారతీయ పద్ధతిని వస్త్రాలు ధరించి, రాగములోన స్వరాలులా గోపికల మనోహరాలైనపాలకుండలతో ద్విభుజరూపమై యుండ, రాధయొక్క కలశం మూర్ధాని నుండి గ్రహించి, కొంటెవాడై "వేణువుబ్రహ్మగీతికా" స్వనాలు చేతనున్న పిల్లంగోరునుండి యింకా ప్రతిస్వనాలు పలుకుతూవుండగానే ఆశాలు ఒలకబోస్తున్నాడు ప్రణయమూర్తి బాలగోపాలుడు. వెనకాల పచ్చనిచెట్లు అవీ ఈవింత పరికిస్తూనే వున్నవి. కలసివేసే ఆనందం మనఅధరాంచలాల ఒక్కనిమేషం నృత్యం చేస్తుంది అదిచూసినప్పుడల్లా.

"సిద్ధార్థుడు, యశోధర" పరికించగానే కపిలవస్తునగరానికి పోయినట్లైఅయింది. సుందరాకారుడై ప్రపంచముతరింప నవతరించిన ఆయావనమూర్తి, ఆశ్చర్యము సిగ్గు తెలవరాని యేదోభావము దృశ్యము కాని తేజోబింబంకాగా వెలలేని ఆముత్యాలహారము ప్రణయమూర్తియై యివ్వబోతూ వున్నాడు. పువ్వులనుడియై అభినయనృత్యం చేసి సర్వాంగసౌందర్యమై వణకు ఆనందమూర్తియై క్రేగంటితో ఆరాకుమారుని మన్నిస్తూ యశోధర తలవాల్చి కపిలవస్తు నగరాన ఉన్న సుందరయువతీ గణములో నాయకమణిగా ఆబోధిసత్వునిచే ఎన్నుకొనబడి, బహుమతి ఆముత్యాలహారం మొలిచిన ధవళశంఖం వంటి కంఠాన ధరించడానికి ముందుకు సాగలేక సాగలేక మానస సరో

వర నర్తకి యగు అంచవలె వస్తూంది— "పుష్పాలంకార" యందు ఒక్క నూత్నమాధుర్యముంది. పైరెంటికీ లేని మహావిషాదమూ వుంది. *నూత్నభవిష్యన్మాతృస్వరూప యగు ఆ బాల మనోహరమూర్తి త్రపావతియై కొంచెము తలవాల్చి ఆసనాన అధివసించి వుండగా చెలులందరు మధురగానముతో పుష్పాలు అలంకరిస్తూవున్నారు. గర్భవతియగు ఆ బాల, అస్పష్ట ఆనందామృత భావనల తనమూర్తిని నింపివేసి బయల్వెడల కరిగిపోయే చూపులు ఏడకో పోనిచ్చి, అంతయు గాంచియున్నా మరవకయున్నా కూర్చున్నది. ఆ బాల రామారావుగారి భార్య. పువ్వులుముడిచే ఆగంభీరచిత్రం మాహృదయము కలగవేసింది. శోకా తప్తులమై అల్లాగే నిట్టూర్పు విడిచాము.

౫

కాని రామారావుగారి చిత్రాల్లో ఒక్క గొప్ప లోటు మాకు స్పష్టమై తోచింది. పాశ్చాత్య సాంప్రదాయంగానున్నా భారతీయసాంప్రదాయంగానున్నా వర్ణకాగంభీరత చాలా తక్కువ - వర్ణములు రేఖా వర్ణాంశాలై పొడితనము సూచించాయి. రేఖాప్రవాహము అక్కడక్కడ అపశ్రుతి దోషాకరమైన కఠినత వహించింది. అక్కడి కఠినతకూ తదితరలాలిత్యాలకూ సమైక్యమైన సంయోగం కుదరలేదు.

రామారావుగారి చిత్రాల్లో వేరొక్క దోష ముంది. ఆయన మానవ సముదాయ చిత్రములు అద్భుతకౌశలముతో రచింపగలరు. కొంచె మెచ్చుతగ్గ ఆయనచిత్రములన్నియు సముదాయ చిత్రాలే. (గ్రూప్-పిక్చర్సు.) సముదాయము బహిస్స్వరూపాన నేదోషము లేని ప్రవాహమై వున్ననూ అంతస్స్వరూపములో కలియక లేని పద్యపాదమువలె వుంటవి. ఏకాత్మకమైన సంచలనము (సింగిల్ మూవుమెంటు) బహిస్సంచలనముల, ఏకాత్మైక్యమైన సంచలనము లోని అంతస్సంచలనములుగా సామ్యరూపములై వుండాలి. ఆలాలేక పోతే అపశ్రుతి కలుగుతుంది. రామారావుగారి బొమ్మలలో ఈదోషమే వుంది.

రామారావుగారి చిత్రాలేమీ భావగంభీరత పొందలేదు. బాహ్యరూపరేఖావిన్యాసాలే కాని, ఒక్క భావము, ఒక్క తీక్ష్ణత ఒక్క ఆవేగము ఆయన బొమ్మలలో వ్యక్తీకరింపబడలేదు.

౬

ఈదోషాలు సంపూర్ణత వహించిన కళాకారుని చిత్రరచనలలో వున్నట్లయితే మహాదోషాలు. అచిత్రములు కళాస్వరూపాలు కానేకావు. కాని రామారావు గారు బాలశిల్పి. ఒక్క నూతనసాంప్రదాయము కళలో నెలకొల్ప, దీక్షవహించిన శిల్పయోగి. ఆయన శిల్పకౌశలము ప్రౌఢిమ పొందినకొద్దీ ఈదోషాలు పూర్తిగాపోవును అని ఆయన బొమ్మల్లోనే ప్రత్యక్షమవుతూవుంది. ఈయన ఆశయం మహాఉత్కృష్టమయింది. అందుకనే రామారావుగారిని అవనీంద్రనాథఠాకూరు, ప్రమోదకుమారచటోపాధ్యాయులు, చౌగుతాయి, నందలాలబోసులతో సమానం చేస్తూవున్నాము.

ఉన్మాదియైన శిల్పి తనభావగంభీరత వ్యక్తీకరించడానికి ముందు విన్యాససాంప్రదాయం స్థిరపరచుకోవాలి. చిత్రప్రపంచప్రఖ్యాతులగు శిల్పులందరు, సూక్ష్మములు స్థూలములగు ప్రత్యేకవిన్యాసమార్గాలనున్నూ సృజించుకుంటూ భావగంభీరత వెల్లడించుకుంటున్నారు. ఆప్రత్యేకవిన్యాస మార్గాన్ని సృష్టించే అఖండప్రయత్నంలోనే మునిగివుండేవారు రామారావుగారు ఆయనచిత్రాలన్నీ సూక్ష్మదృష్టితో పరిశీలిస్తే ఏబొమ్మ కాబొమ్మకు మార్గాలు చిత్రంగా మారిపోతోనే వుండేవి. ఏమహోత్కృష్టమార్గమన్వేషించి వుండునో, ఏదివ్యాత్మానురంజకమైన నూత్నసాంప్రదాయము సృష్టించివుండునో, ఏఅద్వితీయశిల్పకళాకౌశలము వెదజల్లు చిత్రములు ఆయన కల్పించివుండునో, ప్రపంచము చూచుకొన నోచుకోమిని రామారావుగారు చిన్నతనమందే యిరవైఆరోఏట క్రూరమైన అంటువ్యాధి క్రూరకరాళాన్నిపడి చిత్రబ్రహ్మకళాపతియైనసూర్యదేవుడిలో ఐక్యమైపోయారు. ఆయనశిష్యులు అయన ఎంతవరకూ చిత్రపథాని కెగసారో అంతవరకే ఆగిపోయారు. ఆయన

తెచ్చిన సుందరత్వమూ లేదు. ఆసాంప్రదాయము ఆధేయస్థానానికి చేర్చుటకు తగినంత ప్రభావసంపన్నుడు ఎవడైన ఉదయించునో లేదో!

రామారావుగారి బొమ్మలు మదరాసు కలకత్తా బొంబాయి ఆంధ్ర ప్రదర్శనాల్లో అనేక ప్రథమ బహుమానాలు పొందాయి. పెద్ద ఖరీదులకు అమ్మబడ్డాయి. అఖిలబ్రిటీషురాజ్య సమ్మేళనప్రదర్శనమున కొన్ని కొనబడ్డాయి. ప్రపంచమంతా ఈ శక్తిస్వరూపుడగు చిత్రకారాగ్రేష్ట ఏపథమున వికసించునో అని చూస్తూవుండగా ముఖ్యముగా కళాచరిత్ర తెగిపోవునట్లు ఆంధ్రుల దురదృష్టాన అష్ట సర్వవర్షాల లేస్తై పోయారు.

అడివి బాపిరాజు.

మద్రాసు.

# కులోత్తుంగ చోడదేవ చక్రవర్తి.

చిలుకూరి వీరభద్రరావు పంతులుగారు.

[ఈవ్యాసము తొలుత ఆంధ్రదేశీయేతిహాస పరిశోధకమండలివారి వార్షికోత్సవ సందర్భమున జదువబడినది. దీని ఆంగ్లానువాదము మండలివారిపత్రికయందు ప్రకటింపబడినది. ఇందలివిషయము ఆంధ్రతమిళదేశములకు సంబంధించి, మిగుల ప్రాముఖ్యము కలిగియున్నది. కులోత్తుంగునిగురించి పాక్షికులయిన చారిత్రికులు కల్పించిన అపోహలన్నింటిని, ఇందు సహేతుకముగా విమర్శించి ఖండించినారు. వ్యాస మించుక దీర్ఘమయినను భాగములుగా ప్రకటించుకంటె నంతయు నొకపర్యాయమే జయంతి పాఠకులకు అందచేయుట యుక్తమని తలచి ప్రచురించుచున్నాము. భా. వేం. కృ.]

ఆంధ్రద్రవిడదేశములలోని పూర్వభాగములు కలుపుకొని, చాళుక్య చోడ సామ్రాజ్య మనంబరగిన మహాసామ్రాజ్యమునకుం బట్టాభిషిక్తుడై యేబదిసంవత్సరము లవక్రపరాక్రమముతోం బరిపాలనముచేసి వాసిగాంచిన కులోత్తుంగచక్రవర్తి చాళుక్యవంశీయుండుగాని చోడవంశీయుండు కాండు. కులోత్తుంగునకు తల్లిదండ్రులు పెట్టిననామము రాజేంద్రచోడుండని వీనిదాయాదు లయిన పశ్చిమచాళుక్యులు వీనిని రాజిగ యనికూడ వ్యవహరించిరి. ఆంధ్రదేశ మాకాలమున పూర్వభాగము పశ్చిమభాగము నని రెండుభాగములుగ నుండి, పూర్వభాగము వేంగీవిషయ మనుపేరం బరగి పూర్వచాళుక్యులచేతను, పశ్చిమభాగము పశ్చిమచాళుక్యులచేతను పరిపాలింపంబడుచుండెను. కులోత్తుంగుని పూర్వు లయినపూర్వచాళుక్యులు ౫౦౦ సంవత్సరములనుండి వేంగీదేశమును బరిపాలించుచుండిరి. వీనితండ్రి యాంధ్రభారత కృతిపతియైన రాజరాజనరేంద్రుండు. వీనితల్లి గంగైకొండ రాజేంద్ర-చోడుం డనుచోడ చక్రవర్తి కొమార్తెయైన అమ్మంగదేవి. ఈరాజరాజు క్రీ. శ. ౧౦౨౨ వ సంవత్సరమున వేంగిరాజ్యమునకుం బట్టాభిషిక్తుండై క్రీ. శ. ౧౦౬౩ వఱకు ౪౧ సంవత్సరములు రాజమహేంద్రపురము రాజధానిగా నఖం

దశాంతివైభవముతో నేలి, కీర్తిశేషుం డయ్యెను. ఈదంపతులకు రాజేంద్రచోడుం డను నొక్క కుమారుండును, కుందవ్వయను నొక్క కొమార్తెయు మాత్రము గలరు. మఱియు రాజరాజనరేంద్రుని తండ్రి యగు విమలాదిత్యునకు కుందవాదేవి యని, మేళమాదేవి యని యిరువురు భార్యలు గలరు. కుందవాదేవిపుత్త్రుండు రాజరాజును, మేళమాదేవి పుత్త్రుండు విజయాదిత్యుండును నై యున్నవారు. విజయాదిత్యునకు శక్తివర్మ యను కుమారుండుగలండు. రాజరాజనరేంద్రునకుం బిమ్మట నతనికొక్కండే కుమారుండగు రాజేంద్రచోడుండు వేంగీరాజ్యమునకు మాత్రమె పట్టాభిషిక్తుండు గావలసి యుండంగా, నట్లు జరుగక వేంగీరాజ్యమునకు రాజరాజునకు సవతితమ్ముండయిన విజయాదిత్యుండు పట్టాభిషిక్తుండగుటయు. క్రీ. శ. ౧౦౭౦ సంవత్సరమున రాజేంద్రచోడుండు చోళరాజ్యమునకుం బట్టాభిషిక్తుండగుటయు, విజయాదిత్యుని మరణానంతరము వేంగీరాజ్యమును స్వాధీన పఱచుకొని, తన కుమారుని తనపక్షమున ప్రతినిధిపాలకునింగా నేర్పఱిచి కులోత్తుంగుండను నూత్న నామమును గల్పించుకొని, చక్రవర్తియై కులోత్తుంగచోడచక్రవర్తి యను బిరుదునామముతోం బ్రవర్తిల్లుట సంభవించెను. అర్ధశతాబ్ద కాలము వేంగీచోడరాజ్యములను బాలించినవాండగుటచేత, అసలు పేరు మాసిపోయి, బిరుదునామమె దక్షిణహిందూదేశచరిత్రమున సుప్రసిద్ధమై పోయినది. ఇతనినామమునకు చోడశబ్దము తగిలింపంబడి యుండుటచేతను, ఇతనితల్లియుం దండ్రితల్లియు ముత్తవ్వ, చోడచక్రవర్తుల పుత్త్రికలై యుండుటయు, ఇతనిశాసనములు పెక్కులు తమిళభాషయందు వ్రాయంబడి యుండుటయు, కులోత్తుంగుండు చోళరాజ్యమునకుం పట్టాభిషిక్తుం డయినకాలమునాటికి పూర్వమున నొరయూరు రాజధానిగాం బరిపాలించి ప్రబలి నామావశిష్ట మయిపోయిన చోడసామ్రాజ్యమును మఱల సముద్ధరించి, వన్నెకెక్కిన ఆదిత్యచోడవంశము (నిజమైన చోడవంశము) అధిరాజేంద్రుని మరణముతో నశించిపోయినదని గాని, రాజ్యభ్రష్టతను పొందినదనిగాని చెప్పవచ్చును. అందుచేతనే

కాంబోలు దొరతనము వారిశాసనపరిశోధకులుగా నుండి చోడచక్రవర్తులయు, పూర్వచాళుక్యులయు శాసనములను బెక్కింటిని పరిశోధించి, దక్షిణహిందూదేశపు శాసనము లను పేరిట కొన్ని సంపుటములను బ్రకటించి యిపుడు కీర్తిశేషులయి యున్న డాక్టరు హుల్ట్సు పండితుఁడును వారితరువాత నాస్థానమున నియమింపఁబడి కీర్తిశేషు లయిన రావుబహదూరు వెంకయ్యగారును చాళుక్యుఁడైన కులోత్తుంగుఁడు తనకు హక్కులేనిదే బలాత్కారముగా చోళసామ్రాజ్యము నాక్రమించుకొనియె నని యొక నిందారోపణ చేసియున్నారు. ఈనింద న్యాయమైనది కాదనియు, కులోత్తుంగుఁడు, తన మాతామహుఁడయిన గంగైకొండ రాజేంద్రచోడచక్రవర్తికి దత్తుపోయినవాఁడు గావున నతని తండ్రి గంగైకొండ రాజేంద్రచోడదేవుఁడేయని 'కళింగత్తుపరణి' యను తమిళకావ్యమున నతని యాస్థానకవి యగుజయంగొండారను నతఁడు చెప్పి, వర్ణించి యున్నాఁడు. కావున నతనికి చోళరాజ్యముఁ బొందుటకు హక్కుకలదనియును, కనకసభాపిళ్లె మొదలగుపరిశోధకు లయిన తమిళపండితులు గొందఱు ప్రతివాదమునకుఁ గడంగిరి. ఈవాద ప్రతివాదములలో సందర్భశుద్ధి లేనట్టియు సప్రమాణములు కానట్టియుఁ బెక్కుచరిత్రవిషయములు చూపింపఁబడినవి. వాని నన్నిటిని ఖండించుట యీవ్యాసముయొక్క యుద్దేశము కాదు. మనకు ముఖ్యము లయినవి మూఁడు ప్రశ్నములు గలవు.

౧. రాజరాజనరేంద్రుఁడు క్రీ. శ. ౧౦౬౨-౬౩ వ సంవత్సరమునఁ గీర్తిశేషుఁ డయినపిమ్మట రాజేంద్రచోడుఁడు సింహాసన మధిష్ఠించెనా ? లేక, వానిసవతితమ్ముఁడు సింహాసన మెక్కెనా ?

౨. రాజరాజనరేంద్రుఁడు తనయేకపుత్త్రినిఁ దన మేనమామకు నిజముగా దత్తత చేసియుండెనా?

౩. చాళుక్యుఁడును రాజరాజనరేంద్రుని పుత్త్రుఁడు నగు రాజేంద్రచోడునకు చోళరాజ్యముపై హక్కు ఎట్టిది ?

వీనికిఁగావలసిన వాఙ్మయమును, శాసనములను సవిమర్శముగాఁ బరిశీలించి, పయిప్రశ్నములకు సహేతుకము లయిన ప్రత్యుత్తరములను చెప్పి సిద్ధాంతపఱచవలసి యున్నది. ముందు దత్తతనుగూర్చి విచారింతము. దీనిని వివరించిన తమిళగ్రంథము 'కళింగట్టుప్పరణి' అనునది. ఈ తమిళకావ్యము 'జయంగొండారు' అనుకవిచక్రవర్తిచేత రచియింపఁబడినదట! ఇతఁడు కులోత్తుంగచోడునియొక్కయు, విక్రమచోడుని యొక్కయు నాస్థానకవి యఁట! ఈకావ్యములో కులోత్తుంగచోడుని ముఖ్యమంత్రియుఁ బల్లవరాజును, 'వాండై' నగరాధిపతియు నగు కరుణాకర తొండైమాన్ యొక్కకళింగవిజయయాత్రను వర్ణించిన కావ్యమై యున్నది. ఇయ్యది ౧౩ కాండములతోను, ౫౯౯ పద్యములతోను నొప్పియున్నది. కీర్తిశేషులయిన వి. కనకసభాపిళ్లగారు ఇండియన్ ఆంటిక్వేరీపత్రికలో నిందలి ప్రతికాండములోని విషయములను సంగ్రహముగా తర్జుమాచేసి ప్రకటించి తమయభిప్రాయమును సూచించియున్నారు. * ఈకావ్యము యొక్క ౧౦ వకాండములో సూర్యకులసంజాతయు, చంద్రవంశీయుఁ డయిన రాజరాజనరేంద్రుని భార్యయు నగు అమ్మంగదేవిగర్భమున విష్ణువు ప్రవేశించి భూమిపైఁ కుచోత్తుంగుని రూపమున నవతరించినాఁడనియు, ఈశిశువు జనింపఁగానే గంగైకొండచోడుని భార్య యోగ్యురాలగు తనకూఁతురునకు జనించినకీర్తివంతుఁడగుఁ నాబిడ్డను చేతులనుంచుకొని ఈబిడ్డడు తనకుమారుఁడుగ నుండఁదగ్గాఁ డనియు సూర్యవంశీయుల యశమును పెంపొందింపఁగలవాఁడనియును, ఉభయకులోత్తుంగుఁడు (చంద్రసూర్యవంశముల రెంటికిఁ గీర్తిఁ దెచ్చువాఁడు) కాఁగలఁడనియు బలికెనఁట! ఇట్లు కవివర్ణించిన వాక్యములును, ఈతనికి గంగైకొండచోడుఁడు తండ్రియని కవిపలికిన పలుకులును కనకసభాపిళ్లగారికి కనకము దొరకినట్లై గంగయికొండరాజేంద్రచోడునికి దత్తపుత్రుఁడనియు, తనవెనుక నాతఁ

* చూడుము. ఇండియన్ ఆంటిక్వేరీ 19 సంపుటము, 4890 పేజి.

డు సింహాసన మధిష్ఠించుటకు నర్హుఁ డని యెంచెననియు, వేంగీరాష్ట్రము చోళరాజ్యమునకు సామంతరాష్ట్రముగ నుండె ననియు, వేంగిదేశమునకు నుత్తరమున నున్న ఉత్తరకళింగమును, కటకమును, కుళోత్తుంగునిచేత జయింపఁబడినవి గనుక నవియుఁ జోడసామ్రాజ్యమునకు లోఁబడిన సామంతరాష్ట్రములనియె చెప్పవలసి యుండునని, వక్కాణించి యున్నారు. ఇప్పటికి ౩౭ సంవత్సరముల క్రిందట సాధనసామగ్రి యంతగా లేక, పెక్కుశాసనములను బరిశీలింప నవకాశము లేనియాకాలమున కేవలము పక్షాభిమానముతో వ్రాసిన కనకసభాపిళ్లగారి యభిప్రాయములను పెద్దవిగా భావించి, ఖండింపవలసిన యవసరము లేదుకాని యిపుడు చెన్నపురి విశ్వవిద్యాలయములో చారిత్రిక పండితులు గానుండి పెక్కుచరిత్రగ్రంథములను వ్యాసములను వ్రాసి ప్రకటించిన వారును, పెక్కుపరిశోధనలను చేసి పత్రికలం బ్రకటించుచున్నవారును, ముఖ్యముగాఁ జోడరాజులనుగూర్చి పరిశోధనలను గావించి,యేవిశ్వవిద్యాలయముపక్షముననో యుపన్యాసముల నిచ్చుచున్న వారును,అందు ముఖ్యముగానే విషయమునుగూర్చి వ్రాయుచున్నను, నెద్దియో సందర్భముగల్పించుకొని ప్రఖ్యాతులైన రాజరాజ రాజకేసరి వర్మగంగైకొండ రాజేంద్రచోడుని మఱువక ప్రశంసించునంతటి యభిమానము కలవారు నగు డాక్టరు, ఎస్, కృష్ణస్వామి అయ్యంగారీ దత్తత సమస్య నేవిధముగాఁ బరిష్కరింతురో యని నేనాంధ్రులచరిత్రములోని ప్రథమభాగమును బ్రకటించిన 1910 దవ సంత్సరమునుండి వీరి వ్యాసములను గ్రంథములను మిగుల శ్రద్ధాభక్తులతో జదువుచున్నానని చెప్పుటలో నతిశయోక్తి యెంతమాత్రమును లేదు.

వీరు రచించిన "ఏన్షెంటు ఇండియా" అనుగ్రంథమున, ౧౨౫ దవ పేజీలో "రాజేంద్రచోడునిభార్య బిడ్డపుట్టినపుడు ప్రేమతో బిడ్డనెత్తుకొని బిడ్డపాదములపై నున్నచిహ్నములను (రేఖలను) దిలకించి యీబిడ్డ యుభయకులములను కీర్తిచేవన్నెకెక్కించి యుద్ధరింప గలఁడనిపలికినట్లు కళింగట్టుప్పరణి నుడువుచున్నది. ఇయ్యది బహుశః మనుమని యభివృద్ధిఁగో

ధి మాతామహి ప్రేమతో వెల్వడించిన కోరికయై యుండును గాని యం
తకంటె వేఱుకాదు. బహుశః ఈచిన్నకౌమారుఁడు తన్ను జుట్టుకొని
యున్న అధిరాజ్యసంపత్తుతో అతనికి దత్తుకాఁబడినను, లేకున్నను, తాత
గారియింటఁ బెంపఁబడి యుండును. మాతామహునకు పెక్కండ్రు
కుమారు లుండుటయు, వారిలో నొకఁడు గొప్పజయశాలి యగు చోడు
నకు విజయయాత్రలయం దనుచరుఁడుగా నుండుటయుఁ జూచినప్పుడు
నిశ్చయముగా దత్తుచేసికొనుటకు కారణ మగుపించదు." అని
కొంచెము విస్పష్టముగా వ్రాసిరి. కాని యివి హృదయపూర్వకముల
యినవి గావనియు, వీరిబుద్ధిమత్తియొక్క నైపుణకు లాగుచున్నదనియు
నటుతరువాత వ్రాసిన యీక్రింది వాక్యముల వలన బోధపడఁగలదు.
"అతఁడు క్రీ. శ. ౧౦౬౧-౬౨ వ సంవత్సరమునఁగాని మఱుసంవత్సరము
నఁగాని తన తండ్రి మరణించినపుడు పట్టముఁగట్టుకొనవలసి యుండునని
యొకరు తలంచుట స్వాభావికము; కాని యేడవవిజయాదిత్యుఁడు వేం
గీరాజప్రతినిధిగా నియమింపఁబడిన వ్యవహారసందర్భములన్నిటను ఆశ
తోఁగూడిన యీచిన్నిరాకొమరుఁడు వేంగీరాజప్రతినిధిత్వమును పొం
దుటనుగాని పొందకుండుటనుగాని తనకంత గొప్పకార్యముగాఁ దలంచి
యుండఁడని తోపింపఁజేయును. అతఁడు చక్రవర్తిత్వమును బొందనభి
లాషముఁ గలిగియుండెను; గాని రాజప్రతినిధిత్వమును బొందనభిలా
షముఁ గలిగియుండలేదు.

మఱియు కులోత్తుంగుఁడు తాను యువరాజుగ నున్నప్పుడు వాయిరాగర
ములలో ఏనుఁగులను బట్టుకొంటిననియు, సక్కరకొట్ట దుర్గము నాక్ర
మించుకొంటి ననియుఁ దనశాసనములలో దెలుపుకొనియున్నాఁడనియు,
ఇయ్యది తనతండ్రియగు తూర్పుచాళుక్యరాజగు రాజరాజునకుగాని
తనతాత, మేనమామల కడగాని యువరాజుగ నుండునట్లు దెలుపఁగల
దనియును, కాని యతఁ డంతకాలమును వేంగిదేశమునసే యున్నవాఁడల
తనయన్నకుమారుని కాదని, విజయాదిత్యుడు సింహాసన మెక్కుట సంభ
వింపదనియును, ఇతఁడు వేంగిలోనే యుండెనేని "వాయిరాగర మెక్కుడు?

ఏనుగులను బట్టు టెక్కడ?" అనియును, అతఁడు పట్టాభిషిక్తుఁడైనట్టు పిఠాపురము స్తంభములమీఁది శాసనములును తామ్రశాసనములును దెలుపుచున్నను, కులోత్తుంగుని శాసనము లన్నియు ౧౦౭౦ దవ సంవత్సరముతరువాత నున్నవిగాని యంతకు పూర్వములేవనియు, అతని శాసనములలో నెచ్చటను నాతఁడు సింహాసనమెక్కుటయు, విజయాదిత్యుని చేతఁ దానుపదభ్రష్టుఁడనై తిననని తెలుపంబడియుండలేదనియు,వక్కాణించిరి. దీనినంతయును విచారించి చూడ, వాయిరాగరము, సక్కరకోట్టము మొదలగునవి సాధించునపుడు వీరరాజేంద్రునికడనో అతని తాతయగు రాజేంద్రచోడుని కడనో యువరాజుగ నుండియుండు ననిరి. మఱియు తనతాతయగు మొదటి రాజేంద్రుని కడారముదండయాత్రలోఁ గులోత్తుంగుడు విఖ్యాతిఁ గాంచెనని నుడువుచు నీక్రిందివాక్యములను వ్రాసియున్నారు.

"ఇయ్యది కళింగట్టుప్పరణిలోఁ జెప్పఁబడినరీతిని పండితచోళుఁడైన గంగయికొండ రాజేంద్రచోడుని వీనికిఁ దండ్రియని వక్కాణించిన యుద్దేశమునకు సంతృప్తికర మైనసమాధాన మొసఁగుచున్నది."

వీరు దత్తతను మనస్ఫూరనమ్మువారు కాకపోయినను దానినెట్లయిన నిలువఁబెట్టుటకుఁ గారణములను గల్పింప జిజ్ఞాస కలవారుగాఁ గనుపట్టెదరు. ఈయితిహాసపరిశోధకమండలివారు ప్రకటించిన 'రాజరాజనరేంద్రపట్టాభిషేకసంచిక'కు, 'చోళులు పూర్వచాళుక్యులు' అను నొకవ్యాసమును వ్రాయునపుడు 'రాజరాజనరేంద్రుని మరణానంతరము సంభవించిన విషయములను గూర్చి వ్రాయుటకు వీరికలము సాగలేదు సరిగదా, శక్తివర్మకాలమునుండి శక్తివర్మ,విమలాదిత్యుఁడు, రాజరాజనరేంద్రుఁడు మొదలగువారు చోడసామ్రాజ్యమునకు లోఁబబడినవారే యనియు, వేంగీరాష్ట్రము సామంతరాజ్యమై యుండవలయు నని నిర్ధారింపఁ బ్రయత్నించుటలో గబగబ పఱువిడసాగినది. చోడచక్రవర్తులలోఁ బ్రఖ్యాతు లని తాము పదేపదే వక్కాణించురాజరాజును, వానికుమారుఁ డగు గంగైకొండ రాజేంద్ర చోడుఁడును పూర్వ

చాళుక్యరాజు లయినవిమలాదిత్యునకును, రాజరాజనరేంద్రునకును కాళ్లుగడిగి తమకూతుండ్రయిన కుందవాదేవిని అమ్మంగదేవిని కన్యాప్రదానము గావించి వివాహమును చేయుటచేతను చాళుక్యులు వారికి కప్పము చెల్లించు సామంతరాజు లని కృష్ణస్వామయ్యంగారు వక్కాణించుచున్నారు. శక్తివర్మ తన్ను రాజరాజచోళుడు పట్టాభిషిక్తుని గావించె ననిగాని, తాను రాజరాజునకు కప్పము చెల్లించు సామంతుడ నని గాని తనశాసనములలో నెచ్చటను దెలిపి యుండలేదు. అంతియగాదు. శక్తివర్మశాసనములో—

"బాల్యే కీర్తి రలాభి చోళికరణే యేన వ్రణో ద్యాసినా
యే నాత్యుద్ధత బద్యెమాధిపమహారాజాదయో విద్రుతాః
........రావణప్రతినిధి శ్చాలుక్యనారాయణో
నాపా స్తద్విషతాపి యేన నిధనం శ్రీచోడభీమాధిపః."

అని యీతడు బద్యెమాధిపమహారాజును ఓడించినట్లును, చోడభీముడనువానిని జంపినట్లును, బాల్యమున చోళులతో యుద్ధము చేసినట్లును చెప్పబడియున్నది.[1] మఱియొకశాసనములో నీతడు చిన్నతనమునందే ద్రమిళయుద్ధమునం దనేకశత్రుగజములను స్వఖడ్గముచేత ఖండించె ననియు, చోడభీమునిచే బంపబడిన యొకమహావీరుని స్వయముగా జంపె ననియును, జటాచోడు డనునొకమహావృక్షమును వ్రేళ్లతో బెఱికివైచె ననియు జెప్పబడి యున్నది.[2]

"పై శాసనములో" జెప్పబడినజటాచోడుడనువాడు, రాజేంద్రచోడునికుమారు డయిన జటావర్మసుందరచోళపాండ్యు డనువాడు. ఇతని మూలనామము జటావర్మచోళుడు. రాజేంద్రచోళుడు పాండ్యదేశమును గెలిచిన తరువాత, అచ్చట తనకుమారుని తన ప్రతినిధిగా నిలిపి యీతడే పాండ్యరాజని తెలుపుటకు 'సుందరపాండ్యశబ్దము' నతనిపేరునకు జేర్చెను. రాజేంద్రచోళుడు పాండ్యదేశమును గెలిచినకాలము

1 చూడుము. ఎపి, రిపోర్టు. 1917—18. పి. ౫౩. నెం. 15.

2 చూడుము. ఆం. సా. ప. సం. ౨. పుట ౪౦౮.

మనకు నిశ్చయముగఁ దెలియదు; గాని యీపని క్రీ. శ. ౧౦౧౬ నకుఁ బూర్వమే జరిగె నని తజ్జ్ఞుల యభిప్రాయము” అని కీర్తిశేషు లయిన కొమర్రాజు లక్ష్మణరావు గారు వ్రాసి యున్నారు.[1]

ఇట్లు చోడులకు ప్రబలశత్రువగు శక్తివర్మ నారాజరాజ చోడుఁడు వేంగీరాజ్యమునకుఁ బట్టాభిషిక్తునిగావించుట ఎంతవిచిత్రముగానున్నది? కనుక ‘రాజరాజు శక్తివర్మను సింహాసన మెక్కించె’ నని వ్రాయుట విశ్వసింపఁదగినది కాదు. మఱియు శక్తివర్మ క్రీ. శ. ౧౦౧౨ వఱకు ననఁగా పండ్రెండువర్షములు పాలించి తనువు చాలించిన వెనుక నాతని తమ్ముఁడగు విమలాదిత్యుఁడు గంగైకొండ చోళుని గారాబు చెల్లెలు పట్టమహిషిగాఁ బట్టాభిషిక్తుఁ డయ్యెను. ఇదియు సత్యమునకు విరుద్ధమైన వ్రాఁత. ఏ మనఁగా రణస్థపూండి శాసనములో—

అనలానలరంధ్రగతే శకవర్షే వృషభమాసి
సితపక్షే యః షష్ట్యాం గురు పుష్యేసింహే లగ్నే
ప్రసిద్ధమభిషిక్తః (౧౩) అని వ్రాయఁబడియున్నది.[2]

అర్థము. శా. శ. ౯౩౩ వ సంవత్సరమున వృషభమాసమునందు శుద్ధ ౬ గురువారమునాఁడు పుష్యమీ నక్షత్రమున సింహలగ్నమునందుఁ బ్రసిద్ధముగ నభిషిక్తుఁ డయ్యెను. అనఁగా క్రీ. శ. ౧౦౧౧వ సంవత్సరమున విమలాదిత్యుఁ డభిషిక్తుఁ డయియుండఁగా కృష్ణస్వామి అయ్యంగారు ౧౦౧౨ దవ సంవత్సరమునఁ బట్టాభిషిక్తుఁ డయ్యెనని వ్రాసిరి. విమలాదిత్యుఁడు ౧౦౧౮గవ సంవత్సరమున తంజాపూరునకు సమీపమున నున్న తిరువైయూరు గ్రామములోని పంచనాథేశ్వరస్వామికి ద్రవ్యదానముచేసి శాసనము వ్రాయించినది రాజరాజ కేసరివర్మ కూతురగు కుందవ్వను వివాహముఁ జేసికొన్న బంధుత్వముచేతనేగాని వేఱొండు కారణము చేతఁగాదు. పూర్వచాళుక్యులనుగూర్చి వ్రాసినవీరి యభిప్రాయము లిట్టి పెక్కుతాఁపుల నిరాధారము లయిననిగా నుండును. గ్రం

1 ఆంధ్రపత్రిక, ఉగాదిసంచిక 1920—21, ఆరుంబాకశాసనము. పుట. 77.
2 ఎపి. ఇండి. ౫. ౩౪౭.

థవిస్తరభీతిచే వానిని విరమించుచున్నాను. గంగయికొండచోడుఁడు కులోత్తుంగుని దత్తుచేసికొనెననుట రాజకీయతంత్రము కొఱకు పన్నిన యొక పన్నుగడగాని సత్యముగాదు. రాజరాజనరేంద్రుఁడు తనయొక పుత్త్రిని దత్తుగా నిచ్చె ననుట విశ్వసింపఁదగినది. గంగైకొండ చోడదేవునకు రాజాధిరాజు, రాజేంద్రుఁడు. వీరరాజేంద్రుఁడు, నను మూవురు కొడుకులును, అమ్మంగదేవి యను పుత్త్రికయు గలరని శాసనము లంబరశోధించిన డాక్టరుహల్ట్జుగారు నిర్ధారించున్నారు.[1]

ఈవిషయమును డాక్టరు కృష్ణస్వామి అయ్యంగా రొప్పుకొనుచునే యున్నారని యిదివరకే తెలిపియుంటిని. తనకు ముగ్గురుకొడుకు లుండఁగా దౌహిత్రుని దత్తతచేసికొనుటయె విశ్వసింపఁవగినది కాదు. కొడుకులును కొడుకుబిడ్డలును నుండఁగా దౌహిత్రునిపెంచుకొని తనకుటుంబములోనే పుట్టిన కొడుకుబిడ్డను మనుమరాలినిచ్చి వివాహముచేయుట యెక్కడియాచారము? హిందూశాస్త్రము లంగీకరించునా? తండ్రికూతును వివాహ మాడ వచ్చునా?

మద్రాసుప్రెసిడెన్సీకాలేజిలో అసిస్టెంటు ప్రొఫెస్సరుగానున్న ఎ. వి. వెంకట్రామయ్యర్. ఎం. ఏ గారు (న్యూ లైట్ ఆన్ కులోత్తుంగ) అను పేరుతో నొక వ్యాసమును మద్రాసులోజరిగిన ఓరియంటల్ కాన్ఫరెన్సులోఁ జదివియున్నారు. ఆవ్యాసముయొక్క సంగ్రహము గ్రంథమునఁ బ్రకటింపంబడినది.

అతఁడు చోళకుటుంబము లోనికి దత్తుగొని పోఁబడుటయు, ౧౦౬౩ వ సంవత్సరముననే చోళరాష్ట్రమునకు మేనమామ యగు వీరరాజేంద్రునిచే యువరాజుగ నియమింపఁబడుటయుఁ గళింగత్తుప్పరణి వలనను, కులోత్తుంగుని శాసనముల వలనను స్పష్ట పడుచున్నది. అక్రమముగా రాజ్యమాక్రమించుకొన్న కులోత్తుంగునకు లేనిహక్కును స్థిరపఱచుటకై యాస్థాన కవియుఁ గల్పనా కథల్లువాఁడు నగు జయంగొండారను వానిచే దత్తత విషయము గల్పింపఁబడి పేర్కొనఁ బడినదని

---

1 సౌతు ఇండియన్ ఇన్స్క్రిప్షన్సు సం. 3. పార్టు II. పేజీ 106.

హుల్ట్జుగారు మనకు చెప్పుచున్నారు...కనుక దత్తతవిషయము సులువుగాఁ ద్రోసి వేయఁబడునది కాదు. రాజ్యమును బొందుట కనగత్యమైనది గనుక రాజకీయ కార్యార్థము గల్పింపఁబడినదని సమాధాన మీయఁబడ వలసినదియుఁ గాదు." అనిగట్టిగా నొక్కి పలుకుచున్నారు. వీరు డాక్టరు హుల్ట్జు గారు వ్రాసిన వాక్యము లోని కొంత భాగమును త్రోసివేసి, కొంతభాగమును మాత్రమే యుదాహరించి యధిక్షేపించి యున్నారు. హుల్ట్జు గారి వాక్య మి ట్లున్నది.

"మొదటి వీరరాజేంద్రుఁడు మొదటి రాజేంద్ర చోడుని కొడుకని యొప్పుకొన్న యెడల, అక్రమముగా నాక్రమించుకొన్న కులోత్తుంగునకు లేని హక్కును గల్పించుటకై రాజేంద్రచోడుఁడు కులోత్తుంగుని రాజకీయకారణములచే దత్తుచేసికొనియె నని వట్టికల్పనము చేయఁబడినది. ఇట్టివే కాఁబోలు నూతనజ్యోతులు. [న్యూ లైట్సు] వీరికి దత్తస్వీకార మన నర్థమేమో తెలుసునా? యని ప్రశ్నింప వలసివచ్చుచున్నది. గంగైకొండ రాజేంద్రచోడుని పెంపుడుకుమారుఁడగు నుభయకులోత్తుంగుఁడు తండ్రివెనుక రాజ్యమునకు రాలేదు. రాజాధిరాజు,రాజేంద్రుఁడు వీనికొడుకు రాజమహేంద్రుఁడు, వీరరాజేంద్రుఁడు, వీని కొడుకు అధిరాజేంద్రుఁడు పాలించిమరణించిన వెనుక, చోడసామ్రాజ్యమునకుఁ బట్టముకట్టుకొనియెను. ఓహో చోడచక్రవర్తులకు పెంపుడు కుమారునియందు నెంత ప్రేమ గలదు !

ఈ వెంకట్రామయ్యరుగారు తమవ్యాసములో కులోత్తుంగుని మూఁడవకుమారుఁ డయిన వీరచోడనృపాలుని చెల్లూరు తామ్ర శాసనమును జూచియున్నట్లు కొన్ని విషయముల నందుండి పేర్కొనియున్నారు. ఆశాసనములో వీరచోడుఁడు తన పితృ వంశమైన చాళుక్యవంశమును వర్ణించుచు, నందు తనతండ్రిని తన్నును జెప్పుకొని యున్నాఁడు. కాని, ఆదిత్యచోడ వంశమును ఆవంశములోని చోడచక్రవర్తులను వర్ణించి తన్నును తనతండ్రిని చోడ వంశీయులనుగా నేల చెప్పుకొని యుండలేదు ? వీనిశాసనములో "స సర్వలోకాక్రమణచతురకీర్తి

ప్రతాపః, మహారాజాధిరాజపరమేశ్వర పరమ మహేశ్వర పరమ భట్టారక, పరమబ్రహ్మణ్యా, శ్రీవీరచోడదేవః" అనియున్న వాక్యములోని బిరుదములు చాళుక్యులవా? చోడులవా? అని ప్రశ్నించుచుచున్నాను. వీరుచేయువితండవాదము నేలవిడిచి సాముచేయున ట్లున్నది. గంగయికొండ చోడుఁడు తనతండ్రిని పెంచుకొన్న యెడల నావిషయమును కుమారుఁడు కప్పిపెట్టి తాను చంద్రవంశీయుఁడ ననియు, చాళుక్యుఁడ నని తల్లితండ్రులుబ్రదికియుండఁగా నట్లు చెప్పుకొనునా? దీనిని తల్లిదండ్రు లెట్లంగీకరించిరి? ఏశిలాశాసనములోఁగూడ రాజరాజచోడగంగుకూడ దత్తతను గూర్చి వక్కాణించియుండలేదే! కావునఁగులోత్తుంగుఁడును వాని కొడుకులును వారిసంతానమును చోడులు కారనియు, చాళుక్యులనియు నిష్పాడయిన స్పష్ట పడుచుండలేదా? సమస్తవిధములచేతను కులోత్తుంగుని పుత్త్రుఁడ యిన వీరచోడనృపాలుని చెల్లూరు గ్రామశాసనము సత్యమును దెలుపునదిగ నున్నదని నాయభిప్రాయము. మఱియు కుంభకోణము కాలేజి తమిళ పండితులగు ఎల్. శ్రీనివాసయ్యర్ అనువారు (కులోత్తుంగ 1 హిజ్ క్లెయిమ్స్ టు ది చోళా థ్రోన్) అనుపేరిట హిందూ ఎడ్యుకేషనల్ సప్లిమెంటునకు నొకవ్యాసమును వ్రాసి, గంగయ కొండచోడదేవునకు రాజాధిరాజు రాజేంద్రుఁడు, రాజేంద్రచోడుఁడు కొమాళ్లుగారనియు, రాజేంద్రదేవుని మనిమంగళము శాసనములో గంగయ కొండరాజేంద్ర చోడుఁడు తనతండ్రికి పిన్నతమ్ముఁడని, అనఁగాఁ బినతండ్రి యని చెప్పియున్నాఁ డనియు, వీరరాజేంద్రుఁడు తన కన్యాకు మారిశాసనములో వారతని కనిష్ఠసోదరులనుగాఁ జెప్పియున్నాఁడనియుఁ గనుక గంగై కొండచోళుఁడు కులోత్తుంగుని దత్తుచేసికొన్న విషయము బహుశః సత్యమై యుండునని యభిప్రాయపడుచున్నారు. ఇట్టి యూహలకును పైన చెప్పిన యాక్షేపణమె పట్టఁగలదు. రాజేంద్రుఁడు తనకొమార్తెను తనమొదటి దాయాదికిచ్చి వివాహము చేయుచుండెను. బ్రాహ్మణులలో కాని, క్షత్రియు

చూడు 1 వాల్యూం 3 పార్టు పేజీ. 59.

యులలోఁగాని మఱి యేగౌరవముగల హిందూకుటుంబములలో గాని యిట్టి దుష్టాచార మున్నట్టు వినలేదు. ఆంధ్రులలోగాని, ప్రాచీన హిందూసంఘములోగాని యిటువంటి దుష్టవివాహములు లేవని నిశ్చయముగా నే నెఱుంగుదును. ఈవిద్వాంసు ఁడట్టిదానిని నాకు చూపింపఁ గలిగిన యెడల వారికిఁ గృతజ్ఞుఁడ నగుదును. చోడుల యాధిక్యతను నిరూపించుటకై యీపండితుఁ డిట్టి విపరీతమైన వింతసిద్ధాంతమునకుఁ గడంగినందులకు నేను మిక్కిలి చింతిల్లుచున్నాను. వీరచోడుని శాసనములో ప్రాతఃకాలమున నుదయాద్రియందు సూర్యుఁ డుదయించి తన తేజస్సును సర్వత్ర వ్యాపింపఁ జేయునట్లుగా, ప్రథమమున వేంగీ సింహాసనమును బొందుటచేత (రాజేంద్రచోడుఁడు) తనశక్తితో నెల్లదేశములను జయించినాఁ డను నర్థముగల శ్లోక ముదాహరింపఁబడినది. నేఁడు, 'ఏన్షెంటు ఇండియా' అనుగ్రంథములో కులోత్తుంగుని గూర్చి ఎన్. కృష్ణస్వామయ్యంగారు చేసిన ప్రసంగమునకు కులోత్తుంగుని కుమారుఁ డగు వీరచోడుని చెల్లూరు తామ్రశాసనములోని పై శ్లోకమే ప్రత్యుత్తరమునొసంగుచున్నది. మఱియు కులోత్తుంగుఁడు తన పెద్ద కొడుకునుజూచి—

> " మయూ వేంగీమహీరాజ్యం చోడరాజ్యాభిలాషిణా,
> మత్పిత్రవ్యే పురా న్యస్తం విజయాదిత్యభూభుజే".

చోడరాజ్యమును పొందఁగోరి పూర్వము వేంగీరాజ్యమును నాపిన తండ్రియగు విజయాదిత్యభూభుజునకు నొసంగి యున్నాను.

> స చ పంచదశాబ్దాని పంచానన పరాక్రమః,
> మహీం రక్షన్మహీనాథో దివం దేవోపమో గతః.
> ఇత్యుక్త్వాతాం ధురం దత్తాం గురుణా చక్రవర్తినా.

'శివునివంటి పరాక్రమవంతుఁడును దైవసమానుఁడు నగు విజయాదిత్యుఁడు ౧౫ సంవత్సరములు పరిపాలించి దివంగతుఁడయినాఁడు.'

ఈశ్లోకమును బట్టి కులోత్తుంగునకు తన పినతండ్రియం దెట్టిసుహృ ద్భావము కలదో తేటపడుచున్నది. తరువాత కులోత్తుంగుఁడు వేం గీరాజ్యభారమును వహింపవలసినదిగా రాజరాజును నియమించెను. అతఁ డీపదవిని వహించిన తరువాత సుఖమును సురక్షణమును లేక, గురుపా దసేవవలనఁ గలిగెడి యానంద మీరాజ్యపాలనాధికార మీయనందున నొక్కసంవత్సరము మాత్రము పరిపాలించి తల్లిదండ్రుల కడకుఁ బోయెను. తరువాత వీరచోడకుమారుని రప్పించి వేంగీరాజ్యమునకుఁ బట్టాభిషిక్తుఁడవై పరిపాలింపవలసిన దని చక్రవర్తి యాజ్ఞాపించెను. ఎట్టకేలకు నీతని నొప్పించిరి.

> "ఇత్యాశిషం సమధిగమ్య నృపా దవంధ్యాం
> దేవ్యా స్తదాగ్రజ నృప ద్వితయ క్రమేణ
> ఆనమ్య తా నవనతో కుమార స్సృష్ట
> స్స్వదేశగమనాయ స తైః కథంచిత్.

ఈప్రకారముగా రాజుయొక్కయు, దేవియొక్కయు, అగ్రసోదరులిరు వురియొక్కయు దీవనలను బొంది, వారికి నమస్కరించి తన చిన్న తమ్ము లయినన్నృపకుమారుల నమస్కారములను బొంది స్వదేశము నకుఁ బోవుటకై యొప్పింపఁబడియెను" అని వక్కాణింపఁబడియుండెను. వారిచేత వేంగీదేశము స్వదేశముగఁ బరిగణింపఁబడియె నని యాశ్లోక మువలన స్పష్టముగాఁ దెలియుచున్నది. కులోత్తుంగచోడచక్రవర్తియు, వాని దేవియు, వారలకుమారులును చోడదేశమును స్వదేశముగా భావింపలే దనియు, వేంగీదేశమునే స్వదేశమునుగా భావించిరనియు ఇది స్పష్టపరచుచున్నది. వీరచోడుఁడు—

> 'శాకాబ్దే శశి ఖద్వ యేందుగణితే సింహాధిరూఢే రవౌ
> చంద్రే వృద్ధిమతి త్రయోదశితిథౌ వారే గురోర్వృశ్చికే,
> లగ్నే థ శ్రవణే సమస్తజగతీరాజ్యాభిషిక్తోభరం
> లోకస్యో ద్వహతి స్మ పట్టమనఘం శ్రీవీరచోడనృపః.'

శకసం. "౧౦౦౧ మున రవి సింహామందుండఁగాఁ జంద్రుఁడు వృద్ధియం దుండ త్రయోదశీ గురువారమున శ్రవణానక్షత్రయుక్త వృశ్చికలగ్నము నఁ బ్రఖ్యాతిగాంచిన శ్రీవీరచోళనృపాలుఁడు సమస్తభూమికి నభిషిక్తుం డై పట్టముఁగట్టుకొనియె నని వ్రాయఁబడినది. అనగా వీరచోడుఁడు వేంగీరాజ్యమున క్రీ. శ. 1079 దవ సంవత్సరమునఁ బట్టాభిషిక్తుఁ డయ్యె నని భావము. ఇంతవఱకు దత్తత విశ్వసనీయ మైనదికాదని యనేక ప్రతిబంధకకారణములు గలవని తెలిసికొంటిమి. కావున దత్తతవ్యవహారము కులోత్తుంగునిపక్షమున వ్యవహరించిన చోడచక్రవర్తుల కుటుంబములోని కొందఱు ప్రముఖుల కల్పనమని మనకిపుడు సులభముగా బోధపడుచున్నది.

## రెండవ విషయము.

రాజరాజనరేంద్రుఁడు మరణించిన వెనువెంటనే వేంగీసింహాసనము నెవ్వరధిష్ఠించి రనువిషయము చర్చింపవలసియున్నది. వీరచోడుని శాసనములనుబట్టి ప్రథమమందు వేంగీసింహాసనమధిష్ఠించి రాజేంద్రచోడుఁడు (కులోత్తుంగుఁడు) చోళరాజ్యమును సంపాదింపవలె ననుకోరికతో వేంగీరాజ్యమును తనపినతండ్రి యైన విజయాదిత్యున కప్పగించితి ననియు, నతఁడు ౧౫ సంవత్సరములు పరిపాలనముచేసి దివంగతుఁ డయ్యె ననియు చెప్పఁబడియున్న విషయ మింతకుఁబూర్వమే తెలిసికొని యున్నవారము. ఈశాసనములో నుదాహరింపఁబడిన విధానమునుబట్టి రాజరాజనరేంద్రుని సవతితమ్ముఁడైన విజయాదిత్యునికిని, కుమారుఁడైన రాజేంద్రచోడునకు నేవిధమైన మనస్స్పర్థలు గాని విరోధము గాని లేకుండుట మాత్రమేగాక పినతండ్రియందు కులోత్తుంగునకు మంచిగౌరవము, విధేయత గలదని తేటపడుచున్నది, ఇందుకు ప్రతిబంధకములయిన మరికొన్ని విషయములు కలవు. ఈనడుమ ఈ ౭ వ విజయాదిత్యుని శాసనములును, వీనికుమారుఁడు రెండవశక్తివర్మ యొక్క శాసనమొక్కటియు బైటపడినవి. అందు విజయాదిత్యుని శాసనము లాతని ౧౨వ పరిపాల

నసంవత్సరమున లిఖింపఁబడినవి. ఇయ్యవి ప్రస్తుతము మద్రాసు మ్యూజియమునం దున్నవి. వీనినకలు నామిత్రులయిన శ్రీ చిలుకూరి నారాయణరావు గారికడ నున్నది.* అందు రాజరాజనరేంద్రుని మరణానంతరము

పరోక్షే రాజరాజస్య భ్రాతు ర్ద్వైమాతురస్య యః,
పర్యగ్రహీ స్స్వహస్త్రశియం వీరశ్రియా యుతః.

అని తాను స్వయముగా పరాక్రమముచేతనే రాజ్యలక్ష్మిని గ్రహించితి నని వక్కాణించుచున్నాఁడు. మఱియు నింకొక విశేషవిషయమును గూడ దెలుపుచున్నాఁడు.

గృహీత్వా స్వసుతే స్నేహాత్ రాజ్యం శ్రీశక్తివర్మణి,
స్వస్తం తస్మిన్ ధరా మేకం సంరక్ష్యాబ్దం దివంగతే.

తనకుమారుఁడైన శక్తివర్మ నెడగలస్నేహముచేత నతనికే రాజ్యము నొసంగగా నొకసంవత్సరముమాత్ర మాతఁడు పాలించి దివంగతుఁడైనవాఁడట. అభిమన్యుని గోల్పోయినపార్థుని వలెనె రుచియు సుఖము నెఱుఁగక యున్నానని దెలుపుకొనుచు—

ఆసీనే విబుధైః కులక్రమగతే రాష్ట్రే రలం బోధితో
ధర్మం స్థాపయితుం కథం చి దకరోత్ బుద్ధిం ధరారక్షణే

ధర్మమును దలపోసి ధరారక్షణమునందు బుద్ధికలిగి బుధులుప్రోత్సహించుటచేత మరల రాజ్యభారమును వహించితి నని వక్కాణించుచున్నాఁడు. ఇది క్రీ. శ ౧౦౭౫ దవ సంవత్సరము నాఁటిశాసనము. వీని కుమారుఁడగు రెండవశక్తివర్మ శాసనములో† గూడ విజయాదిత్యుఁడు వేంగీరాజ్యమును బలాత్కారముగా గ్రహించెననియె వక్కాణింపఁబడియున్నది. ఈ రెండవ శక్తివర్మ శాసనమువలన శక్తివర్మ క్రీ. శ. 1064 గవ. సంవత్సరమున బరిపాలనముచేసినట్టు గన్పట్టుచున్నది. వీరిశాసనముల

* చూడుము. మద్రాసు గవర్నమెంటువారి మ్యూజియము శాసనముల త్రైమాసికల అడ్మినిస్ట్రేషన్ రిపోర్టు. 1925—1926,

† ఎపి, రిపో. 1913—14. పేజి. 7.

లో తాము కులోత్తుంగుని వెడలఁగొట్టి రాజ్యమును వశము చేసికొంటి మని పేరును చెప్పియుండలేదు. ఇతరులసహాయముతో తామీరాజ్యమును పొందితి మనియైన చెప్పియుండలేదు. తాము బలాత్కారముగా నేల గ్రహింపవలసి వచ్చెనో అదియును దెలుపలేదు. వీరిస్థితి యిట్లుండఁగా చోడరాజ్యమును బాలించెడు మొదటివీరరాజేంద్రుఁడు తనయైదవ, యేడవపరిపాలన సంవత్సరములలోని శాసనములలో తాను వేంగీమండలమునుజయించి యారాజ్యము చాళుక్యవిజయాదిత్యునకొసంగితి నని చెప్పుకొనియున్నాఁడు. ఇతఁడు పెరుంబేరుశాసనములో, ముమ్మరము లగుసరములో నైదుసారులు, ఆహవమల్లుఁడు పాఱిపోవునపుడు ఆతని వెన్నుఁజూచితిననియు, వేంగినాడు తిరిగి స్వాధీనముచేసికొంటిననియు, తనతోఁబుట్టినపెద్దన్న ప్రతిన నెఱవేర్చితి ననియు, తనవద్దకు వచ్చి తనపాదములను బూజించిన సలుక్కి విజయాదిత్యునకు రాజ్యము నొసంగితి ననియు వ్రాయించుకొన్నాఁడు. *

ఈ వీరరాజేంద్రుఁడు మఱియొక శాసనములో ఇదివఱకు మేము జయించిన వేంగీదేశమును సంపాదింపకుండ తిరిగి పోము. మీరు బలము గలవారు రండి. మీకు శక్తియున్న రక్షించుకొనండి" అని పలికినట్లుగాగూడ వ్రాయఁబడి యున్నది. అనంతవర్మచోడగంగుయొక్క కొన్ని శాసనములో—

"సరాజరాజః ప్రథమం జయశ్రియః పతి ర్బభూవ ద్రవిలాహవోత్సవే,
విరాజమానామథ రాజసుందరీమ్ముదూఢవంశ చోడమహీభృదాత్మజాన్.
త్యక్త్వా వేంగీం సపది పరిణా మోవ యేద్యాంయవన్యాం
చోడవ్యాజే మహతి విజయాదిత్య మబ్ధా మిమత్థుం
ఆపన్నానాం పరమ శరణం రాజరాజో విచిత్రం
లక్ష్మీశ్రభాజం సుచిరమకరోత్ పశ్చిమాయామ్ దిశాయామ్."

అని వ్రాయఁబడి యున్నవి. †

---

* సౌతిండియన్ ఇన్‌స్క్రిప్షన్సు. సం 3. భాగ 2. పే 203.

† ఆంధ్ర హిస్టారికల్ రీసర్చిసొసైటీ జర్నలు. భాగం 3.

ఇందు రాజరాజు ద్రవిడులనోడించి చోడ భూపాత్మజయగు (రాజేంద్ర చోడతనయ) రాజసుందరిని వివాహమాడెననియు, అస్తమించుచున్న సూర్యునివలె వృద్ధుఁడైన విజయాదిత్యుఁడు వేంగిని విడిచి పెట్టినతోడనే చోడులవలన సంభవించుచున్న కష్టసముద్రములో మునిఁగిపోవుచుండ దీనశరణ్యుఁడగు రాజరాజు పశ్చిమభాగమున చాలకాల మభివృద్ధి నొందునటుల గావించెను.* ఈపరస్పరవిరుద్ధము లయినశాసనములను సమన్వయపఱచి సిద్ధాంతము చేయుట బహుకష్టసాధ్యము. రాజరాజనరేంద్రుఁడు కీర్తిశేషుఁ డయినవెనుక వేంగీరాజ్యాధిపత్యమును గుఱించి పకుము లేర్పడి గొప్ప యుద్ధములు జరిగినమాట సత్యము. ఆకాలమున నీదేశమున స్వపక్షాభిమానులగు వీరనాయకు లెట్టిప్రతిజ్ఞ వహించుచుండిరో యీక్రిందిశాసనమువలనఁ దెలియఁగలదు.

"స్వస్తిసర్వలోకాశ్రయ శ్రీవిష్ణు వర్ధనమహారాజు కోనేరిన్మెయింగొండాను శ్రీపరాంతక దేవరకు రాజాదిరాజు వూనినవూనికి ఏను నావంశమునవారును శ్రీపరాంతకదేవరను కొలువంగలవారము. ఒరులం గొలువము. ఒరుండు మ మ్మెలెనేని తనయాలిని మాకిచ్చెడువాండు. ఏము ఒరులం గొలిచితిమేని మాయాణ్డ్రవానికిచ్చిన వారము. ఇమ్మార్గము శ్రీభీమేశ్వర సన్నిధానమున సత్యముచేసి ఒగుంగొంటిమి. డకరేమి, లిఖితం వీరరాజేంద్రచోడాచార్యః."*

ఇట్లు ఒడ్డవాదచోడయ వీరంగొట్టనచోడన, వీరంగొట్టమున సూరయ, జంతురునాటి భీమన, రాపర్తిబేతయ, సరుడనాంటి వీరచోడండు ప్రతిజ్ఞలు చేసి శాసనములు వ్రాయించిరి.*

వీటిలో కాలము తెలుపఁబడియుండలేదు. శామేరాజు కొఱకు ప్రతిజ్ఞచేసి యుండిరోవానిపే రుదాహరింపఁబడినది. అతఁడు పూర్వచాళుక్యులయు, చోడులయు బిరుదములను వహించియుండెను. 'సర్వలోకాశ్రయ, విష్ణువర్ధన బిరుదములు' పూర్వచాళుక్యులును, 'కోనేరిన్మెయిం

* సౌతిండియన్ ఇన్స్క్రిప్షన్సు. సం 4. 1622—1275.

'గొండారు, పరాంతక దేవర' అనుబిరుదములు చోడులును వహించి యుండిరనుట వాస్తవము. వీనిలో నుదాహరింపఁ బడినరాజు రెండు వంశములకు సంబంధించినవాఁ డగుటచేత నాబిరుదములను వహించుట కర్హుఁడై యుండెను. మన మెఱిఁగినంతమట్టుకు నట్టి బిరుదములను వహించినవాఁడు పూర్వచాళుక్యుడగు రాజరాజనరేంద్రుని కుమారుఁడు, రాజేంద్రచోడుఁ డనుపేరుగల కులోత్తుంగుఁ డయి యున్నాఁడు. రాజరాజనరేంద్రుడుగాని, వానిసవతితమ్ముఁడు విజయాదిత్యుఁడుగాని వాని కుమారుఁడు శక్తివర్మగాని చోళబిరుదములను వహించియున్నట్టు గానరాదు. అట్లేకులోత్తుంగునకు పూర్వమున నున్న చోడరాజు లెవ్వరును పూర్వచాళుక్యులు వహించిన బిరుదములను వహించియుండలేదు. మఱియు నాశాసనముల లిఖించిన లేఖకునిపేరు రాజేంద్రచోడాచారి. ఒకటి రెండుశాసనములలో వీరరాజేంద్రచోడాచారి అనికూడ గలదు. 'రాజేంద్రచోడ' అనునది తండ్రికి యువరాజుగ నుండినపు డున్నకులోత్తుంగుని కిఁగల మొదటినామము. నిశ్చయముగా యువరాజు నెడగల భక్తివిశ్వాసములను జూపుటకే యువరాజు నామమును లేఖకుఁడు గూడ వహించియుండెను. ఇంతియగాక యాలేఖకుఁడు రాజునకు ప్రియుఁడును, ముఖ్యలేఖకుఁడుగను గూడ నుండెను. ఎందుకన నతనికాలమున నాతనిశాసనములను బెక్కింటిని నతఁడే లిఖియించి యుండెను. కనుక రాజేంద్రచోడాచారి వీరరాజేంద్రుని భృత్యుఁడు గాఁడు. కులోత్తుంగుని, వాని యధికారమును నాశనముఁ జేయుటకై ప్రయత్నించెడు బలవంతుఁడగు శత్రువు కులోత్తుంగునకుఁ గలడని యాశాసనములు చాటుచున్నవి. ఇపు డాశత్రు వెవ్వరో, ఎందుకొఱకు ద్రాక్షారామ భీమేశ్వర సన్నిధానమున నట్టిభయంకరము లయిన ప్రతిజ్ఞల నేల పూనవలసి వచ్చెనో మనము పరిశీలింపవలసి యున్నది.

వీరచోడుని చెల్లూరిశాసనములో తనపినతండ్రియగు నేడవవిజయాదిత్యుని పరాక్రమమునఁ బంచాననుఁ డని కులోత్తుంగుఁడు చెప్పినట్లు వ్రాయఁబడియుండెను. ఇట్లుండు నేకాలమునందును కులోత్తుంగుఁడు

విజయాదిత్యునియెడ శత్రుత్వముగాని, శత్రుభావముగాని కలిగియుండెనని తలంచుటకు సాధ్యపడదు. అట్లే విజయాదిత్యుఁడు తనయన్నకుమారుని రాజ్యమునుండి కుటుంబముతో వెడలఁగొట్టి అన్యాయముగా రాజ్యమాక్రమించుకొన్నాడని నమ్ముటకును సాధ్యముకాదు. ఇదే నిజమైనయెడల వేంగీరాజ్యమునకు రాజప్రతినిధిగా తనకుమారుఁడయిన వీరచోడుని నియమించిన పదునైదుసంవత్సరముల తరువాత తనపితృవ్యుఁడగు విజయాదిత్యునిగుఱించి యట్టి గౌరవాస్పదము లయినవిశేషణముల నుపయోగించి ప్రసంగించుట సంభవింపదు. ఆశాసనములోనే యీయూహను బలపఱచునట్టి మఱియొకవాక్యము గలదు.

'చోడరాజ్యాభిలాషియై వేంగీరాజ్యమును పూర్వము తనపితృవ్యుఁడయిన విజయాదిత్యన కొసంగగా నాతఁడు పదునైదు సంవత్సరములు పరిపాలించెను. అతనివెనుక కులోత్తుంగుని పెద్దకొడుకగు రాజరాజు (రెండవ) వేంగిరాజ్యమును బొంది యొకసంవత్సరము మాత్రము రాజ్యభారము వహించెను'. ఇపుడీవాక్యము మనల మఱికొంచెము దూరము ముందుకు తీసికొని పోవుచున్నది. విజయాదిత్యుని తరువాత నేయాటంకమును లేకుండ రాజ్యము సులువుగా కులోత్తుంగుని కుమారుఁడగు రాజరాజునకు వశమయ్యె ననియు, నెట్టికలవరమును లేకుండ సక్రమముగా నాతని పరిపాలనము యథావిధిగా జరుగుచుండెననియు బోధపడగలదు. కనుక చోడరాజ్యము నభిలషించి రాజేంద్రచోడుఁడు వేంగిరాజ్యమును తనపితృవ్యుఁడగు విజయాదిత్యునికి నొసంగెనని చెప్పినమాట విశేషప్రాముఖ్యమును వహించునదియై యుండెను. ఇందువలన విజయాదిత్యునకును, ఆతనియన్నకుమారుఁడైన రాజేంద్రచోడునకు మనస్పర్థలు కలవేమో యని యనుమానింప నగత్యము లేదు.

అట్లయిన యీశత్రు వెవ్వరై యుండును? పశ్చిమచాళుక్యులు కారనుమాట సత్యమని తెలిసికొనుచున్నాము. వీరరాజేంద్రచోడ చక్రవర్తి

మే శత్రువని నిస్సందేహముగాఁ జెప్పఁదగును. అనేక కారణముల వలన వీరరాజేంద్రుఁడు వేంగీరాజ్యముపై దృష్టిఁ బఱపి యుండెను. అతఁడు వేంగీరాజ్యమును గలుపుకొని తనరాజ్యమును, తనయధికారమును విస్తరింపఁ జేయవలయు ననియు, పెఱుగు చున్న పశ్చిమ చాళుక్యుల యధికారము నడ్డుకొనవలె ననియు నత్యాతురముతో నుండెను. ఈవేంగీ రాజ్యమును తమకు లోఁబడిన సామంతరాజ్యముగ నుంచుకొనవలయు నని చోడులును, పశ్చిమ చాళుక్యులును మూఁడుతరముల నుండి పోరాడుచుండిరి. వేంగీరాజ్యమును స్వాధీన పఱచుకొనవలయు నని వీరరాజేంద్రుఁడు పెక్కుమాఱులు వేంగీరాజ్యముపై దండెత్తి వచ్చినటులు వాని శాసనములను బట్టి తెలిసికొనఁగలము. ఈదండయాత్రల నన్నిటను నాతఁడు విజయముఁగాంచి యుండలేదు. మఱియు నీయుద్ధములలో కులోత్తుంగుఁడు పశ్చిమచాళుక్యులయు, పూర్వగాంగులయు తోడ్పాటుతో వారలను దఱిమివేసి, వేంగీరాజ్యము యొక్క స్వాతంత్ర్య గౌరవమును నిలిపియుండవచ్చును. కనుక వీరరాజేంద్రుఁడు పశ్చిమచాళుక్యులతోడి పోరాటములలో, అనఁగా ౧౦౬౩—౭౦ సంవత్సరముల నడుమ నెపుడో యొకింత జయము యొక్క సూచనలు గానఁబడినప్పుడు ద్రాక్షారామములో భీమేశ్వర సన్నిధానమున స్థానికనాయకులు ప్రతిజ్ఞలుచేసి తమశాసనములను వ్రాయించియుందురు. డాక్టరు అయ్యంగారును, వారియోచన ననుసరించెడు తదితరపండితులును చరిత్రప్రాముఖ్యమును గాంచిన వీరచోడుని శాసనమునువిస్మరించి, కులోత్తుంగుని వీరరాజేంద్రునికి యువరాజునుగఁ జేసి యతనికిని విజయాదిత్యునకు వైరము గలదను వింతసిద్ధాంతమును గల్పించుటలో పొరబడి రని చెప్పఁదగును. ఏమైనను వీరరాజేంద్రుఁడు తనకాళ్లపైఁబడి వేడికొన్నందునఁ గరుణించి విజయాదిత్యునకు వేంగి రాజ్యము నొసంగితినని తన పెరుంబేరు శాసనములోఁ జెప్పుకొన్నది డంబము కొఱకే గాని, వాస్తవముగా నతఁడు వేంగీరాజ్యమును స్వాధీనముఁ జేసికొని నిరాటంకముగాఁ బరిపాలించినట్లు గన్పట్టదు.

ఇప్పుడు మన మీఁపండితుల యొక్క వింతసిద్ధాంతము లొక్కొక్క దానిని గొని వివరముగ విషయములను బరిశీలించి యెంతవఱకు సమ ర్థనీయములో విమర్శించి చూతము. తమ ఎన్షెంటు ఇండియా అను గ్రంథములో డాక్టరు అయ్యంగా రిట్లు వ్రాయుచున్నారు. *

"గంగయికొండ చోళుని అల్లుఁడును, తూర్పుచాళుక్యుఁడు నగు రాజ రాజు మరణించెను. అతనికి కనీసము కులోత్తుంగుఁ డను ప్రఖ్యాతనామ ము గల 'రాజేంద్రుఁ' డను నొక్క కుమారుఁడును, 'కుందవై' యను నొక్క కొమరితయుఁ గలరు. కాని మొదటివీరరాజేంద్రునిసహా యమువలన వేంగీరాజ్యము కులోత్తుంగుని పితృవ్యుఁడగు విజ యాదిత్యునివర మయ్యెను. ఇందుకై పొసఁగిన వివాదము పశ్చిమ చాళు క్యుఁడగు వీరరాజేంద్రుఁడు విజయవాడి(బెజవాడ) వద్దజరిగిన యుద్ధ ములో విజయమును పొంది వేంగీరాజ్యపీఠమున విజయాదిత్యుదిని గూరుచుండఁబెట్టెను."

కాని దిగువను రాజేంద్రచోడునకును, మొదటివీరరాజేంద్రునకును యువ రాజుగనుండి "వాయిరాగర" మను ప్రదేశమున నేనుఁగులను బట్టుటయు, సక్కరకొట్ట దుర్గమును ముట్టడించుటయు, నను రెండు ఘనకార్య ములను నెఱవేర్చితినని కులోత్తుంగుఁడు తనమొదటి శాసనములలోఁ జెప్పుకొని యుండె నని డాక్టరు అయ్యంగారు విస్పష్టముగా వ్రాయు చున్నారు. †

తనమేనమామయగు వీరరాజేంద్రునకు యువరాజుగ నుండినయెడ వేంగీ రాజ్యమునకై వివాదము కలుగుటకు కారణమేమి? ఎవరినడుమ నట్టి వివాదము సంభవించెను? వాదిప్రతివాదు లెవ్వరు? అయ్యంగారివాదము ననుసరించినను, వేంగిరాజ్యమునకై పొసఁగిన వివాదములో విక్రమా దిత్యుఁడెవరి పక్షమున నుండెనో తెలుపఁబడలేదు. రాజ్యమును న్యాయ ముగాఁ బొందదగిన హక్కుదారుఁడగు కులోత్తుంగుఁడు వీరరాజేంద్రు

* ఎన్షెంటు ఇండియా, పేజి. 121.
† ఐబిడ్ పేజ 124. 130. 131.

నకు యువరాజుగ నుండెను, అతనికి ప్రతిస్పర్థియని చెప్పఁదగిన విజయాదిత్యుఁడు తనవలన రాజ్యమును బొందినవాఁడేగదా? ఇఁక యుద్ధ మెవరితోడ? నిశ్చయముగా డాక్టరు అయ్యంగారు విషయములను తాఱుమాఱు గావించినా రని చెప్పఁదగును. వీరరాజేంద్రుఁడు తనకు యువరాజును, మేనల్లుఁడు నగుకులోత్తుంగుని విడిచి యెక్కడనో మేన ల్లుని పిత్రవ్యుఁడగు విజయాదిత్యునికి రాజ్యము నీయవలసి వచ్చెను? కనుక వీరరాజేంద్రుఁడు విజయాదిత్యునకు వేంగీరాజ్యము నొసంగెనను ట సాధ్యమైనదియు, విశ్వసింపఁదగినదియుఁ గాదు. అతఁడెప్పుడును విజయాదిత్యునకు మిత్రుఁడుగా లేఁడని యీ క్రింది నిర్వివాదాంశముల వలన స్పష్టపడఁగలదు. ఈకాలమున విజయాదిత్యుఁడు వీరరాజేంద్రునకు గర్భ శత్రువును, పశ్చిమచాళుక్యచక్రవర్తియు నగు ఆహవమల్లుఁడను నామాంతరమును వహించిన మొదటి త్రైలోక్యమల్లసోమేశ్వరునకు సామంతుఁడుగనుండి ౩౨౦౦౦ గల నోలంబవాడివిషయమును బరిపాలించుచుండెను. విజయాదిత్యుని మంత్రి యగుదండనాయకసంధివిగ్రహి దేవపయ్య యొక్క క్రీ. శ. ౧౦౬౬ వ సంవత్సరమున లిఖింపఁబడిన నొక శాసనములో విజయాదిత్యుఁడు త్రైలోక్య మల్లుని పాద పద్మారాధకుఁ డని వక్కాణింపఁబడి యుండెను.*

కనుక తనకు శత్రువగు అహవమల్లునకు సామంతుఁడుగ నుండిన విజయాదిత్యునకు వేంగిరాజ్యమును వీరరాజేంద్రుఁ డిచ్చె ననుమాట విశ్వసింపఁదగినది కాదు. అందును ముఖ్యముగా కీర్తిశేషుఁడయిన తన సోదరుఁడు వేంగిరాజ్యమును జయించి తిరిగి స్వాధీనము చేసికొనవలసిన దని చెప్పినపు డట్టిది సంభవించి యుండదు.

డాక్టరు అయ్యంగారివాదము నిలువఁజాల దనుటకు నవీనముగా వెల్వడిన మఱియొక శాసనప్రమాణము గలదు. పూర్వగాంగులలోని వాఁడయిన అనంత వర్మ చోడగంగుని కొర్ని శాసనములో నిట్లు వ్రాయఁబడి యున్నది. అస్తమించుచున్న సూర్యునివలె విజయా

* సౌతిండియన్ ఎపిగ్రఫీ ఆన్యూయల్ రిపోర్టు 1925. పే 75.

దిత్యుఁడు వృద్ధుఁడైయుండి పడమటి దిశవలెనున్న వేంగిని విడిచిపోవు నపుడు చోడులవలనఁ బెట్టఁబడినకష్టముల సముద్రములో మునిఁగి పోవు చుండ, దీనరక్షకుఁ డయిన తనతండ్రి రాజరాజు విజయాదిత్యుని పడ మటి రాజ్యమునఁ జాలకాల మైశ్వర్య మనుభవించునటుల గావించెను.*
ఇందుఁదెలుపబడినటుల విజయాదిత్యునకు కష్టములను గలిగించి బాధిం చినచోడు లెవ్వరు? కులోత్తుంగుని కాకాలమున సైన్య మున్నట్లుగాని, అతఁడు స్వతంత్రముగాఁ బ్రవర్తించినట్టుగాని, శాసన ప్రమాణములు గన్పట్టవు. మఱియు నతఁడు చాళుక్యుఁడు గాని చోడుఁడు గాఁడు. అది యునుగాక మనఃపూర్వకముగా నిష్టముతోఁ దనపిత్రవ్యునకు రాజ్యము నొసంగి యుండి యతని బాధించె ననుటయు విశ్వసింపఁదగినదికాదు.
డాక్టరు అయ్యంగారు విశ్వసించు రీతిగా వీరరాజేంద్రుఁడు తనపెరుం బేరు శాసనములో డంబముగాఁ జెప్పుకొన్నట్టు విజయాదిత్యునకు రాజ్యము నొసంగినమాట వాస్తవమె యైనయెడల విజయాదిత్యుని కొఱకు తూర్పుగాంగ రాజయిన రాజరాజు చోడుల నేల యెదుర్కొ నవలసి వచ్చెను? కనుక డాక్టరు అయ్యంగారును వారిపక్షమువారును వీరరాజేంద్రుఁడు వేంగిరాజ్యమును విజయాదిత్యున కొసంగె నని చెప్పు టలోఁ బొరబడిరనుట స్పష్ట మగుచున్నది.
రాజరాజనరేంద్రుని మరణానంతరము వీరరాజేంద్రుఁడు వేంగీరాజ్య ముపై పలుమాఱు దండెత్తె ననుటను డాక్టరు అయ్యంగారు నమ్ముచు న్నారు. వేంగీరాజ్యముపై తనవాఁడైన విజయాదిత్యుని పట్టాభిషిక్తుని గావించియున్నప్పుడు ప్రతిసంవత్సరము దండయాత్ర లేల సాగింప వలసి వచ్చెను? విజయాదిత్యుఁడు శత్రువు కాని యెడల యువ రాజు నితో యుద్ధము సేయుచుండెను? వేంగీరాజ్యము పాలించుచున్న రాజె వ్వరో, ఆతనికి ప్రతిస్పర్థిగా నిలిచి రాజ్యముకొఱకు వివాదము పెట్టు కొన్న దెవ్వరో, డాక్టరు అయ్యంగారు వక్కాణించి యుండలేదని యిది వఱకే తెలిపి యుంటిని. విజయాదిత్యుని దయతో కులోత్తుంగుఁడు

* సు.ప్రా, పే 123, బంతులు 80-91.

వేంగీరాజ్యము పై నిలిపి యుండెనని యిదివఱకె తెలుపఁబడి యుం
డెను. (వీరచోడుని చెల్లూరు శాసనము చూడుఁడు) కాబట్టి కులో
త్తుంగుఁడు మొదటి వీరరాజేంద్రునకు యువరాజుగ నుండలే దనియు,
విజయాదిత్యుఁడు వీరరాజేంద్రునివలన వేంగీరాజ్యముపై నిలుపఁబడి
యుండ లేదనియు స్పష్టమగుచున్నది. వీరివాద మిట్లుండ నింక ప్రొఫె
స్సరు వేంకటరామయ్యరు గారు కులోత్తుంగుఁడు తనపిత్రార్జితరాజ్య
మగు వేంగీరాజ్యమునకు తనపితృవ్యుఁ డగు విజయాదిత్యుని తనకుఁ బ్ర
తినిధిగాఁ బట్టాభిషిక్తుని గావించిన విషయము నొప్పుకొనుచు చోడ
సామ్రాజ్యాభిలాషి యై ముందు క్రమముగాఁ దగు కాలములోఁ బొం
దవచ్చు నను ధైర్యముతో ౧౦౬౩ వ సంవత్సరములో వీరరాజేంద్రు
నకు యువరాజుగనుండఁగోరి,యట్లు గావించె నని వాదించుచున్నారు.*
ఇయ్యది వీరచోడుని శాసనములో కులోత్తుంగుఁడు మొదట వేంగీ
రాజ్యమునకుఁ బట్టాభిషిక్తుఁడై క్రమక్రమముగా కేరళ, పాండ్య కుంత
లములను ఎల్ల దేశములను, జయించి,పిమ్మట చోడసామ్రాజ్యమునకుఁ
బట్టాభిషిక్తుఁ డయ్యె నని తెలుపఁబడిన యభిప్రాయమునకు వ్యతిరేక
మైనవిరుద్ధవాద మై యున్నది.

వీనివలన వీరరాజేంద్రునకు యువరాజు నగుటకు ననుతలంపుతోగాని,లేక
ముందు క్రమముగా చోడసామ్రాజ్యము పొందదు ననుతలంపుతోఁ
గాని,వేంగీరాజ్యమును విడిచిపెట్టి యుండలే దనియు, చోడ సామ్రాజ్య
సింహాసనమును పొందుకోరికతోనే తన పితృవ్యునకు వేంగిరాజ్యము
నొసంగె ననియు; స్పష్టపడుచున్నది.

## ఇఁక మూఁడవ విషయము.

మణిమంగళము శాసనములో గంగయికొండ చోడుఁడు వానికి
తండ్రిగాక వాని తండ్రియొక్క కనిష్ఠసోదరునిగా రాజేంద్రదేవుఁడు

* 1925 వ సం॥ మద్రాసులో జరిగిన ఓరియంటల్ కాన్ఫరెన్సు ప్రొసీడింగ్సు పేజి 143. 145 చూడుము.

చెప్పుకొనియున్నవాఁడు.[1] దీనినిబట్టి కుంభకోణము కాలేజిపండితు లగు యల్. శ్రీనివాసయ్యంగారు, రాజాధిరాజు, రాజేంద్రదేవుఁడు మొదటి వీరరాజేంద్రుఁడు గంగయికొండచోడుని పుత్రులు గారనియు, సోదరపుత్రులనియు వ్రాయుచున్నారు. దీనిని జయంగొండారుకవి బలపఱచుచున్నాఁడు. (చూ. 1927 మార్చి 23వ తేది హిందూ.) కనుక కులోత్తుంగుఁడు గంగయికొండచోడునకు దౌహిత్రుఁడగుటవలనఁదన మేనమామ యగు వీరరాజేంద్రునికంటెను, అతనికుమారుఁ డగు అధిరాజేంద్రునికంటెను చోడసామ్రాజ్యమును బొందుటకు నెక్కువ హక్కు కలిగియుండెను. అప్పు డిట్లు జరిగియుండవచ్చును. ౧౦౬౩వ సంవత్సరములో తూర్పుచాళుక్యుఁ డగు రాజరాజు మరణము నొందినతరువాత వానికుమారుఁడగు కులోత్తుంగుఁడు వేంగీరాజ్యమునకుఁ బట్టాభిషిక్తుఁడయ్యెను. కొద్దికాలమునకుఁ బిమ్మట కులోత్తుంగుని మామగా రగు రాజేంద్రదేవుఁడుకూడ మరణముఁ జెందెను. అప్పుడు కులోత్తుంగుఁడు గంగయికొండ చోడునకు దౌహిత్రుఁ డగుటవలన మామగారియనంతరము చోడసామ్రాజ్యమున కభిషిక్తుఁడు కావలయు నని కొంతకాలమునుండి యుబలాటము పడుచున్నవాఁడుగావున మామగారిమరణవార్త విన్నవెంటనే వేంగీరాజ్యమున పితృవ్యుఁడగు విజయాదిత్యుని నిలిపి, తాను దక్షిణదేశమునకుఁ బోయెను. అనేకహేతువులచే నతఁ డిట్లు గావించి యుండవచ్చును. పశ్చిమచాళుక్యులకును చోడులకును గల తగవులకెల్ల మూలకారణమైయున్న వేంగీరాజ్యమును కేవలము బాలురుగా నున్నతనకొమాళ్లస్వాధీనములో నుంచుటకంటె, తనపితృవ్యుని స్వాధీనములో నుంచుట యుక్తమని తలంచి యుండును. ఇదియును గాక మఱియొక కారణముగూడఁ గన్పట్టఁగలదు. తనపితృవ్యుఁడగు విజయాదిత్యునియెడ నాతనికి భక్తివిశ్వాసములు మెండు. వేంగిరాష్ట్రమునఁదాను లేనికాలమునఁ దనపితృవ్యుఁడు తనపక్షమున నుండుటవలనఁ దనస్వదేశములోఁ దనయధికారము మెక్కువగా బలపడు నని యాతఁడు తలంచి యట్లు చేసియుండవచ్చును.

1 చూడు. సౌతిండియన్ ఇన్‌స్క్రిప్షన్స్; వాల్యుం 3, పార్టు 1, పేజి 59.

కాని, చోడరాజ్యములోఁ గులోత్తుంగుఁడు తలంచినట్లు జరుగలేదు. దురదృష్టవశమునఁ గులోత్తుంగుఁడు రంగము చేరునప్పటికే వీరరాజేంద్రుఁడు చోడసామ్రాజ్యమున కభిషిక్తుఁడు కావలయు నని చాలకాలమునుండి కోరికతో నుండుటచేతఁ దనస్థానమును విడిచి బహుదూరము వచ్చిన వాఁడగుటచేత, వేంగీరాజ్యమునకుఁ బోఁదలంచుకొనలేదు. కాని వీరరాజేంద్రచక్రవర్తి విశేషపరాక్రమవంతుఁ డగు ప్రతిస్పర్థిగ నేర్పడుటవలన నతనికోరిక సులువుగా ఫలింపలేదు. కావునఁ గులోత్తుంగుఁడు తనప్రతిస్పర్థిని జయించి, చోడసామ్రాజ్యమును సంపాదించుటకై వీరరాజేంద్రుని పరిపాలనకాలమునంతను (అనఁగా నేడేండ్లకాలము) ప్రవాసమునఁ గడగండ్లుపడుచు కాలముఁ గడుపవలసి వచ్చెను.

అతఁడు యువకుఁడుగా నున్నకాలమున సక్కరకొట్టమును జయించి వాయిరాగరమున నేనుఁగులను బట్టుకొనుట జరిపియుండె నని శాసనములలోఁ జెప్పఁబడి యుండెను. ఇయ్యవి యాతఁడు రాజమహేంద్రవరమునఁ దనతండ్రికి యువరాజుగ నుండినపుడు జరిపినవేగాని తన తాత గంగయికొండచోడునకు గాని, తనమేనమామ వీరరాజేంద్రునకు గాని యువరాజుగ నుండినపుడు జరిపినవి కా వని మనము తెలిసికొనఁ గలము. వేంగిరాజగు రాజరాజనరేంద్రుఁడును, చక్రకొట్యామండలాధీశ్వరుఁ డగుధారావర్షుఁడును నొండొరులతో వైరములు గల్పించుకొని పోరాడుచుండి రనియు, సమయము చిక్కినపు డొండొరుల రాజధానీ పట్టణములను దగులఁబెట్టుకొనుచుండి రనియుఁ గొన్ని శాసనములవలనఁ దెలియుచున్నది.[1]

ఇందువలన చక్రకొట్యమండలముపై (బస్తరురాజ్యము) కులోత్తుంగుని దండయాత్రకాలమును నిర్ణయించుటయు, నాకాలమున నెవనికి యువరాజుగ నుండెనో తెలిసికొనుటయు, సాధ్యము కాఁగలదు. ధారావర్షుని కడపటిసంవత్సర మాతనిసామంతులలో నొక్కఁ డగు మహామండలేశ్వర చంద్రాదిత్యునిశాసనములో నుదాహరింపఁబడిన ౧౦౬౦ గా

1 ఎపి. ఇండి. సం 6. పే 25.

ఎత్తుకొనవచ్చును. ఈశాసనములో ధారావర్షుని రాజధాని బరశూరు పట్టణములో చంద్రాదిత్యుఁడు తనపేరిటఁ జంద్రాదిత్యసముద్రమను పేరిట నొకచెరువుఁద్రవ్వించి దానికట్టమీఁదను చంద్రాదిత్యేశ్వరుఁడను పేరుతో నొకశివాలయమును నిర్మించినట్లు తెలుపఁబడినది. ఈశివాలయపోషణార్థ మతఁడు ధారావర్షునినుండి యొకగ్రామమును కొని దానము చేసినట్లుగాఁ జెలుపఁబడినది. ఈచంద్రాదిత్యుఁడు చోడుఁడనియు, కాశ్యపగోత్రుఁ డనియును, శతపమంశలమును బాలించిన పూర్వచోడులతో సంబంధముగలవాఁ డనియు,కులోత్తుంగుని పక్షమున నాతనితో దండయాత్ర వెడలివచ్చె ననియు, అతఁడు జయింపఁబడిన రాజ్యములోనుండి తరువాతఁ గొంతకాలమునకు నచటనే స్థిరపడి ధారావర్షునికి సామంతుఁ డయ్యెననియు శాసనపరిశోధకులు చెప్పుచున్నారు.[1]

ఇట్టిపరిస్థితులు వేంగిచక్రకోట్యమండలముల మధ్య జరుగుచుండిన యుద్ధములు ముగిసినపిమ్మటఁ గొంతకాలమునకు గాని సంభవింపవు. కనుక ౧౦౬౦ లేక ౧౦౬౫ లకు పూర్వమే యుద్ధము ముగిసియుండును; గనుక నాయుద్ధములలోఁ బాల్గొన్నకులోత్తుంగుఁ డాసంవత్సరములకుఁ బూర్వమె తనతండ్రికి యువరాజుగ నుండి నడిపియుండవలయును గాని, గంగయికొండచోడునికి గాని, వీరరాజేంద్రచోడునికి గాని యువరాజుగ నుండి జరిపినవి కా వని బోధపడఁ గలదు.

తండ్రిమరణానంతరము కులోత్తుంగుఁడు వేంగిరాజ్యమును బొందియుండియుఁ దనకై చోడరాజ్యమును సంపాదింపఁ గోరి, ఎందుకు వేంగిరాజ్యమును పితృవ్యునకు విడిచిపెట్టెనని యొకప్రశ్నము పుట్టవచ్చును. అతఁడు చక్రవర్తియై వేంగిచోడరాజ్యములను పాలింపవలె ననుపెద్దకోరికతోఁ జేసినపని కాని మఱియొకటి కాదు. ఇతరు దీనిని సామాన్యదృష్టితో నాచరింపలేరు. ఇతఁడు మంచిసూక్ష్మబుద్ధిగలవాఁడును, రాజ్యాంగవేత్తయు, మంత్రాలోచనాపరుఁడు నగుట

1 సౌతు ఇండియన్ ఎపిగ్రఫీ 1908—9, 3 పే, పేరా 65.

కులోత్తుంగ చోడదేవ చక్రవర్తి.

వలన నెప్పుడును పశ్చిమచాళుక్యులకు సామంతుఁడుగా నున్నతనపిన్న తండ్రిని తనపక్షమునసుండి తనకుఁదోడ్పాటుగా నుండుటకై దూరదృష్టితోఁ గావించెను. మఱియు విజయాదిత్యుఁడు తనతండ్రి పరిపాలన కాలమున నత్ప్రాప్తిని గాంచి పశ్చిమచాళుక్యుల యండను జేరియున్న వాఁడుకావున నాతని మనోవ్యథ నుడిపి సంతోష పఱచి తనప్రక్క నుంచుకొనుటకై యతం డిట్లు గావించెను.

విజయాదిత్యుఁడు ౧౦౬౮ మొదలుకొని ౧౦౭౭ వఱకు నోలంబవాడి విషయమునకుఁ బాలకుఁడుగా నుండి, పశ్చిమచాళుక్య రాజగు మొదటి సోమేశ్వరునకు సామంతుఁడుగ నున్నట్లు శాసనములవలనఁ దెలియు చున్నది [1]

మఱియు విజయాదిత్యుని రెండవ కుమారుఁడగు శక్తివర్మయొక్క ప్రకటింపఁబడని తామ్రశాసనమువలన నతఁడు ౧౦౬౮ వసంవత్సర మున వేంగీరాజ్యమును బరిపాలించుచుండినట్లు గన్పట్టుచున్నది.[2]

ఈసంవత్సరము విజయాదిత్యుని పరిపాలనకాలములో చేరినదై యున్నది. విజయాదిత్యునిర్యాలితామ్రశాసనములోఁ దాను పుత్రుని యెడఁ గల ప్రేమచేత వానినిరాజ్యమునకుఁ బట్టాభిషిక్తునిఁ జేయఁగా నాతఁ డొక్కసంవత్సరముమాత్రము పరిపాలించి, యకస్మాత్తుగా మరణించె ననియు, అభిమన్యుఁడు చనిపోయిన వెనుక అర్జునుని రీతిగా రాజధర్మమును, వీరధర్మమునుగూడ పరిపాలించుటకై బుధుల ప్రబోధమును పురస్కరించుకొని, మరలి రాజ్యాధికారమును వహించితి నని చెప్పుకొని యున్నాఁడు.[3]

కనుక నాకాలమున దనకుమారుని వేంగీరాజ్యమున నిలిపి, తాను నోలంబవాడివిషయమును బరిపాలింప విజయాదిత్యుఁడు పోయియుండును.

---

1. ఎపి, నం 332—1925 ఆన్ సౌతిండియన్ ఎపిగ్రఫీరిపోర్టు 1925. పేజీ. 75. ఏపి. ఇండి. సం 4. పే 213.
2. 1913-వ నం 8. ఎపిరిపోర్టు 1914. పేజీ 86. ప్యారా 10.
3. ఎపి. రిపోర్టు 1925. పేజీ 77. పేరా 5.

ఇతఁడు ౧౦౪౭వ సంవత్సరమునుండి పశ్చిమచాళుక్యులకు సామం తుఁడుగా నున్నవాఁడు గావున వారితోడి మైత్రిని బలపఱచుకొనఁగోరి అట్లు పోయియుండెను. మఱియు విజయాదిత్యుని తామ్రశాసనము లోఁ జెప్పఁబడిన యలంకారమువలన నీతఁడర్జునునివలెనే తనకుమా రుని వేంగీరాజ్యమున నిలుపఁగోరెను; కాని యదృష్టము వేఱుగా ను న్నందున నతఁడు మఱణించుట సంభవించినది. అభిమన్యుని మరణము వలెనే శక్తివర్మ మరణముగూడ నుండెనని యందలి యలంకారము వలన నూహింపవచ్చును. తనతండ్రి యగువిజయాదిత్యుఁడును, సోద రుఁడగుకులోత్తుంగుఁడును లేనికాలమున శక్తివర్మ మొదటి వీరరా జేంద్ర చోడచక్రవర్తితో జరిగిన యుద్ధములో మృతినొంది యుండ వచ్చును. రెండవశక్తివర్మ చనిపోయినతరువాత స్వల్పకాలము వేంగీ రాజ్యము వీరరాజేంద్రుని వశమున నుండెను. తరువాత విజయాదిత్యుఁ డే పూర్వగాంగుఁడైన రాజరాజుయొక్కయు, కులోత్తుంగుని యొక్క యు బశ్చిమచాళుక్యులయొక్కయుఁ దోడ్పాటుతో వీరరాజేంద్రుని దేశ మునుండి తఱిమివైచెను.

కులోత్తుంగుఁడు ప్రవాసమున నున్నకాలమున నేమిచేయుచుండెనో, మనకేమియుఁ దెలియరాదు. అతఁడు పశ్చిమచాళుక్యుఁ డగు నాహ వమల్లునితోడను, బహుశః తనపినతల్లిపెనిమిటి యగు తూర్పుగాంగ రాజయిన రాజరాజుతోను, ఆహవమల్లుని కుమారుఁ డగు రెండవ సో మేశ్వరునితోను మైత్రి నెఱపుచు, వీరరాజేంద్రునిజయించి చోడరాజ్య మాక్రమించుకొనుటకై సమయముకొరకు వేచియుండును. ౧౦౭౦ వ సంవత్సరమున వీరరాజేంద్రచక్రవర్తి మరణించెను; గాని పశ్చిమ చాళుక్యచక్రవర్తియగు నాఱవ విక్రమాదిత్యుఁడు తన మామగారగు వీరరాజేంద్రచక్రవర్తి మరణించగానే వెంటనే కాంచీపురమునకుఁ బోయి తన బావమఱది యగుఅధిరాజేంద్రునిఁ బట్టాభిషిక్తునిఁగా వించి, స్వదేశమునకుఁ బోయెను. ఆతని ప్రభుత్వమును దేశములోని ప్రజ లొప్పుకొనక యతనిఁ జంపివేసి రని బిల్హణుఁడు తనవిక్రమాంక

చరిత్రమున వక్కాణించి యున్నాఁడు. ఆసమయమునఁ గులోత్తుంగుఁడు చోడసామ్రాజ్యము నాక్రమించుకొని, తాను పట్టాభిషిక్తుఁడై, నాటనుండి యవక్ర పరాక్రమముతో నేఁబదిసంవత్సరములు చాళుక్య చోడసామ్రాజ్యములను పరిపాలించెను. అతనిలో రెండు కుటుంబములవారి సత్త్వములును గలిసిపోయి యుభయ వంశములు ప్రఖ్యాతిఁగాంచిన వగుటచేతఁ గులోత్తుంగుఁ డనునామ మాతనికి సార్థకమయ్యెను. పుట్టుకచేతఁ దాను చాళుక్యుఁ డయినను, దౌహిత్రుఁ డగుటచేత చోడసామ్రాజ్యమునకుఁ గూడ హక్కుదారుఁ డయ్యెను. అతఁడు కాంచీనగర సింహాసనమునఁ జాళుక్యచోడసామ్రాజ్య మను నామముతో చాళుక్య వంశమును నిలిపెను.

రాజమహేంద్రవరము. చిలుకూరి వీరభద్ర రావు.

# కళింగోత్సవము.

ఒకమహా పురుషుని జయంతి జరుపుట మన కందఱికిని పరిచయమైన విషయమే! అట్టిమహాపురుషుల కనేకులకు జన్మస్థానమై, చిత్రకళలకు శిల్పమునకు సాహసికజీవనమునకు - వేయేల - ఒకజాతిని మహోత్కృష్టమైనస్థితికి దీసికొనిరాఁగల నాఁగరకత కాటపట్టయి అలరారి, నేఁడు దిక్కుమాలి దైవవశమున నామమాత్రావశిష్టమై యున్న ఒకానొక రాజ్యము, దేశము, జాతి యొక్క - స్మారకవర్ధంత్యుత్సవము జరుపుట అపూర్వమైనవిషయము. పూర్వచాళుక్యాన్వయతిలకుఁడగు రాజరాజనరేంద్రుని యశోగీతికలు మనల నొకసారి వినిపించినయాంధ్రదేశీయేతిహాసపరిశోధకమండలి వారే కళింగరాజ్యపూర్వవైభవమును వర్ధంత్యుత్సవరూపమున స్మృతిపథమునకుఁ దెచ్చి, మనల నొకసారి పులకాంకితశరీరులను గావించియుండిరి. ఆయుత్సవస్మరణమే మనలఁ గన్నులనుండి యొక్క - సారిగా నానంద విషాద సూచకములయిన బాష్పకణముల రాల్పఁ జేసి యుండెను. కళింగమును కాలగర్భమునుండి స్మృతిపథమునకుఁ దెచ్చుటకు మండలి వారు జరిపిన వైభవస్మారకోత్సవము వేనోళ్లఁ బ్రశంసింపఁదగినది. అందలి నిగూఢభావము గుర్తించుట మిక్కిలి కష్టము. దానిని ధ్యానించుచు నిమీలితనేత్రుల మయి ఆనందాబ్ధియందు మునిఁగి తేలియాడవలసినదే !

కళింగ మిప్పటికి నామమాత్రావశిష్టమై యున్నది. కళింగరాజ్యసీమ [illegible] ంచుటకు [illegible] దుస్సాధ్యములై యున్నవి. కళింగప్రజల [illegible] భ్యత యెట్టిదో, నిరూపించుటకైన నేటికాళింగుల స్థితి తోడ్పడుట లేదు. కళింగవైభవము ననుభవించి, కళింగకవుల కవితాసారసము నాస్వాదించిన మహానగరములు నేఁడు రూపుమాసి పాడుగోలుపు చున్నవి. కాళింగుల లలితకళావైభవము నేఁడు, అజ్ఞానులచే నితరుల

కారోపింపఁబడి, ఏతద్గౌరవము వారిచే ననుభవింపఁబడుచున్నది. ఇంతేల? నేటికళింగమునకు ఊరునుఁ బేరును బ్రతిష్ఠయును లేకుండఁబోయినది. సముద్రాంతరసీమలకు సాహసముతో నటిగి, తమయుత్కృష్ట నాగరకతను ధర్మములను కళలను వ్యాపింపఁజేసి కీర్తనీయులయిన ప్రాచీన కాళింగుల ప్రతిభను స్మరించు కాళింగుఁడొకఁడైనను లేనికాల మిది. మండలివారు జరిపినయుత్సవము లోకమునకు కండ్లు తెఱచినది. కాలవశమున మందులయినవారికి జీవశక్తిని పోసినది. 'నేను కాళింగుఁడ' నను గర్వము ప్రతికాళింగుని హృదయమునందును మొలక లెత్తి వృద్ధిఁజెందుటకుదోహదము గావించినది. ఇంతదనుక విస్మృతమై, శిలా తామ్ర శాసనావశిష్ట మైయున్న దివ్యచారిత్రమును పునస్స్మరణ గావించుటకు పరిశోధనకై ఉత్సాహోహాదగ్రుల నీయుత్సవము పురికొల్పినది.

కాళింగులు ఓఢ్రజాతీయు లని ఓఢ్రులును, ఆంధ్రజాతీయు లని యాంధ్రులును, కళింగదేశము ఆంధ్రావనియం దిమిడి యున్నదని ఆంధ్రులును, ఓఢ్రదేశమునఁ గలసి పోయె నని వాదించుచున్నారు. కాళింగుల భాష పూర్వ మేదో నిరూపించుట కవకాశమే లేదు. ఇట్టి విపరీత పరిస్థితులందు కళింగదేశచారిత్రము నన్వేషించుటకు ఈయుత్సవము కారణ మగుచున్నది.

ఈవర్ధంత్యుత్సవ సందర్భమున సమావేశమయిన ఆంధ్రోత్కళచారిత్రిక పండితుల యొక్కయు, కవులయొక్కయు ఉత్సాహము వర్ణనాతీతము. ప్రకృతియుఁ బ్రాచీనకళింగమును సంస్మరించి యొకపరి దుఃఖించియు, నేడు పుత్రకుల దీక్షాస్ఫూర్తి కలరి, పరమమూర్తి యై, ఆనందము ననుభవించినదో యన్నట్లు చూపట్టెను. ఒడ లెఱుంగక మహావేగముతో నిండారఁ బొర్లి, ప్రవహించి ప్రాచీనకళింగనగరము నాలిసగనముఁ జేసికొనిన వంశధారాప్రనంతియు, నెడలేక వర్షించిన మేఘుఁడును, రాష్ట్రాంతర భూములనుండి యెంతేని శ్రమలకోర్చి యేతెంచిన మహనీయులును దీనికి సాక్షిభూతులు.

ఇట్టివర్ధంతులు ఎన్నేని జరుపవలసి యున్నది. ఆంధ్రులచరిత్రమును వారిమహాపురుషుల యశోదీప్తులును ప్రతియాంధ్రుని హృదయ సీమలందును వ్యాపించి ప్రజ్వరిల్లవలయును. కొండవీటి రాజమహేంద్రవరముల రెడ్డిరాజుల ప్రాభవములు, పల్నాటివీరుల సాహసపటిమ, కాకతీయుల తేజోవిలాసము, విజయనగరాంధ్రుల వైభవస్ఫూర్తి, మఱల మఱల మనకండ్లయెదుటఁ బ్రదర్శితము కావలయును.

భావనామూర్తు లయిన కవులచే గేయ రూపక అద్భుత కథారచనరూపమునఁ గీర్తింపఁ బడవలయును. నాఁడే ఆంధ్రుల భాగ్యోదయభానుఁడు తెలుఁగు సీమల వెలుఁగఁగలఁడు. మండలివారు రాబోవుసంవత్సరములందు, గిరిన అమరావతి, ధరణికోటలందు శాతవాహనుల క్షాత్రతేజమును, ఓరుగంటి మంటికోటబురుజులమీఁద గాకతీయశౌర్యవైభవమును, కార్యమపూఁడి రణరంగమున పల్నాటివీరుల సాహస కీర్తులను, కొండవీటి గిరిదుర్గమున రెడ్డి రాజుల విద్యాగోష్ఠిని, మహానవమిమంటపమున సాళువనారసింహ, కృష్ణదేవ అచ్యుతరామరాయాదులనాటి ఆంధ్రుల పౌరుషమును, మధుర తంజావూరులందు ఆంధ్రనాయక రాజుల సుఖకథావినోదప్రసంగములనుఒకసారి స్మరింపఁజేయుదురుగాక.

రాజమహేంద్రవరము. భావరాజు వేంకట కృష్ణరావు.

# జైనులమతకథలు – ౮ అంజనచోరుడి కథ.

శ్లో. సైషైకా సుగతిః, తదేవ చ సుఖం, తేపవ దృగ్బోధనే,
సిద్ధానా మపరం య దస్తి సకలం, త న్మే ప్రియం నేతరత్,
ఇ త్యాలోచ్య దృఢం తపవ చ మయా చి త్తే ధృతా స్సర్వదా,
త ద్రూపం పరమం ప్రయాతు మనసా హిం త్వాభయం భీషణం.

—ఆచార్యపద్మనంది.

ధైర్యానికి గానీ స్థైర్యానికి గానీ, సిరికి గానీ, సంపదలకు గానీ, భారతవర్షమే జన్మస్థానము. అనేకతరగతుల బుద్ధివైభవం కలవాళ్లేమి, అనేకతరహాల చిత్రవిచిత్ర ప్రకృతులు గలవాళ్లేమి, భారతవర్షంలో కుప్పతిప్పలుగా దొరకుతారు. అందులోనూ ఏరకానికి ఆరకాలు అన్నికాలాల్లోనూ సమృద్ధి. ఈవిషయం ప్రాచీనభరతవర్షష చరిత్ర పరికిస్తే విశద మవుతుంది. మఱి దీనికి తగినకథ వకటి వుంది. అది మన అంజన చోరుడిదే. అంజనచోరుడికథ కుపోద్ఘాతంగా జినదత్తశ్రేష్ఠిచరిత్ర కొంచెం చెబితే గాని అసలుకథకు ప్రణాళిక కుదరదు.

జినదత్తశ్రేష్ఠి మగధదేశస్థుడు. అతనిజన్మస్థలం రాజగృహం. ఆకాలంలో రాజగృహాన్ని పాలించేరాజుగారికీ ఈకథకూ అట్టే సంబంధం లేకపోయినా, పేరుమాత్రం సర్వార్థసిద్ధి అనిఅంటారు. జినదత్తుడు మంచిఆస్తికుడు. జినపాదాబ్జమత్తమధుకరుడు. ఆయన కేవలమూ దైవభక్తి ఆస్తికబుద్ధీ మాత్రమేగాకుండా, దానాలేం ధర్మాలేం వ్రతాలేం ఉపవాసాలేం విశేషంగా ఆచరిస్తూ, ఆకాలంలో పదిమందికీ మేలుబంతిగా వుండేవాడు. దానాలూధర్మాలూ అనడంతోటే చాలమంది పాత్రాపాత్రవివేచనం అక్ఖర్లేకుండా డబ్బుపారవెయ్యడం అనుకుంటారు. కాని అదికాదు. ఏవిధమైన దానాలూధర్మాలూ చేస్తే, లోకంలో విజ్ఞానమూ విభవమూ వృద్ధి అవుతుందో, దైవభక్తి తరణోపాయం సిద్ధిస్తుందో, అవే దానాలూధర్మాలూ అనాలెగాని తక్కినవి కావు.

శ్రేష్ఠిజినదత్తుడు సంపన్నుడుకూడాను. కాబట్టి అతని ధర్మశ్రద్ధాదులు మఱింత రాణించినాయి. జైనశాస్త్రాలల్లో ఎన్నెన్ని దేశవ్రతాలూ సామయికవ్రతాలూ చెప్పారో, అన్నీ అతడు ఆచరించాడు. పుస్తకదానము విద్యాదానము ఔషధదానము మొదలయిన లోకహితాన్ని చేసేవిన్నీ, తన్మూలకంగా ఆముష్మికాన్ని సాధించేవిన్నీ అయిన-దానా లెన్నెన్ని వున్నవో అన్నీచేశాడు. చివఱిదశలో విరక్తిగా ఆధ్యాత్మికోపాసన చేస్తూ కాలక్షేపం చేస్తున్నాడు.

ఇట్లా వుండగా వకమాఉ కృష్ణపక్షచతుర్దశి వచ్చింది. ఆనాడు అర్ధరాత్రివేళ శ్మశానానికి పోయి జినదత్తుడు కాయోత్సర్గాన్ని ఆచరిస్తూన్నాడు. సరిగ్గా ఆసమయానికే అమితప్రభుడనీ విద్యుత్ప్రభుడనీ ఇద్దరు దేవతలు లోకసంచారం చేస్తూ, ఆస్మశానం దగ్గరికి వచ్చారు. అందులో అమితప్రభుడన్నాడు గదా - 'నేస్తమా! చూచావా వోయి ఈశ్రేష్ఠిని. మహా శ్రేష్ఠుడుగా వున్నాడు. ఇంతగా ధ్యానధారణలో- ఇంత నిశ్చలమైన మనస్సుతో ఇతడు కాయోత్సర్గం చేస్తున్నాడు. సునిశ్చయం అనేది వకటి వుందిఅంటే- ఎవ్వరైనా సరేనోయ్ శ్రేయస్సు సాధిస్తాడు'

అమితప్రభుడి స్వభావంవంటిది గాదు విద్యుత్ప్రభుడిది. ఆయనకు 'పరగుణపరమాణూన్ పర్వతీకృత్య' వుంటే, ఈయనకు దానికి భిన్నంగా, 'పరగుణపర్వతాన్ పరమాణూకృత్య' అనే స్వభావం వుంది. ఆయన పైకి ఎప్పుడూ ఏమీ అనకుండానే తలొంచి చూస్తూ లోలోపలనే గుణగ్రాహిత్వాన్ని ఇనుమడింపజేసుకుంటాడు. కాని ఎప్పుడైనా కిస్త్రంజూలక అన్నాడా, విద్యుత్ప్రభుడు వెంటనే కృతానుమిత్యాన్ని చేస్తాన్ని వెల్లడిస్తాడు. ప్రస్తుతం జినదత్తుడివిషయంలో గూడా ఆయనకు అట్లాగే అయింది. అమితప్రభుడిమాటను చెవిమీదనే వేసుకుండా విద్యుత్ప్రభు డన్నాడుగదా - అం తొత్తిరినా సొత్తిరినా దయ్యాన్ని దొరగారి ప్రశంసకు పాత్రము! ఏమిటో! ఈట్లాంటి చలచిత్తులూ దాంభికులూ, కాయోత్సర్జనం చేయబూనితే, ఇంకపైన విద్యలు అసలే లేకుండా పోతాయి. హరి-ఓం అన్న ప్రతీవాడూ అవధానే కాగల్గితే లోకం నిలవగల్గు. ఇంతకూ నాకు నమ్మకం లేదు ఇటువంటి జాప్యాలు!

తర్వాత క్రమంగా వారిద్దరికీ మాటపట్టింపు వచ్చింది. పరీక్ష చేశామంటే పరీక్ష చేతామనుకొన్నారు. అమితప్రభుడు గెలుపు తనదే అని అన్నాడు. విద్యుత్ప్రభుడు 'ఇంతకుముందే గదా ఇద్దర్ని పరీక్షించి వచ్చాము. ఈపురుషుడు మూడోవా డవుతా' డన్నాడు. ఈదెప్పుడుమాటలను అమితప్రభుడు కోపించుకొని, సరే కథ కానీ అన్నాడు. వెంటనే విద్యుత్ప్రభుడు తనవిద్యాప్రభావంచేత జినదత్తుడికి ఎన్నివిఘ్నాలో కలుగచేయ నారంభించాడు.

కాని వీరిద్దరి పంతాలూ పాపం జినదత్తుడిపాలికి 'పిల్లికి చెల్లాటం ఎలుకకు ప్రాణసంకటం' లాగా అయింది. అయినా ధీరప్రజ్ఞుడు కాబట్టి, అన్నిటికీ చలించక నిలిచాడు. 'అయిందా?' అని అమితప్రభు డన్నాడు. నీవే ఈమాటు గెల్చా వన్నాడు. విద్యుత్ప్రభుడు. అంతట వారిద్దరూ కూడపలుక్కొని జినదత్తుణ్ణి సమీపించి అన్నారు- 'అయ్యా; జినదత్తా! ఇటు చూడు. మేము సిద్ధులము. నిన్న ఈరాత్రంతా పరీక్షించి నీనిశ్చలత్వానికి అబ్బురపడ్డాము. కాబట్టి నీకేదైనా కోరిక వుంటే చెప్పు. ఇచ్చి వెళ్లుతాము' అన్నారు. జినదత్తుడు లేచి నమస్కరించి అన్నాడు - 'అయ్యా! ధన్యుణ్ణి అయ్యాను. మీలాంటివారిదర్శనమే అనేకకోర్కెలను తీరుస్తూ కల్పవృక్షాలనుకూడా

ధిక్కరింపజాలి వుంటుంది. అందులో నాబోటివానిపై దయగలగడం అనేది పిచ్చు కుంటువానిపై గంగాప్రవాహం వంటిదిగదా. అయినా కోరుకోమ్మంటే కోరుతాను.

దేవు లిద్దరూ తప్పకుండా కోరమన్నారు. "అల్లాగైతే నాకు మరే ఏకోర్కెలూ లేవు. వలసినన్ని సంపద లున్నాయి. ఏదో జినభగవానుని కృపవల్ల పుత్త్రిలూ కళత్రం వగైరా లన్నీ చక్కగానే వున్నాయి. కాని ప్రపంచంలో ఎన్నెన్ని జైనదేవాలయా లున్నవో, వాటి నన్నింటినీ రోజూ సందర్శించి వస్తూవుండవలె నని వుంది. ఇది లభించే సాధనం ఏదైనా వుంటే, దయచెయ్యండి" అన్నాడు.

జినదత్తుడి భక్తిభావానికి మెచ్చుకోని వా రుభయులూ అతడికి ఆకాశగామిని అనేవిద్యను ఇచ్చారు. జినదత్తుడికోర్కె సఫలమైంది. అతడను కున్నాడుగదా—

శ్లో. యై ర్నిత్యం న విలోక్యతే జినపతి ర్నస్మర్యతే నార్చ్యతే,
న స్తూయేత న దీయతే మునిజనే దానం చ భక్త్యా పరం,
సామర్థ్యే సతి తద్గృహాశ్రమపదం పాషాణనావా సమం,
తత్రస్థా భవసాగరేఽతివిషమే మజ్జంతి నశ్యంతి చ.

—పంచాశిక.

[అనగా-తగినంతసామర్థ్యం వుండిన్నీ- అందుకు దగ్గ సంపదకూడా వుండిన్నీ ఎవ్వడు ప్రతినిత్యమూ తప్పకుండా జినేశ్వరుని సందర్శింపబూనడో, నందర్శనం ఒకవేళ అసంభవమైనా నోట ఒక్కమాటైనా స్మరింపడో, దేశకాలపాత్రాదులు అనుకూలంగా వుండికూడా, అర్చింపనైనా అర్చింపడో, తుదకు నోటితో స్తుతింపనుకూడా స్తుతింపడో, మునులకు దానముకూడ నీయడో వాడిదికూడా వక గృహస్థాశ్రమమనే అనిపించుకొంటుందా? అది గృహస్థాశ్రమంకాదు; కాని మాంఛి చట్రాత్తో జేసిన వోడమాత్రం అవును, అట్లాంటి వోడలోఎక్కి సంసారసముద్రాన్ని దాటగోరే వారు ఇఖ తరించడం మాట అల్లావుంచుదాము. మునిగి నశించడం తప్పదుకదా?

పిమ్మట-అదిమొదలుకొని అతడు ప్రతీదినం జాముప్రొద్దుండగా లేవడమున్నూ, కాల్యకృత్యాలు తీర్చుకొని సుప్రసిద్ధము లయిన జైనక్షేత్రాలకూ జైనతీర్థాలకూ వెళ్లడమున్నూ, అక్కడినదుల్లో స్నానాలు చేసి, ఆయాదేవతా మూర్తులను దర్శించి పూజించి నుతించి చక్కారావడమున్నూ, అలవాటైంది. శెట్టిగారు ఈవిధంగా మళ్లా ఇల్లుచేరేటప్పటికి నాల్గు అయిదు గడియల ప్రొద్దు అవుతుంది. అంతట తనవ్యాపారాలు అన్నీచూసుకుంటూ మధ్యాహ్నకాలానికి వచ్చిన అతిథీఅభ్యాగతీ మొదలయినవారికి పరిచర్యలు చేసుకొంటూ, కాలం గడుపుతూ వుంటాడు. ప్రతీనిత్యం ఇల్లా జరగడం వల్ల అతనిమనస్సుకు అనిర్వచనీయమైన ఆనందమున్నూ కలుగుతున్నది. గుట్టుచట్టంగా దాంభికాలూ ధర్మాసనాలూ లేకుండా, యథాశక్తి దైవారాధనా మొదలయినవి కూడా సంభవిస్తున్నవి. ఇఖ అతనికి కావలసినదేం వుంటుందీ?

ఎంతగోప్యంగా సంచరిస్తూ వున్నా, లోకంలో ప్రతివాడి చర్యలూ ఎవరోఒ కరు కనిపెట్టేవుంటారు. దానివల్ల లాభంవున్నా, అసలా లేకపోయినా 'ఎక్కడికి పోతాడు? ఎందుకుపోతాడు? ఏంచేస్తాడూ?' — అనే సందేహాలు అల్లాంటివారిని పిశాచాల్లాగ బాధిస్తుంటాయి. కాబట్టే వాళ్లు ఆవేశం పట్టినవాళ్లలాగ, తమజిజ్ఞాస ఏదో రకంగా తేలేదాకా వదలిపెట్టరు. ఇది లోకులకు సహజం.

ఈవిధంగానే జినదత్తుడియింట్లో సోమదత్తుడని వక నౌకరు వుండేవాడు. సోమదత్తుడంటే జినదత్తుడికి చాలా అభిమానం. కారణమేమంటే — వకమాఱు మామూలుగా శ్మశానంలో కాయోత్సర్గం చేద్దామని వెళ్లినప్పుడు, అక్కడ దిక్కులేకుండా పారవేయబడి, యింకా కండ్లైనా తెరవని పిల్లాడి యేడ్పు వినబడ్డది. వెంటనే ఇతడా పిల్లవాణ్ణి తెచ్చి పెంచి తనయింట్లోనే నౌకరుగా వుంచుకోని పోషిస్తున్నాడు. అది మొదలుకొని ఆకారణం వల్ల - అంటేదిక్కులేనివాణ్ణి తాను పెంచడంవల్ల - అతడికి సోమదత్తుడంటే చాలా అభిమానం. తాను నిత్యకృత్యాల్లో వ్యాపారకార్యాలు నిర్వహిస్తున్న వేళలలో ఆపిల్లవాడు సర్వదా చేతిక్రింద హాజరుంటాడు. వాడికి తెలియకుండా, మఱి ఏపనులున్నా జినదత్తుడింట్లో జరగవు. కాని తెలియనిదల్లా ఇది వక్కటే.

సోమదత్తుడు-ఆలోచించా డాలోచించాడు-ఎన్నాళ్లో ఆలోచించాడు. ఏమీ తేలలేదు. అంతకంతకూ సంశయం ఎక్కువైంది. ఎన్నివిధాల పొంచినా, ఎన్నివిధాల అన్వేషించినా, ఎన్నిపనులు చేసినా, అంతుపట్టలేదు. క్రమంగా రాత్రింబగళ్లూ సర్వకాలసర్వావస్థలలోనూ "శెట్టిగారు యెక్కడికి వెడతాడూ? ఏంపనీ? ఎందుకుగాను ఇంతరాత్రిలో వెడతాడూ? ఎల్లావెడతాడూ? ఎక్కడినుంచి వస్తాడూ? ఆకాశంలోంచి వూడిపడ్డమోస్తరుగా ఇంతవేగంగా వెళ్ళడం యేమిటని రావడమేమిటని?" - అనేసందేహాలు అతడికి పిచ్చిఎత్తినట్టు చేసినాయి.

చివఱకు వకనాడు ఏం చేశాడంటే, 'ఇక మనం ఇతన్ని పట్టుకోలేము. కాబట్టి స్వయంగానే అడుగుదాం' మనుకున్నాడు. అట్లాగే సిద్ధాంతం చేసికొని వకనాడు శ్రేష్ఠిగారు వంటరిగా కూర్చున్నప్పుడు, దగ్గఱికి వెళ్లి నిలవబడ్డాడు. అయితే సోమదత్తుడిల్లా అప్పుడప్పుడూ జినదత్తుణ్ణి సమీపించడమున్నా అలవాటే. ఆయనకూడా చిఱునవ్వుతో ఏంకావాలెనో కనుక్కొని వాణ్ణి సమాధానపెట్టడమున్నా అలవాటే. కాబట్టి జినదత్తుడు అడిగాడు- 'ఆఁ చెప్పు. ఏంకావాలె?'

సోమదత్తుడు తనకేమీ అక్కఱలేదని జవాబు చెప్పాడు. అతనిముఖంలో మాత్రం ఏదోకావాలనే కన్పడింది. జినదత్తుడిల్లా రెండుమూడుమార్లు అడగడమున్నా అతడు అక్కఱలే దనడం అయింది. చివఱకు విసుగెత్తి శెట్టి అన్నాడుగదా 'మఱి ఏమీ లేకపోతే, ఎందుకు, నిలబడ్డావూ?' అని. ఈమాఱుమాత్రం ఎందుకో స్వరం మాఱింది. సోమదత్తుడు నేలజూస్తూ ఆరంభించాడు- 'ఏం లేదండీ. మఱీ...మీరూ...

దినమూ... వెళ్లతారే, తెల్లవారేసరికి అనిగంటసేపటికి వాక్యం ముగించాడు. జిన దత్తుడికి అతని అవస్థచూడంతోనే జాలిగల్గింది, అయినా ఆజాలిని అణచుకొని-బిగ్గర గా ఏం వెళ్లితే? వెళ్ళకూడదూ? అన్నాడు.

కంపితస్వరంతో-లేదండీ. నేనామాట అనలేదు. తెలుసుకుందా మని అడిగాను. మీరు తలుచు ఎక్కడికి వెళ్లరు. ఇన్నాళ్లనుండీ చూస్తున్నానుగాదా! ఏదో విశేషం లేంది. కాబట్టి నన్నుకూ...అని దిక్కుమొగంతో జినదత్తుడివైపు చూచాడు సోమద త్తుడు. శెట్టిమనస్సు చివుక్కు మన్నది. అంతట ఆయన అతణ్ణి దగ్గర కూర్చుండ బెట్టు కొని, మొదటినుండి తనకు కాయోత్సర్గంచేసే అభ్యాసము మొదలుకొని, ఆకాశగమనం లభించినంతదాకా, సంగతిసందర్భాలన్నీ చెప్పాడు, చిట్టచివరకు శెట్టిగా రన్నారు గదా -"నాయనా!సోమదత్తా! నావిషయం విన్నావుగదా! నీసందేహాలన్నీ తీరిపోయా యని తలుస్తాను. ఇంతేనా!-ఇంకేమైనా కావలెనా?" అని.

సోమదత్తుడిమనస్సుకు పూరట చిక్కింది. కాని-అఆకాశగమనవిద్య తనకు గూడా లభిస్తే తానుకూడా రెండోకంటికి తెలియకుండా, ఎక్కడికంటే అక్కడికి వెళ్లవచ్చుగదా అనిపించింది. సరే ఇంక ఆలస్య మే ముందీ? ఈకోరికి కూడా జినదత్తుడికి తెల్పాడు. జినదత్తుడు—కానీ లే. అలోచించి చెబుతా నన్నాడు "ఆలో చనం ఏమిటండీ బాబయ్యా! నన్ను కడుపునబుట్టిన పిల్లడికిమల్లేనే ఆదరించారు. పెంచి పోషించారు. అట్టిస్థితిలో నాకు ఈశ్రేయస్సును గలిగిస్తే నేనున్నూ మీయాశ్రయం వల్ల భగవత్సేవచేసి తరిస్తాను."-అన్నాడు సోమదత్తుడు. జినదత్తుడు సరే నని మంత్రో పదేశం చేశాడు. ఆనాడుమొదలుకొని మహానియమంగా అమంత్రాన్ని జపించాడు సోమదత్తుడు. మంత్రజపం చేయవలసిన సంఖ్య అంతా నెరవేరింది. పిమ్మట సిద్ధికై ఉత్సర్గం (జైనమతంలో పురశ్చరణ అన్నమాట. పురశ్చరణ అంటే ఏదైనా జపంచేసి దానిసిద్ధికై చివరహోమాదులు చేయడం-ఆర్యులలో ఇల్లా చేయటానికి పురశ్చరణ అనీ జైనుల్లో ఉత్సర్గమనీ పేరు.) చెయ్యడంమాత్రం తరవాయి.

ఇట్లా వుండగా కృష్ణచతుర్దశీదినం వచ్చింది. ఆరోజుకు ముందే ఆరురోజుల నుండీ జినదత్తుడు చెప్పిననియమాలని జరుపుతూ సోమదత్తుడు ఉత్సర్గం చెయ్యాలసిన విధానాన్ని నెరవేరుస్తున్నాడు. ఇక చివరరోజు చతుర్దశి. అదికూడా తటస్థపడి సగం దాదాపు వెళ్లిపోవస్తున్నది. అంటే పగలంతా గడిచిపోయింది. సాయంకాలం కావడం తోటే జినదత్తుడు ఏచెట్టుదగ్గర సిద్ధిని పొందగల్గాడో, అమఱ్ఱిచెట్టుక్రిందనే వూడలూ వుట్టూ బాగా వున్నకొమ్మక్రింద, నేలను బాగా అలికాడు. రంగురంగుల ముగ్గులన్నీ పెట్టాడు. పూజాదులన్నీ సాంగంగా సక్రమంగా జరిపాడు. తళతళలాడే బాకులు సందులేకుండా కొనలు పైకివుండేటట్టు అచ్చట పాతిపెట్టాడు. ఇక చెయ్యవలసిం దేమి టంటే చెట్టెక్కి-సరిగ్గా అకొమ్మమీదకువచ్చి కూర్చొని తలక్రిందుగా అకత్తులమీద పడి. ప్రాణాని వదులుకోవాలసిందమాత్రం వున్నది. ఇది వక్కటే తరవాయి.

సరి. సోమదత్తుడు అందుకుగూడా సిద్ధపడ్డాడు. ఆకాశగమనవిద్యమీద వుండే ఆసక్తి అతణ్ణి తొలగనియ్యడం లేదు. కాబట్టి ఇక ఆలస్యం ఎందుకనుకొని గబగబా మఱ్ఱిచెట్టుఎక్కి చిట్టచివటికొమ్మకు పాకిపోయ్యాడు. ఏస్థలంలోనుంచి తాను తలక్రిందుగా పడితే కత్తులమీద పడతాడో, ఇదివఱకే గుఱిచూసికొని వెళ్లాడు కాబట్టి సంశయం లేకుండా సరిగ్గా ఆకొమ్మమీదికి వచ్చాడు. ఇఖ తలక్రిందుగా దూకడానికి ముందు వకసారి క్రిందచూతా మనుకున్నాడు. అదేవిధంగా ఆకొమ్మమీద కూర్చొని క్రిందజూచేసరికి -అమ్మయ్యో! వళ్లు కంపరమెత్తింది. ఎఱ్ఱగా ఆసుంటుమా-అపూవులూ-ఆఅక్షతలూ- ఆదీపాలూ- అతన్నిఒక్కమారు ఇట్టుట్టు చేశాయి. ఈదెబ్బతో అతని మనస్సులో ఆందోళనం ఆరంభమైంది.

ఆందోళనం ఏమిటి? అది ఆందోళనమా? తుపానే. శతకోటి జన్మాలెత్తినా దొరకని మనుష్యజన్మాన్ని- 'ఏతి జీవంత మానందో నరం వర్షశతా దపి' అనిప్రశంసించిన మనుష్యజన్మాన్ని-సుఖంగా-ఇతరుల వత్తిడిలేకుండా గడుస్తూవున్న ఆనందమయమైనజీవితాన్ని- ఒకనిమిషంలో- ఏమో మంత్రసిద్ధి అనేది ఉంటుందో వుండదో,- ఎవరుచూశారూ? కాబట్టి-ఇట్లాంటి పవిత్రమైనా ప్రేమాస్పదమైన జీవితాన్ని- ఏదోవిచ్చి ఆకాశగమనవిద్య లభిస్తుందనే వూహతో - ఎల్లా వ్యర్థం చెయ్యనా?-అని సందేహం ఆరంభించి, మెల్లమెల్లగా-అట్టే విజృంభించి- అట్టేవిజృంభించి, అనేకయుక్తి ప్రత్యుక్తులతో- అనేకపూర్వపక్షరాద్ధాంతాలతో- అనేకసంకల్ప వికల్పాలతో-మహోద్దండంగా - ఉఱూరిత లూపసాగింది. ఈమహావాయుపథంలో పాపం సోమదత్తుడిమాటకేం గాని, మహామహా ధీరుల మని చెప్పుకొనేపెద్దలకే బుద్ధి పెడతల బడుతూ ఉంటుంది. ఇక అనాథ- సోమదత్తుడు చలించాడంటే ఆశ్చర్యమేమున్నదీ? చివఱకు ఇట్లా రాద్ధాంతాలు చేసికొని 'ఏమైనా సరే. బంగారంలాంటిప్రాణాన్ని బండలు చేసికోవడంకంటే, బుద్ధిహీనమైన పని ఇంకొకటి వుంటుందా? కాబట్టి జినదత్తుడి మాట నమ్మి జీవాన్ని పోగొట్టుకో కూడదు"- అని నిశ్చయం చేసికొన్నాడు. ఇఖ ఆలస్యమేముందీ? వెంటనే చెట్టుదిగి వచ్చాడు.

దిగి రాగానే మఱల అతనికి ఆలోచనం గల్గింది. "ఏమిరా ఇదీ? ఇంతకంటే తెలివితక్కువ ఏ ముంటుందీ? అయ్యయ్యో! ఎన్నాళ్లో కష్టపడ్డాను. ఎన్నాళ్ళో ఉపవాసాలు చేసి కృశించి, తీరా సిద్ధికాబోయ్యేటప్పటికి ఇంత పిరికితనం వచ్చిందే? ఏంచెయ్యనూ? ఫలం సందేహాస్పద మనికదా నేను దిగివచ్చాను. నిజమే అనుకుందామా? వెధవజీవితం. ఇదిమాత్రం స్థిరంగా వుంటుందని నమ్మకం ఏమి? ఇక్కడనుండి నూటికిగా ఇంటికి చేరతామన్న పూచీ యేంవుందీ? ఏదో మంచి అవకాశం దొరికింది. శ్రేయస్సులను చెప్పేవాళ్లు నిజంగా లభిస్తారా? ఏమో అమాయికుడున్నూ ఆదరం గలవాడున్నూ కాబట్టే జినదత్తుడు నాకు చెప్పాడు. పోనీ సిద్ధివిషయంలో సందేహమా? —అంటే

నాకండ్లయెదట రోజూ అతడు వెళ్లి వస్తున్నాడు గాడా? ఆయా దివ్యక్షేత్రాలనుండీ పూలూ బుక్కాయీ తెల్లవారేసరికి ప్రత్యక్షంగా- ప్రసాదమని తెస్తున్నాడే. ఇల్లాంటివిషయం అసత్యమని తోసెయ్యడమెల్లాగా? ఛీ. వెధవమనస్సు. కొస్తసందు దొరికితే దిగదీస్తుంది. జినదత్తుడంతవాడికి శిష్యుణ్ణై ఈమాత్రం సాధింపలేకపోతే, ఇఖ నాప్రయోజకత్వం ఏమిటి?''- అని అంటూ, మళ్లా రెట్టింపుఉత్సాహంతో గబగబ చెట్టెక్కి- యథాస్థానానికి వెళ్లికూచున్నాడు.

కూచోని క్రిందికి చూసేప్పటికి, మళ్లా యథాప్రకారమే. ఆధైర్యం శరత్కాలపు మబ్బులాగా వీడిపోయింది. కృతఘ్నుడికి చేసిన వుపకారంమల్లే పట్టుదలకూస్తా భగ్నమై నామరూపాలు లేకుండావెళ్ళింది. మఱల యథాప్రకారంగా విచికిత్స—అంటే దూకుదామా వద్దా అనిఆలోచన-ఆరంభం.''ఏమో దూకితే ఇంతా సిద్ధి కాకపోతేనో- అనేసందేహం, జినదత్తుడైతేమాత్రమేం వంచించేనిమిత్తం చెప్పకూడదా ? ఎవరినని నమ్మడానికి వీలూ? అంథా కలికాలంగదా. ఎవడితిప్పలు వాడివి. పైకి శ్రీరంగనీతులు చేప్పేవారేగాని చెయిజారితే దిద్దేవా రున్నారా? కాబట్టి జినదత్తుడైనా వాళ్లతాత (మాటవరుసకు) ఇంకో ఘనదత్తుడైనా, నమ్మికఎట్లా?...ఏమైనా కానీ ఈపని ఎంతమాత్రం యుక్తంకాదు.''—అని అనుకోడంతో అది పూర్తిఅయింది. వెంటనే ఇదేం పనీ?...అనుకోని చకచకా చెట్టు దిగి వచ్చాడు.

''బాగున్నది! కష్టపడంది ఫలం వస్తుందా? ఏదో పండుతుందనే ఆశపెట్టుకోని దున్ని చక్కఁబఱచి వెదజల్లి నానాతంటాలూ పడితే ఫలం గల్గుతుందిగాని, నోట్లో వేలుపెట్టుకోని దొంతెమ్మలాగ్గా కూచుంటే, ఫలం గల్గుతుందా? చివఱకు అన్నమైనా బియ్యం కడిగీ పొయ్యిమీదపెట్టి మంటవేస్తే ఉడుకుతుందిగాని, 'ఏమో ఆలోచన చెప్పారు. ఇంతా కష్టాలూ వృథా అయిపోయి, బియ్యమూ చెడిపోయి, అన్నమూ లభించకపోతే ఏంజెయ్యనూ?'' అనుకోని కూచుంటే, ఉపాయంచెప్పినవాళ్లందర్నీ ఊరూవుహం ఎత్తిపొయ్యేట్టు తిడితే, అన్నం దొరుకుతుందా?కనుకా యత్నం చెయ్యాలి. పైని ఫలసిద్ధి చూడాలె'- అని అతనిమనస్సు మళ్లా పురబెట్టింది ?

వెంటనే మళ్లా జినదత్తుడు చెట్టెక్కాడు. 'ఎంతవెఱ్ఱాడివోయి. ఈమాత్రం ఆలోచనలేకుండా ప్రాణాలు భారవోస్తావా? ఆత్మహత్య చేసినోని శాశ్వతంగా అంధకూపాలల్లో పడతావా?''-అనే భావం మహాప్రచండవేగంతో ఆర్భాటంగా వచ్చి ఫెళీమని కొట్టుకొన్నది. సోమదత్తుడు-మళ్లా చెట్టుదిగి వచ్చాడు. క్రిందికి రావడంతోటే మళ్లా- ఆశాకిరణాలూ, పైకెక్కడంతోటే- నిరాశామేఘాలూ-కమ్ముకొంటున్నాయి. ఈవిధంగా సోమదత్తుడు ఆతరంగాల్లో ఒకబాఱి ఒడ్డుకూ- పదిబారలు లోతుకూ- కొట్టుకోపోతూ, తంటాలుపడుతున్నాడు. అంతు తేనేలేదు. ఇఖ ఈసంగతి కొస్తసేపు నిలిపిపెట్టి, దీనికి అతుకు పెట్టేందుకై, ఇంకొకకథ ఆరంభించాలె. ఇది ఆరం

భిస్తేనే కాని సోమదత్తుడి సోదె పూర్తి కానేకాదు. కొబట్టి అవాంతరకథను పోక తప్పదు. కొని, ఒకవిధంగా చూస్తే ఇంతవఱకూ చెప్పిన సోమదత్తుడికథే అవాంతర కథ. అసలుకథె అంజనచోరుడిది. కాబట్టి ఇదే ముఖ్యమని కూడా తేలుతుంది.

అంజనచోరుడి అసలుపేరు నిర్వాణాంజనుడు. అతని తల్లిదండ్రులుకూడా మంచి కులశీలాదులూ చదువుసంధ్యలూ కలవారే. ఇంత పరువూ మర్యాదాగా బ్రది కిన బ్రాహ్మణకుటుంబం వారే. అయితే మాత్రం లాభమేమి ? నిర్వాణాంజనుడు చార్యం చేయడంలో బిరుదం సంపాదించి కాలికి అందెవేసుకొన్నవాడు. చిన్నప్పుడు తల్లీదండ్రీ ఇతణ్ణి మహామహోపాధ్యాయుణ్ణి చెయ్యాలెనని చేసినసంకల్పం చెట్టుమట్టం అయిపోయినా, ఏదో స్వసామర్థ్యంవల్ల కర్ణీసుతసూత్రాలకు వ్యాఖ్యానం రాయదగి నంతటి వార్తికకారు డయ్యాడు.

ఏవిద్యలో అయితేమాత్రమేం ప్రత్యేకప్రావీణ్యం సంపాదించే నేర్పు వుంటే సరి. పేరూప్రఖ్యాతులూ వాటంతటవి వెదుక్కొని వస్తవి. అంజనచోరుడు చోరశాస్త్రా న్ని అంగప్రత్యంగసహితంగా బోధించి సమకాలంలో తనలాంటి శిష్యులను సహస్రా లకొద్దీ తయ్యారు చేసినవాడు. ఆకాలంలో అతడు పరిశీలించని రాష్ట్రం లేదు. బంది పోటుగొట్టని ప్రభువులు లేరు. అతడు వాసంచేయని కారాగారం లేదు. నోరెఱుగని పోరుపెట్టే పిల్లకైనా సరే 'అంజనచోరు' డంటే హడలు.

కాని అసల్లో అంజనచోరుడు చాలా దయాళువు. పూర్ళుదోచినా- ఖజనాలు కొల్లగొట్టినా- దార్లుకాచినా, రాజకీవి. కూడా వేలకొద్దీ పరిచారకులూ స్తోత్రపాఠకు లూ-కథలూ కాలక్షేపాలూ చెప్పేవాళ్లూ - దానాలు ధర్మాలు - ఓ!- లెక్కలేనన్ని హడావుళ్లూ, తదంగం వాడికున్నాయి. రాజశాసనం వాణ్ణి చూచినవెంటనే తలనరికి వెయ్యమని వున్నా- లక్షపతులు [లక్షాధిపతు లన్నమాట] అతడంటె కంఠంవఱకు అసూ యవున్నా-పాలకులకు వాడంటే భగ్గుమన్నా-అతడు ఎదట బడ్డాడంటే కుక్కినపేలు.

ఇట్లాంటిస్థితిలో మగధదేశంలో అతడిఆజ్ఞ బండ్లమీద పరుగెత్తుతుంటుంది. అంజనచోరుడు ఇంత ప్రసిద్ధిగాంచినా, అతని నిజరూపం లోకులకు తెలియదు. ఇఖ అతని వునికి అసలే తెలియదు. ఏమంటారా? అతడు విశ్వరూపి. ఒక్కక్షణంలోవున్న రూపమూ- గుణమూ- వునికీ- వేషమూ- ఇంకోక్షణంలో వుండవు. ఈక్షణంలో మగ ధదేశంలోహాజరైతే-ఉత్తరక్షణంలో ఓఢ్రదేశంలో కుశలం. ఎక్కడబడితే అక్కడ అంజనచోరుడు క్షణంలో అవతరిస్తాడు. ఎంతలోబడితే అంతలో అంతర్ధానం అవుతా డు. రెండో విశ్వరూపసందర్శనమే. ఇఖ వేరే మాట లేనేలేదు.

స్థితి ఇట్లా వుంటుండగా సోమదత్తుడు ఆకాశగమనసిద్ధికై ప్రయత్నం చేసినా్న టిరాత్రి, అంజనచోరుడు మహాఖులాసాతో, తా నుంచుకొన్న సానియింటికి సరసా నికి వెళ్ళివున్నాడు. ఆసమయంలో అంజనసుందరి (అంటే - అంజనచోరుడిసాని)

అన్నదిగదా—"ఏం? నీవు ఎంతచాతుర్యం గలవాడివైతే ఏం? ఎంత సంపాదించేవాడవైతే నేం?"

అంజనచోరుడంతట ఆమెను అనునయించడం ఆరంభించాడు. సుందరి కొంతసేపు బెట్టుచేసి చివరకు మహారాణీకనకాంబిక మెడలో వున్న హారం కావాలెనన్నది. ఎప్పుడు చూచావు. నీవని అంజను డడిగాడు. 'ఇవాళ్ళే. జినమందిరానికి ఆమెవచ్చింది. చూచా' నన్నాది ఆమె. 'ఓసి, దీనికేం భాగ్యం, తెస్తా నుండు' అని అంటూనే కత్తి దూసికొని రాజప్రాసాదంవైపు వెళ్ళిపోయాడు. అంజనచోరుడు సరాసరి అంతఃపురంలోకి ఎట్లాదూరాడో దూరాడు. రాజున్నూ రాణిన్నీ నిద్రిస్తున్నారు. వెంటనే రాణిమెళ్ళో వున్న రత్నహారం తెంచాడు. రాజు వులిక్కిపడి లేచి అంజనచోరుణ్ణి చూశాడు. కత్తిదూసికొని పైకి దూకాడు. అంజనచోరుడు ఫకాలు మని నవ్వి—ఏం? ప్రాణాలమీద ఆశ వుందా? లేదా? అంజనచోరుడిపైకి కత్తిదూసినమగాడు ఇంతవరకూ ఎవ్వడూ లేడు. అంటూ కత్తిజళిపించాడు. రాజగారు కలతతో ఒకనిమిషం తటపటాయించాడు. ఈలోపల ఆరంతస్థుల ప్రహరీగోడా అమాంతంగా దాటాడు అంజనచోరుడు. రాజు వెంబడించి అతనివెంట అమాంతంగా దూకుతూ అంజనచోరుడని కేకవేశాడు. పరాకునిద్దరలో వున్నపహరావాళ్లంతా లేచారు. నిమిషంలో పట్నంలో నాల్గుమూలలా రక్షకభటులు సిద్ధపడ్డారు. అందులో కొందరు రాజుగారినీ వెనుకకుపంపి మహాసాహసంతో అతన్ని వెంబడించారు.

వక్కక్షణం ఆగి, అంజనచోరుడు ఆలోచించాడు. ఆవేళ అతనిఅదృష్టం అడ్డంగా తిర్గినట్టు కనపడింది. ఇక ఏ వేపువెళ్లినా—ఏసందుదూరినా—తప్పించుకొనే మార్గం తోచనేలేదు. ఇంతటి మహాభాష్యకర్తకుకూడా ఆరాత్రి ప్రత్యుపాయం తట్టిందికాదు. అంతట ఆతనేంచేశాడంటే, 'ఎటూ ఇకప్రయోజనం లేదు. వచ్చినంతవరకుం కాలికి బుద్ధిచెప్పడం యుక్తంగా వుంది' అనుకొని అగర్తగోడను ఒక్కచెంగలింతతో ఎక్కిపోయ్యాడు. అప్పటికప్పుడే అక్కడకూడా కావలివాళ్లు తనకై కాచుకొనివుండటం జూచి ఎక్కసగ్గంగా 'ఓరీపెద్దమ్మలారా;—వీడుగోరా! అంజనచోరుడూ. పారిపోతున్నాడురా!'—అంటూ బ్రహ్మాండమైన ఆఅగర్తలో దూకాడు. వెంటనే కావలివాళ్లు గూడా దూకారు. నిమిషంలో ఆఅగర్తఅంతా జనమయమై పోయింది. అయితే ఏంగనక? అంజనచోరుడు మహాప్రయాసతో ఒడ్డెక్కాడు. ఇంతలో రాజుగారి ఆజ్ఞచొప్పున కులాధికారి చాలావరకు కావలివారికి అపాయం లేకుండా డోంగీలువేసి దాటించాడు: అంజనచోరుడు ఒడ్డు ఎక్కేసరికి గుక్కతిప్పుకోకుండా వాళ్లూ సిద్ధపడ్డారు.

అంతట అంజనచోరుడు వక యుక్తి చేశాడు. తాను అడవిదారిని పట్టివెళ్ళినట్టు కొంతదూరం పరిగెత్తి అక్కడ నక్కాడు. రాజభటులుకూడా వదలకుండా అడవిదారిని పడ్డారు. అంజనచోరుడు పదినిమిషాలాగి అలుపుతీర్చుకొని వెనుదిరిగి శ్మశానంవంకకు పరిగెత్తాడు. ఈకొద్ది అవకాశంలో అతిశీఘ్రంగా శ్మశానాన్ని చేరాడు

ఆకాశవిదారికి పరుగెత్తిన కావలిగుంపు అంజనచోరుడి అడాపొడా గానక వెనక్కి మళ్లీ శ్మశానంవైపు మళ్లారు. శ్మశానంలో ఏదోదూరాన దీపాల్లో ఒకరో ఇద్దరో మనుష్యులూ లీలగా కనుపించారు. అంతట వాడే అంజనచోరుడయ్యుంటాడన్న ఆశతో నోట చొంగలు బడ పరుగెత్తి వస్తున్నారు.

రాజభటులబారినుండి తప్పించుకొనినా డన్నమాటేకాని, మతి స్థిమితం ఎక్కడా? ఒకవైపువాళ్ళు మళ్ళా తన్ను వెంటాడి వస్తూండటాన్ని గమనించాడు. కాని ఆచెట్టుక్రింద సోమదత్తుణ్ణిచూసి ఈయేడ్పు యేమిటని ఆతన్ని అడిగాడు. సోమదత్తుడు మొదటినుంచి జరిగింది చెప్పాడు. అంతట అంజనచోరుడు 'తాను ఎలాగూచస్తానుగదా. ఈమూలంగా చస్తే మంచి దనుకొన్నాడు. గభీలు మని నిమిషంలో చెట్టెక్కి తల్లక్రిందుగా దూకాడు. తల వెయ్యిచెక్కలుగా చీలిపోయింది. ఆకాశగమనవిద్యాదేవి ప్రత్యక్షమై ఏం కావాలెన్నది, 'నాకేమీ వద్దు. ఈసోమదత్తుడికి నీవిద్యను అనుగ్రహించమని వేడాడు. దేవి ప్రసన్నురాలై వాళ్ళిద్దరికీ ఆవిద్యను అనుగ్రహించింది. ఇంతలో కావలితురుష్ దిగింది. అంజనచోరుడూ సోమదత్తుడూ బుఱ్ఱుమంటూ పైకి ఎగిరారు. రాజభటులు నిరాశులై వెళ్ళిపోయారు.

తర్వాత అంజనచోరుడు సోమదత్తుణ్ణి వెంటపెట్టుకొని జినదత్తుడింటికి వెళ్ళాడు ఆవిద్యతోనే. అప్పుడే తొలికోడి కూసింది. జినదత్తుడు తీర్థయాత్రకై బయలుదేరుతున్నాడు. గడపలోనే వీరిద్దర్నీ కలుసుకొని సంగతంతా విన్నాడు. పిమ్మట మామూలుగా తీర్థస్నానాలనూ దివ్యక్షేత్రదర్శనాలనూ చేసికొంటూ ముగ్గురూ జినదత్తుడి ఇల్లు చేరారు. జినదత్తుడు వారిద్దరికీ సదుపదేశం చేసి, ఇటు పైని సత్క్రియాత్నాలూ సత్కార్యాలూ చేయవలసిం దని అంజనచోరుణ్ణి ప్రార్థించాడు.

అంజనచోరుడు సరే అని ఆదిమొదలుకొని జైనదీక్షగ్రహించి మునియైనాడు. రాజుగారిరత్నహారం మఱల చేర్చాడు. వెనుకటిదుర్వృత్తులను వదలి ఇప్పుడు లోకానికల్లా ఆదర్శపురుషుడై అనంతసిద్ధుల నార్జించాడు అంజనచోరుడు. ఈయంజనచోరుణ్ణి గుఱించే నేమిదత్తకవి ఇల్లా ప్రశస్తిని రాశాడు:—

శ్లో. పరోపకారిణా తేన జినదత్తేనధీమతా, చారణస్యమునేః పార్శ్వే
జైనీం దీక్షాం శివప్రదాం. గ్రాహిత స్త్వంజన స్సోపి తాముచ్చైః ప్రతిపాలయన్, క్రమా త్కైలాస మారూఢో లోకాలోక
ప్రకాశకమ్. శేషకర్మక్షయం కృత్వాప్రాప్తవాన్ మోక్షమక్షయమ్

అంజనచోరుడికథ ముగిసినది.

చెన్నపురి. పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి.

# శాతవాహనవంశీయుల శాసనములు.

భావరాజు వేంకటకృష్ణరావు.

శాత లేక సాతవాహనుల శాసనములలో చాలాభాగము, బొంబాయిరాజధానియందున్న కార్లి, నాసికగుహాలందు గాన్పించెను. మిగిలినవి కొన్ని ఆంధ్రదేశమున అమరావతి, కొండవోలు మున్నగుతావులందును లభించెను. వీటినన్నిటిని ఆంధ్రులచరిత్ర సమూలముగా చదువవలచుకొన్న విద్యార్థులకు ఆంధ్రభాషలో చేతికందివచ్చుటకై నొక్కచోట సంపాదించి ప్రకటింపదలచితిని. ఈ శాసనముల పఠనమువలన ఆవంశీయుల చారిత్రమేగాక, వారికాలపునాటి ఆర్థిక, రాజకీయ, సాంఘిక ధర్మపరిస్థితులు మున్నగునవి కూడ తెలియబడగలవు. ఆంధ్రులచరిత్ర మనకు మొదట ఆంధ్రజాతీయు లగు శాతవాహనుల చరిత్రతో ప్రారంభమగుచున్నది. శాతవాహను లాంధ్రజాతివారాయను సంశయము నివర్తితముగాని యీదినములలో - "శాలివాహన-శక-వర్షము.*"న కాదిపురుషుడెవ్వడో నిశ్చితముగాని యీదినములలో-చరిత్రాన్వేషణమందు పూర్ణోత్సాహము గల ప్రతివ్యక్తియు చరిత్రాధారము లగు నీశాసనములను చక్కగా పరిశీలించి సందేహములను బాపుకొనవచ్చును.

ఇంతవరకు ఆంధ్రదేశములో శాతవాహనుల శాసనములు విరివిగా లభించలేదు. ఈవంశీయులలో మొదటివారి శాసనములు ఇంచుమించుగా అన్నియు పశ్చిమదేశములందే లభించియుండెను. అందువలన శాతవాహను లాంధ్రులుకారని వాదము చెలరేగెను. కాని యీవాదము సిద్ధాంతము కాలేదు. మనదేశమందు ఇంకను శాలివాహనుల శాసనములు దొరకగల వనునాశ కలదు. చరిత్రపరిశోధనకై సాయ

---

* శాలివాహనునకును శకశబ్దమునకు ముడివెట్టి శాలివాహన శకవర్షము లనుట యీనాటిసంప్రదాయము. పూర్వశాసనములందు శకాబ్దము అనియే గలదు. శాలివాహనశకాబ్దము అని కానరాదు.

పడుచున్న ప్రభుత్వపువారి ఆర్కియాలాజికలు డిపార్టుమెంటువారు దేశమంతటను చుట్టుపెట్టి తిరిగినచో శాతవాహనుల శాసనములు విరివిగా లభించగలవని నా దృఢవిశ్వాసము. ఇంతకు ఆంధ్రదేశమును వారు శ్రద్ధగా పరీక్షించి యుండనేలేదు. ఈ యుపేక్షకుతోడు కృష్ణాజిల్లాయందలి భట్టిప్రోలు, బుద్ధవనిస్థూపములను నిర్మూలములు గావించి యింజనీరింగు శాఖవారు ఆనకట్టలు – లాకులు కళంగులు కట్టుటకు నచ్చటి స్థూపములందలి కట్టడములందలి చలువరాళ్ల నన్నింటిని పెల్లగించి సున్నము చేసుకొనుటకు కాల్చివేసిరి. ఆ రాళ్లమీద నేమైన యక్షరములుండెనేమో యామహాత్ములు చూచి జాగ్రత్తపెట్టి యుండలేదు. మన దురదృష్టవశమున పూర్వము మహాపట్టణములు నగరములుగా నుండినస్థలము లన్నియు నేడు పాడువారి దిబ్బలతో నిండియున్నవి. దేశమం దెక్కడెక్కడ చూచినను బౌద్ధకాలమునాటి–అనగా శాతవాహనుల రాజ్యకాలమునాటి– స్థూపములను సూచించు "లంజదిబ్బలు" అని పిలువబడుచున్న పెద్ద మట్టిదిబ్బలు గానవచ్చుచున్నవి. ఈ దిబ్బల నన్నింటిని ఆర్కియాలాజికలు శాఖవారు దేశమంతా తిరిగి అన్వేషించి త్రవ్వించినచో నూతనశాసనము లెన్నేని వెలికి రాగలవు.

ఇంతవరకు లభించిన శాసనములను తెలుగున ప్రకటింపవలసినదని, నామిత్రులు శ్రీయుత కోలవెన్ను రామకోటీశ్వర రావుగారు నన్ను పురికొల్పిరి. వారి యాదేశానుసారము ఈ ప్రయత్నమును సంకల్పించితిని. ప్రాకృతమందున్న శాతవాహనుల శాసనముల నాంధ్రమునందు ప్రకటించుట కిదియే ప్రథమప్రయత్నము. ఈ శాసనములలో నొక్క శాతవాహనులవేగాక వారి సమకాలీనరాజుల శాసనములు కూడ చేర్పదలచితిని. వాటి పఠనము ఆంధ్రదేశచరిత్రమున కావశ్యకమని నా నమ్మకము.

ప్రస్తుతము ప్రకటింపబూనుకొన్నవి నాసిక, కార్లిగుహాలలో చెక్కబడినవి. వీటివెనుక అమరావతి మొదలయిన ఆంధ్రదేశస్థములయిన తావులందు లభించినవాటిని ప్రచురింతును. ముందు నాసికగుహాలందలి శాసనముల నెత్తుకొందును. నాసిక కార్లిగుహాల వర్ణనలకై చదువరి యింగ్లీషుభాషలలో బర్గెసు పెర్గసను పండితులు రచించిన

"రాక్‌కట్ టెంపిల్స్ ఆఫ్ ఇండియా" అను గ్రంథమును, బొంబాయి రాజధానియం దున్న వెస్టరన్ ఇండియా ఆర్కియోలాజికల్ శాఖవారి రిపోర్టులలో నాల్గవ సంపుటమును చూచుకొనవచ్చును. మొదట నీ శాసనముల నన్నింటిని రాయల్ ఏషియాటిక్ సొసైటీవారి బొంబాయి బ్రాంచివారు తమ పత్రికలో (జర్నలు) ఏడవసంపుటము నందు ప్రకటించియుండిరి. ఈశాసనముల కర్థములు చెప్పి వ్యాఖ్యలు రచించి అందలి చరిత్రాంశములను లోకమునకు స్వర్గీయులయిన డాక్టరు రామకృష్ణగోపాల భండార్కరుగారు ౧౮౭౪ వ సంవత్సరమున "ట్రాన్‌సాక్షన్సు ఆఫ్ ది లండన్ కాంగ్రెసు" నందు వెల్లడించిరి. మరల వీటినన్నిటిని పరిశీలించి, బూలర్ పండితుని ఆంగ్లభాషాంతరీకరణములతో సంప్రతించి, పఠించి, దోషములను తనయెపిన కొలది సంస్కరించి, డాక్టరు భగవాన్‌లాల్ ఇంద్రాజిగారు చరిత్రాత్మకమైన వ్యాఖ్యను రచించి 'బొంబాయిగెజటీర్' నాలవసంపుటమున నాసికజిల్లాచరిత్రతో చేర్చి వ్రాసియుండిరి. ఈమూడింటిని పురస్కరించుకొని ఫ్రాంసు దేశీయుడును, ప్రాకృత సంస్కృతభాషాకోవిదుడును, మహాపండితుడు నగు సేనార్టుమనీషి తిరిగి చక్కగా పరిష్కరించి కీర్తిశేషులయిన డాక్టరు హుల్షుగారి కోరికపయిన 'ఎపిగ్రాఫియా ఇండికా' ఎనిమిదవ సంపుటమున బ్రచురించిరి. ఇట్లు ముమ్మారు సంస్కరింపబడిన మూలములబట్టి నేను వాటినిక్కడ సంపాదించితిని.

ఈ శాసనముల నిపుడు ప్రకటించుటలో-నాయుద్దేశము ననుసరించి-ప్రాకృతభాషామూలమును, అందులకుగల సంస్కృతఛాయను, సులభమైన ఆంధ్రీకరణమును ఇచ్చెదను. సంశయాస్పదములును, చర్చనీయములును అగు విషయములను, పదములను, పేళ్లను, వీలయినంత వరకు చర్చించి మతభేదములను వివరించి, నా యభిప్రాయము నిత్తును. పాఠకులు నా మతమునుపమాత్రము యథార్థమనిగాని, దోషరహితమని గాని, యూహింపకుందురుగాక. ఆంగ్లభాష రానివారికి నయితము వీలయినంతవరకు దోడ్పడుట కీప్రయత్నము తలపెట్టితిని కావున నిది యెంతవరకు సఫలీకృతమైనదో పాఠకులే నిర్ణయింప నర్హులు.

## నాసికగుహాలందలి శాసనములు.

౧

[ ఇది రెండవగుహయొక్క వసారా వెనుకగోడపై నున్నది. ]

మూలము.

సిధమ్. రాఙ్ఞో వాసిఠిపుతస సిరిపుళుమయిస సంవఛరె ఛఠె ౬ గింహా పఖె పచమె ౫ దివసె......

సంస్కృతము,

సిద్ధమ్! రాజ్ఞో వాసిష్ఠీపుత్రస్య శ్రీపుళుమాయిస్య సంవత్సరే షష్ఠే ౬ గ్రీష్మపక్షే పంచమే ౫ దివసే

ఆంధ్రీకరణము.

సిద్ధం[1] [స్వస్తి] వాసిష్ఠీపుత్రుడయిన శ్రీ పుళుమాయిరాజుయొక్క విజయ రాజ్య సంవత్సరములు ౬ గు గ్రీష్మఋతువున పంచమపక్షమున...దివసమున...[2]

సంగ్రహవ్యాఖ్య.

ఈశాసన మసంపూర్తిగ నున్నది. దీనిని ఎందుల కిట్లు విడిచిరో తెలియదు. దీని తరువాయి ఎక్కడనైన చెక్కబడినదేమో కూడ కాన్పించదు. తొలుత నిది సంపూర్తిగా చెక్కబడియుండె ననియు, నది కొంత కాలమునకు శిథిలమయి పోయియుండె నని

---

1 సిద్ధం అనుట విజయసూచకము. ఇది బౌద్ధ సంప్రదాయము. తరువాతకాలమున, అనగా బ్రాహ్మణధర్మ విజృంభణ కాలమున "స్వస్తి" యని వాడుకాచారమైనది. ఈ ప్రాకృతశాసనము లన్నిటిలోను 'సిద్ధమ్' అని శాసన మారంభ మగుచున్నది. మన కీమాట ఓనమాలనాడే తెలియవచ్చెను. ఓం నమః......సిద్ధం నమః అని.

2 ఈ శాతవాహనుల శాసనము లన్నిటియందును విజయరాజ్యసంవత్సరమును ఋతువును పక్షమును దినమును చెప్పు సంప్రదాయము కనుపించును. ఆకాలమున దక్షిణాపథమున మాసముల పేరులు గాని, కలియుగాబ్దములు గాని మరి యేయితరయుగాబ్దములుగాని వాడుకలో నున్నట్లు కన్పట్టదు.

యు నూహించు కొనవలయును. ఈ శాసనమందు పేర్కొన బడిన పుళుమాయిరాజు గోతమిపుత్ర శాతవాహనుని కుమారుడు.

౨

[ ఈశాసనము మూడవగుహ ద్వారముపైన వసారాగోడకు వెనుకతట్టున ఉన్నది.]

మూలము.

౧. సిద్ధం ! రాఞో వాసిఠిపుతస సిరిపుళుమాయిస సవఛరె ఎకునవీసె ౧౯ గింహానపఖె బితీయె ౨ దివసె తెరసె ౧౩ రాజరాఞో గోతమీపుతస హిమవతమెరు

౨. మందరపవత సమసారస అసిక అసక ముళక సురఠ కుకురా పరంత అనుప విదభ ఆకరావతి రాజస విఝ ఛవత పారిచాత సహ్య కణ్హగిరి మచ సిరిటన మలయ మహింద

౩. సెటగిరి చకోర పవత పతిస సవరాజలోకమండలపతిగహీత సాసనస దివసకరకర విబోధిత కమలవిమలసదిసవదనస తిసముద తోయ పీతవాహనస పరి పుణ చదమడల ససిరీక

౪. పియదసనస వరవారణ వికమచారు వికమస భుజగపతి భోగ పీన వాల విపులదీఘ సుంద2భుజస అభయోదకదానకిలిననిభయ కరస అవిపనమాతు సుసూసాకరస సువిభత తివగ దెసకాలస

౫. పోర జన నివిసెస సమసుఖదుఖస ఖతియ దపమానమదనస సకయవనపల్హవ నిసూదనస ధమోపజిత కరవినియోగకరస కితాపరాధెపి సతుజనె అపాణహిసా రుచిస దిజావర కుటుంబ వివధ

పాఠభేదములు.—

1 అసిక సుసక అని కొన్నిచోట్ల పాఠమున్నది. కాని యది సరియైనదిగాగన్పట్టదు.

2 సుందర పోయిన అక్షరము 'ర' అని తోచుచున్నది.

౬. నస ఖఖరాతవస నిరవసెన కరస సాతవాహనకుల యసపతిఠా
పనకరస సవ మండలాభివాదితచ. ళ.ణసవినివతిత చాతు వణ స
కరస అనేక సమరావజితసతుసఘస అపరాజిత విజయపతాక
సతుజనదుపధసనీయ

౭. పురవరస కులపురిన పరపరాగత విపులరాజసదన ఆగమాన నిల
యస సపురిసానం అసయస సిరీయం-అధిఠానస ఉపచారానం
పభవస ఎకకుసస ఎకధనుధరస ఎకసూరస ఎక బంహాణస
రామ

౮. కెసవాజున భీమసెనతుల పరకమస చణఘను సప సమాజకారకస
నాభాగ నహుష జనమెజయ సకరయయాతి రామాబరీస సమ
తెజస అపరిమితం అఖయం అచింతం అభుతం బవెన గరుళ[3]
సిధయఖరఖస విజాధర భూత గధవ చారణ

౯. చంద దివాకర నఖత గహా విచణ సమరసిరసి జితరిపుసఘస నాగ
వర ఖధాగగన తలం అభివిగాఢస కులవిపుల సిరికరస సిరిసాత
కణిస మాతుయ మహాదెవీయ గొతమీయ బలసిరీయ సచవ
చనదాన ఖమాహింసానిరతాయ తపదమనియ

౧౦. మొపవాసతపరాయ రాజరిసివధుసదం అఖిలం అను విధీయమా
నాయ కారితదెయ ధమ [కెలస]ప[వత][4] సిఖరసదిసె తిరణ్హు
పవతసిఖరె విమాన వర నివిసెన మహిఢీకలెణ ఎతచలెణ
మహాదేవీ మహారాజమాతా మహారాజపితామహీ దదాతి
నికాయస భదావసీయానం భిఖుసఘస

౧౧. ఎతసచ లెణస చితణునిమితం మహాదేవీయ అయకాయ సెవ
కాము పియకాము చ ణ[తా] [దఖిణా][4] పథసరొ పిసజిపతి

---

[3] గరుడ అని చదువవచ్చును.

[4] ఈ [ ] గుర్తులలోని అక్షరములు స్పష్టముగా రాతిమీద గానరాకపోయినను ఊహించి చదువుటకు ఇతర శాసనములబట్టి అవకాశమున్నది.

రెయొ ధమసెతుస దదాతి గామం తిరణ్హుపవతస అపరదఖిణ పసె
పిసాజి పదకం సవజాత భోగ నిరతి 5

పాకృతమూలమునకు సంస్కృతము.

౧. సిద్ధమ్. రాజ్ఞో వాసిష్ఠీ పుత్రస్య శ్రీపుళుమాయస్య సంవత్సరే ఏకోనవింశతి గ్రీష్మే పక్షే ద్వితీయే ౨ దివసే త్రయోదశ్యాం రాజరాజస్య గౌతమీపుత్రస్య హిమవన్మేరు

౨. మందర పర్వత సమసారస్య అసిక అశ్వక ముళక సురాష్ట్ర కుకు రాపరాంతానూప విదర్భాకరావంతి రాజస్య వింధ్య ఋక్షవత పారియాత్ర సహ్యకృష్ణగిరి మఞ్చ శ్రీగిరి మలయ మహేంద్ర

౩. శ్వేతగిరి చకోర పర్వతపతేః సర్వరాజలోకమండల ప్రతిగృహీత శాసనస్య దివసకరకర విబోధిత కమలవిమల సదృశవదనస్య త్రిసముద్రతోయ పీతవాహనస్య పరిపూర్ణచంద్రమండలసదృశ

౪. ప్రియ వదనస్య వరవారణవిక్రమచారువిక్రమస్య భుజగపతిభోగ పీనవాలవిపులదీర్ఘ సుందర భుజః అభయోదకదానకలన నిర్భ యకరస్య అవిపన్నమాతృశుశ్రూషాకరస్య సువిభక్త త్రివర్గ దేశకాలస్య

౫. పౌర జన నిర్విశేష సమసుఖదుఃఖస్య క్షత్రియదర్పమాన మర్దనస్య శక యవన పహ్లవ నిషూదనస్య ధర్మోపార్జిత కరవినియోగ కరస్య కృతాపరాధేపి శత్రుజనే అప్రాణహింసారుచేః ద్విజా వరకుటుంబ వివర్ధ

౬. నస్య ఖఖారాటవంశ నిరవశేషకరస్య సాతవాహనకుల యశః ప్రతిష్ఠాపనకరస్య సర్వమండలాభివాదితచరణస్య వినివర్తిత చాతుర్వర్ణ్యసంకరస్య అనేకసమరావజితశత్రుసంఘస్య అపరాజి తవిజయపతాకస్య శత్రుజన దుష్ప్రధనీయమనస్య

౭. పురవరస్య కులపురుషపరంపరాగత విపులరాజశబ్దస్య ఆగమ నిల

5 శాసన మసంపూర్తిగా నున్నట్టును తోచును.

యస్య, స్వపురుషాణా మసదృశ శ్రియోధిష్ఠానస్య ఉపచారా
ణాం ప్రభవస్య ఏకాంకుశస్య ఏకధనుర్ధరస్య ఏకశూరస్య ఏక
బ్రహ్మణః రామ

౮. కేశవార్జున భీమసేనతుల్య పరాక్రమస్య క్షుణఘనోత్సవ సమాజ
కారకస్య నాభాగ నహుష జనమేజయ సగర యయాతి
రామాంబరీష సమతేజసః అపరిమిత అక్షయ అచింత్యాద్భుత
ప్రభావేన గరుడసిద్ధ యక్ష రాక్షస విద్యాధరభూత గంధర్వ
చారణ

౯. చంద్ర దివాకర నక్షత్రగ్రహావీక్షణేన సమరశిరసి జితరిపుసంఘ
స్య నాగవరస్కంధాద్గగనీతలమభివిగాఢస్య కులవిపుల శ్రీకరస్య
శ్రీశాతకర్ణేః మాతుః మహాదేవ్యా గౌతమ్యా బలశ్రియా
సత్యవచన దానక్షమాఽహింసా నిరతయా తపోదమనియ

౧౦. మోపవాస తత్పరయా రాజ ఋషివధూ శబ్ద మఖిల మను విధీ
యమానయాకారిత దేయధర్మయా కైలాస పర్వతశిఖరస
దృశే త్రిరశ్మి పర్వత శిఖరే విమాన వరం నిర్విశేషే [మహిఢీశ
లెణ ఏతచలెణ] మహాదేవీమహారాజమాతా మహారాజపితా
మహీ దదాతి నికాయస్య భద్రావనీయానం భిక్షుసంఘస్య

౧౧. ఏతస్య చ లేణస్య చిత్రనిమిత్తం మహాదేవ్యా అర్యకాయాః
సేవాకామః ప్రియకామశ్చ దక్షిణా పథేశ్వరః పితృప్రీత్యా ధర్మ
సేతుః దదాతి గ్రామం త్రిరశ్మి పర్వతస్య అపరదక్షిణ పార్శ్వే
పిశాచీ పద్రకం సర్వజాత భోగనిరతిః

ఆంధ్రీకరణము.

సిద్ధం ! వాసిష్ఠీ పుత్ర శ్రీపులుమాయి చక్రవర్తి విజయ రాజ్యసంవ
ములు ౧౯, గ్రీష్మ ఋతువు ౨ వ పక్షమున ౧౩ వ దివమున సత్యవ
చోనిధియును క్షమ యందును అహింస యందును నిరతురాలును
తపస్సు, ధర్మము ఉపవాసనియమములందు తత్పరురాలును రాజ

ఋషివధువునకు అను విధేయములయిన అఖిలధర్మముల నాచరించు సాధ్వీమణియును; రాజులకు రాజును, హిమవంత మేరు మందర పర్వత సమబలుండును అసిక, అసక (అశ్వక) ముళక (ముండక) సుర ఠ (సురాష్ట్ర) కుకుర, అపరాంత అనూప విదర్భ అకరావంతీదేశముల కు రాజును వింధ్య ఋక్షవత పారిచాత (పారియాత్ర) సహ్యకగిరి (కృష్ణగిరి) మచ (మఞ్చ) శిస్థాన (శ్రీగిరి) మలయ మహేంద్ర శ్రేష్ఠగిరి చకోరపర్వతములకు పతియును, సర్వరాజలోకమండల ప్రతిగృహీతశాస నుడును, సూర్యకిరణములచే కిలికింత పెట్టబడి వికసించిన శుభ్రమైన కమలమువంటి ముఖముకలవాడును, మూడుసముద్రములందు జలము త్రావిన అశ్వములు (మేఘములు) వాహనములు గా గల వాడును, పరి పూర్ణమైన చంద్రమండలము వలె మనోజ్ఞమయిన ప్రియ వదనము కలవాడును, వరవారణ విక్రమ చారు విక్రముండును, నాగేంద్రునివలె బలిష్ఠములయి మిక్కిలి దీర్ఘములయి సుందరములయినబాహువులు గలవాడును, అభయదానములచే తడి యారని అభయహస్తము కల వాడును, నిరంతర మాతృశుశ్రూషకుడును, త్రివర్గసాధనమునకు దేశ కాలముల నెఱిగిన వాడును, పౌరజనుల యొక్క విశేష మయిన సుఖ దుఃఖములు తనవిగా భావించుకొను వాడును, క్షత్రియుల యొక్క దర్ప మును మానమును మర్దించిన వాడును, శకయవనపహ్లవులను నిర్జిం చిన వాడును, ధర్మోపార్జితములయిన సుంకములను తప్పఅన్యములను కొని వినియోగింపనివాడును, కృతాపరాధు లయిన శత్రువులందు సయితము ప్రాణహింస చేయనొల్లని వాడును, కడ జాతి కుటుంబము లను ద్విజకుటుంబములను గూడ నొక్కవిధముగ సంరక్షించువాడు ను, ఖఖారట వంశమును నిరవశేషము గావించిన వాడును, సాతవా హనకులము యొక్కయశమును ప్రతిష్ఠించినవాడును, సర్వమండలాభిప అభివాదితచరణుండును, చాతుర్వర్ణ్య సాంకర్యమును నివర్తించినవాడును, అనేక సమరములందు శత్రుసంఘములందు నిర్జించినవాడును, పరాజయ మెరుగని విజయపతాకము గలవాడును, శత్రువులకసాధ్యమై శ్రేష్ఠ

మయిన పురమును రాజధానిగా గలవాడును, కులపురుషపరంపరాగత మైన *విపులరాజశబ్దము గలవాడును, ఆగమశాస్త్రమునకు నిలయ మైనవాడును, సత్పురుషుండును, సిరి కధిష్ఠానుండును, అంకుశమువంటి వాడును, ఒక్కఁడే ధనుర్ధరుఁడును, శూరుఁడును, ఒక్కఁడే బ్రాహ్మణుఁడు అని ప్రశంసింపదగిన వాఁడును, రామ కేశవ అర్జున భీమ సేనులతో సమానమైన పరాక్రమము గలవాఁడును, ఉత్సవదినములు పండుగలం దును సమాజకారకుల కందరికిని ఔదార్యము ప్రకటించువాఁడును, నాభాగ నహుష జనమేజయ సగర యయాతి రామ అంబరీషులతోడి సమమైన తేజముగలవాఁడును, పవన గరుడ సిద్ధ యక్ష రాక్షస విద్యాధర భూత గంధర్వ చారణ చంద్ర దివాకర నక్షత్రగ్రహములవలె సమరములందు అపరిమితమును, అక్షయమును, అచింత్యమును, అభూతమును అగు పరాక్రమము గలవాఁడును, తనవరవారణము స్తంభమునుండి ఆకాశమునకు ఎగసి శత్రుసంఘముల నిర్జించినవాఁడును, తనకులమున కపారమైన సంపదలను సముపార్జనచేసినవాఁడును; అగు శ్రీ శాత కర్ణి మహారాజులకు తల్లియు మహాదేవియు నగు శ్రీగోతమీ బలశ్రీమహారాణి పెట్టించిన ధర్మము: కైలాసపర్వత సదృశ మైన తిరణ్హు (త్రిరశ్మి) పర్వతశిఖరముపై దేవతల విమానమును బోలిన యీగుహను నిర్మింపించెను. మరియు నామహాదేవి ఆమహారాజమాత ఆమహారాజపితామహి భద్రాయనీయ నికాయమునకు జెందిన భిక్షు సంఘమునకు దీనిని సమర్పించెను. ఈగుహ నెప్పటికప్పుడు మంచిస్థితి యందుంచి, చిత్రములతో అలకరించుచుండుటకై ఆర్యురాలైన నా మహాదేవికి ప్రియసేవకుఁడును పౌత్రుఁడునగు దక్షిణాపథేశ్వరుడు(శ్రీపుళుమావిమహారాజు)ఆమెకు ప్రియ మగునట్లుగను తనతండ్రికి ధర్మవుగను పిసాజిపదకమను గ్రామమును, ఈత్రిరశ్మి (తిరణ్హు) పర్వతమునకు అపరదక్షిణాదిశాముఖముగా నున్నదానిని సర్వజాతభోగనిరతు డై దానము చేసెను.

---

* ఈశబ్దమునకు కీర్తి యనునర్థమునుగలదు. అది అట్లుండఁగా నిత డీమాటలవలన కులపరంపరాగతముగ రాజశబ్దమునకు అర్హుడైనవాఁడును అనియు నర్థము వచ్చును.

సంగ్రహవ్యాఖ్య.

ఈశాసనములో రెండవపంక్తియందు ఉదాహరింపబడిన పేళ్లనన్నింటినిగూర్చి తెలుసుకొన దలచువారు బొంబాయి గెజటీరు ౧౬ వసంపుటమున నాసిక చరిత్రగల అధ్యాయమును, శ్రీయుత చిలుకూరి వీరభద్రరావు పంతులుగారి ఆంధ్రులచరిత్ర ప్రథమభాగమును, దేవదత్తరామకృష్ణ భండార్కరుగారు ఇండియన్ ఆంటిక్వేరి ౪౭ వ సంపుటమున ప్రకటించినవ్యాసమును చూచుకొనవలయును. సురాష్ట్ర అనూపలకరావంతి కుకుర అపరాంత మున్నగునవి రుద్రదమనుని గిరినార్ శాసనమునందుకూడ గానవచ్చుచున్నవి. మిగిలినపేళ్లలో 'అసక' అనునది "అశ్వక"అని, ముళక అనునది ముండక అని, సంస్కరించవచ్చును. అశ్వకులదేశ మేదియో నిర్ణయింప వీలు కాదు. భగవన్‌లాల్ ఇంద్రాజిపండితుడు విష్ణుపురాణమునందు ఉదాహృతులయిన "ముండకు"లే 'ముళక' లని నిరూపించుచున్నాడు. వీరు శక,తుఖార జాతులతో పాటు కలిపి పేర్కొనబడి యుండుటవలన ఇంద్రాజీపండితునియూహ బలపడుచున్నది. అయినను ఇందలి సందర్భశుద్ధి విచారింపవలయును. పారిచాతము పారియాత్ర మని సంస్కరించవచ్చును. మచపర్వతము మఞ్చ పర్వతము గావచ్చును. గహాత, గృహస్థ అని సంస్కృతను గావించినటులు సిరిటన శ్రీస్థానగా చూచుకొనవచ్చును. కొందరు సెటగిరి స్వేతగిరియని యందురు; కాని శ్రేష్ఠగిరి యని కా కూడదా యని సందియము గలుగును.

గోతమీపుత్రుడు ధర్మోపార్జితకరవినియోగకరుడని పేర్కొనబడినాడు. ఈధర్మోపార్జిత శబ్దమునుబట్టి రాజు ధర్మము ననుసరించి పన్నులు గైకొనుచు, ధర్మానుసారముగనే యాధనమును వెచ్చించుచుండినట్లు స్ఫురించుచున్నది. మరియు "కులపురుషపరంపరాగత విపులరాజశబ్ద" అను బిరుదములు ఒకవిశేషార్థమును సూచించుచున్నట్లున్నవి. ఇందలి "పురుష" శబ్దము, రాజ్యము పురుష పరంపరగా ననుభవింపబడుచున్నట్లు ద్యోతకము చేయుచున్నది. "విపుల రాజసద(శబ్ద)" యనుసమా

సముతరువాతకాలపు శాసనములందు గానబడుచున్న "సమధిగత పంచ మహాశబ్ద" అనునట్లు వినబడుచున్నది. ఎందుచేత నన 'విపుల' శబ్దము, మహా అను అర్థములో వాడబడినట్లు తోచును. "విపులరాజశబ్దము" రాజాధిరాజత్వమును సూచించుచున్నదనియు, శాతకర్ణి మహారాజాధిరాజగుటచేత నాపదముపయోగింపబడిన దనియు ఫ్లీటుపండితుని వాదము.

"తిరణ్హు" శబ్దము, అప్పటి కాలపుటుచ్చారణనుబట్టి వికృతిరూపమును బొందినప్పటికిని, సంస్కృతమునందు "త్రిరశ్మి" యగుటకు సందియము లేదు. భద్రాయనీయులు బౌద్ధులలో స్థవిరసంప్రదాయమునకు జెందిన భిక్షునికాయమువారు. "ధర్మసేతు" శబ్దము సాధారణముగా ధర్మమనెడు వారధి (సేతువు) అని అర్థము. బలశ్రీమహాదేవి నిర్మించినగుహాను దానపతి ధర్మసేతు వని పిలచి యుండుటలో నాశ్చర్యము లేదు. ధర్మసేతువు ఇంద్రాజి పండితు డన్నట్లు ఆగుహాధికారిపేరు గా జాలదు. పిసాజిపదకయను దత్తగ్రామము సంస్కృతమున పిశాచిభద్రక గావచ్చును. ఈతరువాత రాబోవు శాసనమునందు జేర్కొనబడిన "సుదిసన" గ్రామమునకే పిశాచీభద్రకమని పేరుండెనా యని సంశయము కలుగుచున్నది. ఈశాసనము తటాలున వాక్యమయిన పూర్తిగాకుండ ముగియుటయు, నిది యీయబడిన మూడేండ్లనాటికే మరియొక శాసనమీయబడుటయు అందలి విషయముకూడ భద్రాయనీయశాఖీయులకు జెందిన దగుటయు, ఆగ్రామముకూడ త్రిరశ్మి పర్వతసమీపముననుండుటయుఁజూడ ఈరెండు గ్రామనామములు నొక్కగ్రామమునకే జెందునా అని సంశయము కలుగుచున్నది.

ఈశాసనము ప్రాకృతభాషయందున్నది. ఈప్రాకృతము ఇంచుమించుగా రెండు వేల యేండ్లకు పూర్వమునాటిది. ప్రాచీన బ్రాహ్మీ, ఖరోష్టి లిపులు వ్రాయుట చదువుట నేర్చినవారు గాని ఇట్టి శాసనములు చదువజాలరు. అంతే కాదు. ప్రాచీనలిపిసంప్రదాయముకూడ తెలిసినవారు కావలెను. చదువరి యీశాసనములందు కొన్ని యక్షరములపై చుక్కలుండుట గమనించును. ఆచుక్కలు మూలమందుకూడ గలవు

వాటికర్థము లేదనియు, నవి కాలవశమున నెండకు వానకుగలిగెననియు కొందరి యభిప్రాయము. కాని అది సరియైనది కాదని నానమ్మకము. ద్విత్వాక్షరములు వ్రాయునపుడు అక్షరముపై చుక్కపెట్టుట ప్రాచీన లేఖకుల సంప్రదాయమైనట్లు గానిపించెడిని.

3

(ఇదిపై రెండవశాసనముతో కలిసి శేష భాగమువలె నున్నది. కాని ఆశాసనమునకును దీనికిని నడుమ స్వస్తికములను చెక్కబడినది. అందువలన నిది పైదానియొక్క భాగము కాదనియు, దానికి సంబంధించిన దనియు తెలియుచున్నది.)

మూలము.

౧౧ సిద్ధం నవనరస్వామీ వాసిఠీపుతో సిరిపుళుమవి ఆనపయతి గోవధనె అమచ

౧౨ సివఖదిల యు అంహెహి సవ ౧౯ గి,ప౨,దివ ౧౩ ధనకటక సమనెహి య ఎథ పవతె తిర [ణ్హుమ్హి.........]న ధవసెతుస లెనస పటిసథరణె ఆఖయ [నివి] హెతు ఎథ గోవధనాహారె దఖిణమగె గామొ సుదిసణా భిఖుహి దెవిలెణవాసెహి నికాయెన భదాయెనియెహి పతిగయ దతో ఎతస దానగామస సుదసనాన పరివటకె ఎథ గోవధనహారె పువమగె

౧౩ గామ సమలిపద దదామ ఎతతె మహాఅఐకెన ఒదెన ధమసెతుర లెణస పటిసథరణె అఖయనినిహెతు గామసామలిపద భి[ఖు]హి దెవిలెణ........ భదాయనయెహి పతిగహ్హ ఒయపపెహి ఎతస చ గామస సామలిపదస భిఖుహాల పరిహార

౧౪ వితరామ అపాలస అనోమస అలొణఖాదక అరఠసవినయిక సవజాతపరిహారిక చ ఎతెహి న పరిహారెహి పరిహారెహి ఎతచ

గామ సమలిపద పరిహారేచ ఎథ నిబథాపేహి సు[దస]నె
గామస చ సుదసనాన వినిబధకారేహి అణతా మహాసేనా
పతినా మెఘునెన [సాతకని]నా ఛతొబటికా. వానకెహి హాథ
[ఛాతా] తొ దతాపటికా సవ ౨౨ గి పఖె దివ ౭ సత
కణినా కటాగొవధన వాథవాన ఫాసు [కాయొ] విణ్హు పాలెన
స్వామి వణణాత నమొ భగవతస పతి పతపతి జినవరస బుధస.

## సంస్కృతము. *

౧౧. సిద్ధమ్. నవనరస్వామీ వాసిష్ఠీపుత్రః శ్రీ పుళుమావి ఆజ్ఞాప
యతి, గోవర్ధనే అత్ర చ

౧౨. శివఖండిలాయ, అస్మాభిః సంవత్ ౧౯ గ్రీష్మేపక్షే, ౨ దివసే
౧౩ ధనకటశ్రమణేభ్యః ఏతత్పర్వతే త్రిరశ్మి.........ధర్మ
సేతోః [లెణస]ప్రతిసంతరణే అక్షయనీవిహేతుః ఏతద్గోవర్ధన
హారే దక్షిణమార్గే గ్రామః సుదసన (సుదర్శనః) భిక్షుభ్యః
దేవి [లేణ]వాసిభ్యః నికాయ భద్రాయనీయేభ్యః ప్రతిగృ
హదత్తః ఏతస్య దానగ్రామస్య సుదసన (సుదర్శన) పరివాటి
కే ఏతద్గోవర్ధనహారే పూర్వమార్గే

౧౩. గ్రామం సామలిపదం (శ్యామలపథం) దదామ ఏతన్మహా ఆర్య
కేణ [ఓదెన] ధర్మసేతోర్లేణస్య ప్రతిసంతరణే అక్షయనీవిహేతుం
గ్రామం సామలిపదం (శ్యామలపథం) భిక్షుభ్యః దేవి [లేణ]

*ఈసంస్కృతీకరణ మింకను పరిష్కరింపవలసి యున్నది. ఇయ్యది శుద్ధముగా చదువరులు గ్రహింప కుందురు గాక.

[ ] ఇట్లు చతురస్రపు ఖండ లీకరణములందున్న పదములు ప్రాకృతములు. వాటిసంస్కృతీకరణ మింకను చేయవలసి యున్నది.

( ) ఇట్లు వలయ ఖండ లీకరణము లందున్న పదములు శాసనము నందు పూరింపబడినవి. అవి అంత స్పష్టముగా గాన బడకున్నను శాసన పరిశోధకులు ఆపదము లున్నట్లు చదువుచున్నారు.

వాసభ్యః నికాయ భద్రాయనీయేభ్యః ప్రతిగ్రహాయ [పహిహి]
ఏతస్యచ గ్రామస్య సామలిపదస్స భిక్షుహాలపరిహారం

౧౮. వితరామ అపాలః అనేమః అలవణఖాదకః అరాష్ట్రసంవినేశకః
సర్వజాత పరిహారకః చ ఏతైః శ్రీనపరిహారైః పరిహ్రాస్య దత్త
స్య పరిహారాన్ అత్ర నిబంధయ సుదసనే (సుదర్శనే) సుదసన
గ్రామంచ వినిబద్ధం కురు ఆజ్ఞప్తం మహాసేనాపతినా మెధునేన
(శాతకర్ణినా) ఋషివాటికావాసిభ్యః [హతఛతా] దత్తపత్రికా
సంవత్ ౨౨ గ్రీష్మపక్షే... దివసే ౭ (శాతకర్ణినా) కృతా
గోవర్ధన వాస్తవ్యేన ప్రేషితా విష్ణుపాలేన స్వామినో అవ
నతేన భగవతః పతి పతేః జిన వరస్య బుద్ధస్య,

ఆంధ్రీకరణము.

సిద్ధం, నవనరస్వామియగు శ్రీపుళుమావి మహారాజు గోవర్ధనమం దున్న శివఖండిలున కిట్లు అజ్ఞాపించుచున్నాడు. మాచేతను మావిజయ రాజ్య సంవత్సరములు ౧౯ గ్రీష్మఋతువు రెండవ పక్షమున ౧౩ వ దివసమున తిరణ్హు పర్వత శిఖరమునందున ధర్మసేతువని పేరుగలదేవీ గుహాయందు నివసించుచున్న భద్రావనీయ నికాయమునకు జెందిన ధనంకటక వాస్తవ్యులగు శ్రామణులకు మహాదేవీగుహ నెప్పటి కప్పుడు మంచిస్థితిలో నుంచుటకై ధర్మముగా అక్షయముగా ఆయము సాగివచ్చుటకుగాను ఈయబడిన గోవర్ధన హార (విషయ) మున దక్షిణ మార్గమునసుదసణ (సుదర్శన) గ్రామమునకు బదులుగా యీగోవర్ధన హార మందే పూర్వమార్గమున యున్న సామలిపదగ్రామమునుఇచ్చితిమి. మహాఆర్యకునిచే నీయబడిన యీసామలిపద గ్రామమును మహాదేవి గుహాయందున్న భద్రావనీయనికాయు లగు భిక్షువులకు వారనుభవిం చుటకై పుణ్యము కొరకు నిర్మింప బడిన ఆగుహాకు అక్షయ్యముగా ఆ యమును రాబట్టుటకుగాను, నీవు ఒసంగవలయును; ఈసామలిపదగ్రా మమును భిక్షుహాలపరిహారముగా నిచ్చితిమి. [అనగా భిక్షువుల యొన

బడిన భూముల కెట్లు సర్వకరములు (సుంకములు) పరిహరింపబడె నో అట్లు (నిచ్చితిమి). ఈ గ్రామమును రాష్ట్రీయనియోగులు ప్రవేశింపకుండుటకును, అట్టివారు దీని చెంతనైన బోకుండుటకునును, వారు ఉప్పుత్రవ్వుకొనకుండుటకును ఆవిషయమునందలి పాలకులు (అనగా కావలికై యుంచబడిన రాష్ట్రికులు) ఏవిధముగను సంబంధము కలుగజేసుకొనకుండుటకును కట్టడ జేసి ఏయేల సర్వజాతక రిపరిహారముగ ఇచ్చితిమి. ఈగ్రామమునకు అన్నివిధములగు సుంకములును మాచేత వదలి వేయబడినట్లు ప్రకటింపవలయును. సర్వకర పరిహారమైన యీసామలిపద గ్రామదానమును సుదసన గ్రామమునందు అప్రమత్తులనై ప్రకటించుడు. అట్లు చేయవలసినదని సుదసన గ్రామదానమును ఉపసంహరించుటకు నియోగింపబడిన రాజకీయులకు నీవు ఆజ్ఞాపింప బడితివి. ఈశాసనము మెధున మహాసేనాపతిచే లిఖయింపబడి అక్షపటలికుడగు [శాతకర్ణి]చే సంరక్షింపబడుచున్నది. ఈదాన శాసనము [శ్రీశాతకర్ణి] యొక్క విజయరాజ్యసంవత్సరములు ౨౨ వయేట, గ్రీష్మ ఋతువు...పక్షమున ౭ సప్తమవాసరమున నీయబడినది. గోవర్ధన విషయవాసు లగు కుటుంబినులకు నైశ్వర్యాభివృద్ధిగా విష్ణుపాలుడీ దానమును బ్రకటించుచు భగవానుడును జినవరుడునగు బుద్ధదేవునికు నమస్కారము లాచరించుచున్నాడు. నమో భగవతే జినవరాయ బుద్ధాయ.

### సంగ్రహ వ్యాఖ్య.

ఈదానశాసనము చరిత్రకారున కనేకచిక్కులను కలిగించుచున్నది. పైని ప్రకటించిన ౨ వదానశాసనము అసంపూర్ణము గా నుండుటయు, నిది దానిని అనుసరించియే యుండుటయు నొకటి. దానియందు దత్త గ్రామము పిశాచి పద్రకమని యుండుటయు, దీనియందు సుదసనమని బేర్కొనబడుటయు రెండవది. పిశాచీపద్రకమే సుదసన గ్రామమని బూలరు, సేనార్టుపండితుల మతము. అందులకు ఈదానశాసనమునం దివ్వబడిన పూర్వపు శాసనము యొక్క తిథి వార వర్షములు మొదటిదానితో

సరిపోవుచుండుట ప్రబలకారణము. ఈ రెండు గ్రామములును ఒక్కటే అయి యుండగావచ్చును. ఈ శాసనము ధనకటక వాస్తవ్యులగు శ్రామణులను ఉదాహరించుచున్నది. మొదటిదానము, వ్యాకరణయుక్తమయిన వాక్యము యిన లేకుండ పరంపరాగతమైన ఆచార విరుద్ధముగ "సర్వజాత భోగనిరతి" అని ముగింపబడుటయు, వెంటనేమఱియొక దానముపూర్వ మీయబడిన దానిని ఉపసంహరించుకొనుచు నిచ్చుటయు చూడ నీరెండింటికిని నడుమగల మూడేండ్లలో నేవియో విపరీతములు పుట్టియుండె నని యూహించుకొన వలయును.

ఇందు గల ధనకటక శ్రామణులును, నవనర స్వామి యను మాటలు మిక్కిలి దురూహ్యము లయి యున్నవి. ధనకటము – ధన కటకమని కొందరి మతము; కాని దీనితరువాతి శాసనమందు బెనకట యని యుండుటచే నవనరస్వామి యనగా, కాథియ వాడులోనున్న నవన[గ]రస్వామి యని కొందరర్థము చేయుచున్నారు. కాని యామతము యథార్థమని నాకు తోచుట లేదు.

ఈధనకటమే ధనకటకమని నాయభిప్రాయము. నవనగరస్వామి యని శ్రీపుళుమాయికి విశేషణము చేర్చుటచేతను, గోతమిపుత్రుడు "పురవరస్య" అని పై రెండవ శాసనమందు దెలుపబడియుండుటచేతను, ఈ నవనగరము క్రొత్తగా అమరావతి చెంత గట్టబడిననవనగరమని పిలువబడుచుండిన ధనకటకము గావలయు నని దోచుచున్నది. మరియు నీధనకటకమును, గోతమి పుత్రుడే నిర్మించినట్లుగూడ 'పురవరస్య' పైపదమును బట్టి యూహింప వీలగుచున్నది.

శాసనలేఖకు డగు మహాసేనాపతిపేరు సరిగా తెలియవచ్చుట లేదు. అక్కడ అక్షరములు అరిగిపోయినవి. మహాసేనాపతియొక్క నియోగము శాసన లేఖనముగాక వాటినిసంరక్షించి చెల్లింపజేయుట యని గుప్తరాజుల శాసనములను బరీక్షించిన వారికెల్ల దెలియును.

ఈదత్తె పత్రికను రక్షించునాతఁడు విష్ణుపాలుఁడట. వ్రాసినవాఁడు మహా సేనాపతి. అక్షపటలికుని పేరును, దానపతియు స్వామియునగు మహారాజు పేరును ఇందు సంశయాస్పదములు. నవనగరస్వామిమాత్రమసియే గాని పుళుమావిచక్రవర్తియైనట్లు గాన్పింపదు. అట్లయినచో నిదియును పై రెండు శాసనములును, ఆతనితండ్రియగు గోతమీపుత్రుని నాటివా ? లేక పుళుమావియే ధనకటకాధీశ్వరుఁడైన చక్రవర్తియా ? అని సందియము గలుగును.

రాజమహేంద్రవరము. భావరాజు వేంకట కృష్ణరావు.

# రేడియో

పాతూరి పట్టాభిరామయ్యగారు, ఎం. ఏ;

(అధ్యాపకులు : నోబిలుకళాశాల, బందరు.)

వ్యాసం తెలుగులో వ్రాస్తున్నా వాడుకలో ఉన్న ఇతరభాషలలోని పదములనుగాని, సులభంగా తెలుసుకోడానికి అవసరమయ్యే ఇంగ్లీషుమాటలనుకాని వాడతాము. ఎందుకంటే విషయము బోధపడడం అవసరమని మాఊహ. ఇప్పటికాలములో అభివృద్ధిచెందుతున్న శాస్త్రివ్యవహారాలు తెలుసుకోవడానికి అభిప్రాయాలు తెలియడం అవసరంగాని పేర్లు ఏవైతేనేమని అనుకుంటున్నాముకూడాను. దేశములో సామాన్యజనులకు మోటారుకారంటేను డైనమో అంటేను తెలిసినంతచులకనగా ఏదోక్రొత్తగా సృష్టించినబారెడు సంస్కృతపుమాటతో చెప్పితే తెలియదు.

అందుకని తెలిసే తెలుగుమాటలుంటే వాడక ఇంగ్లీషుమాటలకు తెలుగు ప్రత్యయాలు కలిపి వ్రాయము. సాధ్యమైనంతవరకు తేట తెలుగే వ్రాస్తాము.

## ప్రవేశకం.

వార్తాపత్రికలలో బ్రాడ్‌కాస్టింగు అని రేడియోఫోను Radio Phone అని చాలామంది చదివివుంటారు. బ్రాడ్‌కాస్టింగంటే వెదచల్లటం. ఏమి వెదచల్లటం? ఎట్లా వెదచల్లటం? వార్తలను ఉపన్యాసములను సంగీతమును ఒక కేంద్రప్రదేశమునుండి చుట్టుప్రక్కలనుండుచోట్లకు యంత్రసహాయముతో ఎవరింట్లో వారు వినేటట్టు పంపడం. ఎంతదూరం వినబడేది పంపే యంత్రముయొక్క శక్తివల్లను, వినేయంత్రము Radio Phone యొక్క శక్తివల్లను గాలిలోని అనుకూల పరిస్థితులవల్లను నియమింపబడుతుంది. ఇప్పట్లో షుమారు పదిమైళ్లదూరం లగాయతు భూప్రపంచము అంతటను విన

దగినట్టు పంపేయంత్రాలు వున్నవి. వినడానికికూడా అట్లాగే పరిమాణంగల యంత్రా లున్నవి. వెదచల్లడం యెట్లాగంటే విద్యుచ్ఛక్తిని (Electricity) ప్రయోగించి ఆకాశములో Ether *తరంగములను పుట్టించి వాటిని బ్రసరింపజేసి వాటితో వార్తలు మొదలైనవాటిని అన్నిదిక్కులకు అందచేయడంవల్ల ఈప్రసరింపచేయబడిన సూక్ష్మశక్తిగల విద్యుత్తరంగములను ఆకర్షించి వాటిని పెంపొందించి మరల వాటిని శబ్దరూపంగా మార్చి వినిపించడం రేడియోఫోనుయొక్క పని. ఇట్లా ప్రపంచమును వింతగొలుపుచున్న సాధనసామగ్రి విషయం మాదేశీయులకు అందులో ఇంగ్లీషురానివారలకు ముఖ్యంగా తెలియచెప్పవలెననే కుతూహలం మాకు కలిగింది.

అదిగాక మావూళ్లో సంపన్నగృహస్థులొకరు ఒకబలిష్ఠమైన రేడియోఫోనును నెలకొల్పి దానిమూలమున పగటివేళగాకపోయినా రాత్రివేళనయినా ప్రతిరోజూ కొలంబోలోనిసంగీతమును వింటున్నారు. దానినిచూచి మాయూరివారు చాలావింతగొని దానిసంగతియేమి అని నన్నుప్రశ్నించుటచేత ఈక్రిందివ్యాసములను వ్రాసి అందరికి మాచేతనైనమట్టుకు ఈనాటిశాస్త్రీయ విషయములను తెలిపి వారిజ్ఞానమును పెంపొందించవలె నని ఈవ్యాసరచనకు పురికొల్పబడితిమి.

విషయం గొప్పది. అనేకపరిశోధకులకష్టనిష్ఠురములవల్ల పైకితేబడినది. ఒకవ్యాసమున పూర్తిచేయుటకు వీలులేనిది అగుటచే ఒకవ్యాసపరంపరను వ్రాసి ప్రజల కందజేయుదలచితిమి. ప్రస్తుతవ్యాసములో వార్తాహరణచరిత్రమును సూత్రప్రాయముగా వ్రాయుదలచితిమి.

---

* ఈథరుఅనే పదాన్ని ఆకాశమనే పదంచేత తర్జుమా చేశాము. కాని "శబ్దగుణకమాకాశం" అనేనిర్వచనము ఇప్పట్లో వదలుకోవాలి. ఆకాశం గగనం శూన్యం అనే నిఘంటు వాక్యాన్నిబట్టి వాడవలసి వచ్చింది. శబ్దం వాయుతరంగముల ద్వారా మనకు గోచరమవుతున్నది. ఘనమో ద్రవమో వాయువో అగు పదార్థములం దేవస్తుసంచలనంకనపడినా శబ్దగోచరంకాదు. ఈథరు ఏమీలేని చోటనూ, వస్తువున్న చోటనూ సమానముగావున్నట్టు వూహింపబడ్డది. ఇంద్రియాలవల్లనుఇంద్రియాలకు సహాయంచేసే ఇతర పరికరాలవల్లను తెలియబడదు. అందుచేత ఆకాశమనే పదాన్ని వాడినాము.

అనాదినుంచీ, అనగా మానవజాతి మాటలను నేర్చి సంభాషించ గలిగి నప్పటినుంచీ కేకఅందనిదూరంలో ఉండేవాళ్లకు తమకబురుచెప్ప వలెనని కోరికఉండేది. దానికి పూర్వకాలంలో మనదేశంలో ఏమిచేసే వారో నేనుచెప్ప లేనుకాని అమెరికాదేశములోని ఇండియనులు Red Indians బుద్ధికుశలతలో కొన్నిమార్గాలు అవలంబించారు. అందులో ఉదాహరణకు ఒకటిచెపుతాను. చెట్టుయొక్కమానులను, గొట్టములవలె తొలిచినది, ఒడ్డున రెండుచోట్ల కొంచెములోతుగా పాతేవాళ్లట. వార్త పంపేవాడు ఒకగొట్టంమీద కొయ్యసుత్తితో మనటెలిగ్రాముగుర్తులవం టిగుర్తులతో దెబ్బలుకొట్టేవాడట. రెండోవాడురెండోగొట్టానికితనచె విని మోపి ఆదెబ్బలపరంపరను విని, ఆవార్తను కనుక్కునేవాడట. ఇది చూస్తే సరిగా మనటెలిగ్రాము ఆఫీసులో జరిగేరీతిగానే ఉంది. కానిఈ దెబ్బలు వినబడేదూరం బహుకొంచెమని వెంటనే ఊహించవచ్చును. అంతేగాక శబ్దంప్రసరించేవేగంకూడా విద్యుచ్ఛక్తిప్రసరించే వేగంకంటె చాలాస్వల్పము. విద్యుచ్ఛక్తీ, వెలుతురూ, రేడియోతరంగాలూ, సె కండుకు లక్షయెనభైయారువేలమైళ్లు నడుస్తాయి. శబ్దమో సెకండుకు పద కొండువందల అడుగులుమాత్రమే. అందుచేత పూర్వపుపనిముట్లు కొం చెముదూరముమాత్రమే ఆక్రమించగలవు. కాని విద్యుద్వార్త ఎంతదూ రమైనా బహుకొద్దికాలంలో రాగలదు.

మధ్యకాలంలో, అనగా విద్యుద్వార్త ప్రచారంలోకి రాకమునుపు, సై న్యాలను నడపడానికీ కావలసినవార్తలు పంపడానికీ కనుచూపుమేరలో పగలు జండాలనూ, రాత్రి దీపాలనూ వాడి, వాటి కుడియెడమ గానీ పైకి కిందికిగానీ కదలికతో వార్తలు పంపేవారు. ఈపద్ధతి కొంత వరకు ఇప్పుడుకూడా ప్రచారంలో ఉన్నది. రిజర్వుపోలీసు ఉండేచోటి కివెళ్లితే అక్కడజండాలతో వర్తమానం పంపడంసైనికులు నేర్చుకుం టూఉంటారు. ఇట్లాంటిదే ఎత్తైనస్తంభానికి పైకీక్రిందికీపంగే చెక్కతగి లించిదానిని భూమిమీదఉండి ఆడించుటచేత మరికొంతదూరమును జ

యించారు. వీటిని సిమఫోర్లంటారు. ప్రతిరైలుస్టేషను దగ్గిర వీనిని మన ముచూడవచ్చును. కాని ఇదిమాత్రంఎంతదూరం పనికివస్తుంది? ఇంతే గాక ఇవివర్షంకురుస్తున్నా పొగమంచుపట్టినా ఎందుకూ పనికిరావు.

దీనికి తర్వాత గుర్రపుస్వారీ లనుఉపయోగించి ఒకచోటనుంచి మరి యొకచోటికి ఉత్తరాలు పంపేవారు. ఈపద్ధతి యొక్క అభివృద్ధివలననే త్వరగానడిచే యానముల నుపయోగించే పోస్టలుపద్ధతి స్థిరపడినది, అనగా కాలము పట్టినా దూరాన వున్నమనవాండ్లతో వ్యవహరించ డానికి వీలయింది. కాని మానవస్వభావ మేమంటే, ఎట్లాగైనా ప్రయత్నించి దూరమును కాలమును కూడా జయించాలని ఉంటుంది. ఇది మనపోస్టాఫీసులలో వుండే టెలిగ్రాములద్వారాచేయగలిగినారు. ఈటెలిగ్రాములు తీగెలసహాయముతో విద్యుచ్ఛక్తిని ప్రసరింపజేసి క్షణమాత్రకాలంలో ఎంతదూరమునకైనా వార్తలను పంపుటను కనిపెట్టినారు. దీనియొక్క ప్రారంభందగ్గిరనుంచీ ఇప్పటివరకు జరిగిన అభివృద్ధిని చెప్పవలెనంటే దాని కొకపుస్తకం అవుతుంది. కానిక్లుప్తంగా కొంతచెప్పకపోతే దీనినుంచి తీగెలేని విద్యుద్వార్తాహరణము (Wireless Telegraphy) గాని,దూరశ్రవణము (Wireless Telephony) గాని గ్రహించడం చాలాకష్టము. ఈరెంటిని కలిపే ఇప్పట్లో రేడియో Radio అని వ్యవహరిస్తున్నారు.

సరిగా పనిచేసినటెలిగ్రాముయంత్రమును కనిపెట్టినవాడు శామ్యుయెల్ ఎఫ్. బి. మార్సు అనునాయన. ఇంతకు ముందుసర్ ఛార్లెసువీట్స్టను Wheatstone అనునాంగ్లేయపండితుడు ఒకరకపుతంతివార్తను కనుగొనెను. కాని అది యంతతృప్తికరముగా పనిచేయలేదు. మార్సు ౧౮౩౭ వసంవత్సరమున చిత్రలేఖనమును యూరపుఖండములో నేర్చుకొని తనదేశమగుఅమెరికాకు మరలుచున్నవోడయందు డాక్టరు జాక్సను అనునాయనను కలుసుకొనెను. ఆయనపారిసునగరములో పరిశోధనలు జరుపుచున్న ఆంపేరుగారిని కలుసుకొని ఆయనవద్దనుండి ఒకఎలెక్ట్రోమాగ్నెట్టును వెంటతెస్తూవుండెను. దీనినిచూచి మార్సుకు

వింతా గౌరవం కలిగినవి. నూతనఅభిప్రాయాలు తోచినవి. ఎలెక్ట్రో మాగ్నెటంటే యేమిటి?




పై చిత్రమునుచూడుడు. 'క' అనేది బాటరీ. 'చ' అనేది కీ. అనగాబీగము. 'ట' అనేదితీగ చుట్ట. 'త' అనేదితీగెనుఅంటకుండా అచుట్ట లోనికి చొప్పించినఇనుపకడ్డీ. 'చ' అనేకీని నొక్కితే బాటరీనుండి విద్యుచ్ఛక్తితీగ వెంట ప్రవహిస్తుంది. అట్లా ప్రవహించినంతసేపు 'త' అనే ఇనపకడ్డీకివేరొక ఇనుపముక్కను ఆకర్షించేశక్తి ఉంటుంది. కీ నివదలగానే ఆశక్తిపోతుంది. 'ప' అనేఇనుపముక్కను ఒకస్ప్రింగుకు వ్రేలాడగట్టితే 'త' కు ఆకర్షణ శక్తిఉంటే 'ప' దానిమీద పడి టంగు మనుమోత పుడుతుంది. ఆశక్తి 'త' కుపోగానే 'ప' పైకి ఈడ్వబడుతుంది. 'చ' ను ఎక్కువసేపు నొక్కితే 'ప' 'త' మీదఎక్కువ సేపునిలబడుతుంది. ఈఎక్కువ సేపుతక్కువ సేపునిల బడుటచే కలుగుశబ్దముల చేసినాడుమార్సు. ఆంగ్లభాషలో ప్రతిఅక్షరానికి అంకెకు పొట్టి పొడుగుశబ్దములతో గుర్తులనుపెట్టి వాటిద్వారాటెలిగ్రాములనుఇప్పటికి మార్సుగుర్తులతోనే నడుపుచున్నారు. ఈగుర్తులనే మనరేడియోగ్రాం (అనగా తీగలేనిటెలిగ్రాం)లోకూడానడుపుతున్నారు.

ఒక ఊరినుంచి ఇంకోఊరికి ఈయంత్రములను యెట్లా కలిపేది క్రిందిపటములో చూడవచ్చును.



కాని మొదటిపటంలో ‘క’ అనే బాటరీచివరలను ఎడతెగని తంతితో కలిపినగాని శక్తిప్రవాహము ఏర్పడదు. ఈశక్తి కొన్నివస్తువుల లోనుండిప్రవహిస్తుంది. కొన్నిట్లో ప్రవహించదు. ప్రవహించేవాటిని కండక్టర్లు Conductors అంటారు. ప్రవహించనివాటిని ఇన్సులేటర్లు Insulators అంటారు. కండక్టరుచుట్టు ఇన్సులేటరువస్తువును పూసిన దానిని ఇన్సులేటుచేసినకండక్టరు అంటారు. వెనుకటిపటములో ‘ట’ అనే తీగెచుట్ట ఇన్సులేట్ చేసినతీగె. అందువల్లతీగెలోనిశక్తి ప్రవాహము కండక్టరయినప్పటికి ‘త’ అనే ఇనపఖడ్డీలోకిపోదు. దానిదారిన మిగిలినతీగె వెంబడి పోతుంది.

| కండక్టర్లపట్టీ. | ఇన్సులేటర్లపట్టీ. |
|---|---|
| లోహములు. | పట్టు,దూది,గాజు |
| భూమి. | పింగాణీ, మైనము, |
| శరీరము. | గంధకము, రబ్బరు |
| నదీప్రవాహము | మొదలగునవి. |
| మొదలగునవి. | |

2 వబొమ్మలో ‘అ’ ఒకఊరు. ‘క’ రెండవఊరు. ‘అ’ అనుచోట కీసినొక్కితే శక్తిప్రవాహము ‘అ’ లో బయలుదేరి ‘త’ అనుతీగెగుండా ‘క’ కుపోయి, అక్కడ ఎలెక్ట్రోమాగ్నెటును శక్తివంతమునుజేసి అక్కడనుండి భూమిగుండా తిరిగి బాటరీ అంతమును చేరును. కీనివదలగానే శక్తి ఎలెక్ట్రోమాగ్నెటుకు పోయి స్ప్రింగుతో వ్రేలాడగట్టినఇనుపముక్క పైకిలేచును.

ఈపటములో శక్తిపోవుట కొకతీగె, తిరిగివచ్చుటకొకతీగె, లేదు. తిరిగివచ్చుటకు భూమిని ఉపయోగించినారు. ఇందులో ఒకతీగెఅవసరము తగ్గినది.

ఇట్టిప్రదర్శనమును చూపించినా మార్సును ఆదరించినవారు లేరు. ఆకాలంలో క్రొత్త అభిప్రాయాలను ఏప్రభుత్వమువారుగాని వర్తకశ్రేష్ఠులుగాని ఆదరించలేదు. పైగా అతనిని గేలిచేసి వెక్కిరించినారు. ఇది ఒక్కమార్సు గతియేకాదు. అంతకు ముందు ఉండిన

గొప్పనూతన విధానములను కనిపెట్టిన వారందరిగతియు నింతే. నూతనసిద్ధాంతములను కనుగొన్న పరిశోధకులను ఆయాకాలాలలో తగులబెట్టినారు. శిక్షించినారు. జైలులో పడవేసినారు. అప్పటికిని శాస్త్రీయమగు సత్యము జయించక పోలేదు. 'సత్య మేవ జయతి'.

ఈకాలంలో పరిశోధకులకు కొంతగౌరవ మేర్పడినది. కాని ఏదైనను నూతన సిద్ధాంతమును వక్కాణించగానే పరిహాసం మాత్రం తప్పలేదు. ఎందుచేత? మానవస్వభావానికి మార్పుగిట్టదు. కాని రుజువును ఒప్పుకొనక తప్పదు.

మహానుభావుడగు మార్సు ఇప్పటి సముద్రములలో నుండు తీగెలను ఖండఖండములను కలుపుతీగెలను వాటిద్వారా దూరమును కాలమును జయించుటను గూర్చి కలలను మాత్రము కనుచుండెను. ఆయనకాలములో వీనిని విని వెక్కిరించినా, తర్వాత అవి అన్నియు సిద్ధించినవి.

ఈపద్ధతిని సంకేతముద్వారా వార్తలు సాగుచుండినా మాటలుమాటలుగానే దూరమున నున్నవారికి వినబడేటట్టు చేయడంకొరకు తర్వాతిపరిశోధకులు ప్రయత్నం చేశారు. వీరిలో ప్రథముడు, ముఖ్యమైన వాడుఎలెగ్జాండరు గ్రాహాంబెలు అనునాయన. ప్రథమమున ఈయనప్రయత్నము ఒకతీగె మీదనే అనేకవార్తలను ఏకకాలమున పంపుటకై యుండెను. అనేకఎలెక్ట్రో మాగ్నెట్లు నుపయోగించి వాటిమూలమున వివిధశ్రుతులు గలరేకులను ప్రయోగించి వాటిమూలమున భిన్నవార్తలను ఒకమాటుగా ఒకతీగమీద నడుపుటకు ప్రయత్నించెను. సిద్ధాంతరీత్యా ఊహ బాగుండెను. ఒకబెల్ గ్రాంకంపెనీవారు ఆతనికి ధనసహాయము చేసిరికూడాను. కానివాడుకలో ఆపనిముట్టు సరిగాపని చేయలేదు.

విఘ్నపరంపర ఎదురుకొన్నా ఉత్తములు ప్రారంభించినపని వదలరు; గనుక పరిశోధనను జరుపుచు ఒకనాడు తనతో సహకారిగా పనిచేస్తున్నవానితో "నీకాశ్చర్యమును కలిగించు క్రొత్తఆలోచన నాకొకటి తట్టింది. అది నీకు చెబుతానువిను. విద్యుచ్ఛక్తి ప్రవాహబలమును

హెచ్చుతగ్గులుగా మార్చగలిగితినా మానవఉచ్చారణను టెలిగ్రాం ద్వారా పంపగలను సుమా అన్నాడు. ఇట్లా వారికర్మాగారంలో పని చేస్తుండగా ఒకనాడు ఒకఎలక్ట్రో మాగ్నెట్టు యొక్క రేకు సరీగా పని చేయక ఆగిపోయెను. ఆగినదానిని మరల ఆడించుటకు బెల్ యొక్క సహకారి రేకును లాగగా, బెల్‌కు ఒకవిధమగు వింతశబ్దము విన పడ్డది. ఏమిటది? ఏంచేసినావు? ఏమిమార్చుకు? నే వచ్చిచూస్తాను? అనిసహ కారియగు రాట్సనును అడిగి నాడు. ఆక్షణంలో 1875 వ॥సం జూను 2 వతారీఖున టెలిఫోను పుట్టింది. ఈఆడుతున్న రేకుతీగెలో విద్యుత్ప్రవా హబలాన్ని వేరువేరు మార్చింది. బెల్లుదగ్గిర వున్న పనిముట్టు ఆభిన్నప్ర వాహాన్ని శబ్దంగా మార్చివేసింది. ఇంకేం కావాలి? బెల్లుఊహ సిద్ధించిం ది. వాళ్లసంతోషానికి మేరలేదు. అది నిజమో కాదో అని అనేకసార్లు దాన్ని పరీక్షచేసి సిద్ధాంతం సరిగా ఉన్నదని రుజువు చేసుకొన్నారు.

మర్నాడు ఉదయాన బెల్లుయొక్క సూచనల ననుసరించి వాట్స ను పనిముట్టును కట్టాడు. దానితో మూడో అంతస్తు మీదినుంచి క్రిందికి మాట్లాడడానికి ప్రయత్నంచేశారు. మాటలు సరీగా వినబడ లేదు; గాని కొన్నికొన్ని భాగాలు వినపడ్డవి. పనిముట్టును కొంచెం వృద్ధిచేస్తే బాగా ఉపయోగిస్తుందని ధైర్యం వచ్చింది. పని ముట్టును క్రమక్రమంగా బాగుచేశారు. బెల్లు తెలివితేటలూ, వాట్సను నేర్పరి తనమూ రెండూ కలిసి మాటను పంపేపని ముట్టూ, వినేపని ముట్టూ తయారుచేసినవి.

బెల్లుమొదట ప్రదర్శించిన టెలిఫోను పని ముట్టు బొమ్మను క్రిందచూడవచ్చు. మాటను తీగెలద్వారా పంపడానికి వినడానికి దాన్నే వాడారు.



ఈబొమ్మలో 'క' అనేది ఒక బలమైన మాగ్నెటు. 'చ' అనేదిమాగ్నెటు కొనను అమర్చిన తీగెచుట్టబండి. 'ట' అనేది దానిముందరదగ్గరగా అమర్చిన మాగ్నెటుగా చేసిన పల్చని ఇనపరేకు.

'త' 'త' అనేవి తీగెచుట్ట యొక్క కొనలను దూరమున నున్న వేరొకఇట్లాంటి పని ముట్టుకు కలిపే తీగెలు.

ఇందులో ఒక క్రొత్త సిద్ధాంతం వుంది. ఒకతీగెచుట్ట ఎదుట మాగ్నెటు ముందుకు కదిలినా వెనుకకువచ్చినా ఒకక్షణికమైన విద్యుత్ప్రవాహం చుట్టలో కలుగుతుంది. ఈప్రవాహబలము కదలికయొక్క పరిమాణంచేతా, తరుచుదనం (ఫ్రీక్వెన్సీ) చేతా నియమింపబడుతుంది. ఈవిధంగా ప్రవాహబలాన్ని మార్చ గలిగారు. ఈపని ముట్టులోకి మాట్లాడితే మాటలశబ్దాని కనుగుణ్యంగా రేకు కదులుతుంది. ఈకదలికవల్ల వేరు వేరు బలంగలవిద్యుత్ప్రవాహం తీగెలగుండా దూరంగా వున్న పనిముట్టు లోకిపోయి, అక్కడిరేకు ఇక్కడి రేకు యొక్కకదలికను సరిగాఅనుకరిస్తుంది. అందుచేత అక్కడిపని ముట్టును చెవికి పెట్టుకుంటే ఇక్కడ మాట్లాడినమాటలే అక్కడా సరిగా వినబడతవి.

ఇంతమాత్రంచేత మనంచూచే టెలిఫోను యింతేకాదు. మాటలు దూరం ఎక్కువైతే చెదరిపోతవి. అట్లాకాకుండా సరిగా వినబడడానికి కావలసినమార్పులు అనేకంచేశారు. వాటిని చెప్పడం మనకు అనావశ్యం. మూలసూత్రం తెలిస్తేచాలు. ఈకాలంలో ఖండఖండాలను కలిపే టెలిఫోన్లు ఉన్నవి. చాలావృద్ధిలోకీ వాడుకలోకీ వచ్చిందిటెలిఫోను. ఈవిధంగా తీగెలలోగుండా విద్యుత్ప్రవాహాన్ని వారి వార్తలనూ పంపినారు. మాట్లాడినారు. కాని మానవజాతికి తృప్తివుందీ? తృప్తివుంటే ప్రకృతి విశేషాలను మనము కనుక్కోగలుగుతామా? అదీగాక మధ్య తీగెలు తెగిపోవడం తీగెలుమోశేస్తంభాలు పడక్షం వ్యవహారానికి ఆటంకంరావడం కలుగుతూ వచ్చింది. వెనుక చెప్పినట్టు ఒకతీగెను తప్పించి భూమిని ప్రవాహంతిరిగి రావడానికి ఉపయోగిం

చారు. రెండోతీగను గూడా ఎట్లాగైనా తీసివేస్తే సౌకర్యంగా వుంటుంది. సముద్రాలలో కష్టపడి తీగెలు వేయడం బాధ తప్పిపోతుం దని ఆలోచించారు. కాని అది అంత తేలికకాదు. క్రొత్తక్రొత్త ప్రకృతి రహస్యాలు తెలుసుకోవలసివచ్చింది. అందుచేత చాలాకాలంపట్టింది; కాని కష్టించి పనిచేస్తే ఫలం లేకపోతుందా? ఈకష్టాలఫలమే మన రేడియో. ఈమాటువ్యాసంలో రెండోతీగెను తీసివేయడానికి చేసిన మొదటి ప్రయత్నాలూ, వాటినిరుపయోగం, ఆకాశతరంగాలూ ఊహించడం, వాటిని కనిపెట్టడం, వాటి సిద్ధాంతాలను గురించీ వ్రాస్తాము.

బందరు.                                                    పాతూరి పట్టాభిరామయ్య.

# జయంతి.

రెండునెలల కొకసారి ప్రకటించే పత్రిక.

సంవత్సర చందా. రూ. 4. 0. 0.

విడిసంచిక. ,, 1. 0. 0.

దీనిలో ఆంధ్రుల సాహిత్య చారిత్రిక వార్తా శిల్ప నాటక విషయాలను గురించిన్నీ, ఆంధ్రులకు ఆంధ్రభాషకు ఉత్తేజం కలిగించే యితర విషయాలను గురించిన్నీ, వ్రాసే వ్యాసాలు ప్రకటింపబడును. ప్రతి సంచిక చక్కని ఫెదరువెయిటుకాగితాలమీద అందముగా ముద్రింపబడును. ప్రతిపర్యాయమూ ౧౦౦ పేజీలకు తక్కువలేకుండా ఉండును. విజ్ఞానమునం దభిరుచిగల ఆంధ్రులందరూ దీనిని ఆదరించవలె నని ప్రార్థిస్తున్నాము. వ్యాసకర్తల ఇచ్ఛానుసారముగా గ్రాంథికభాషగాని, వాడుకభాషగాని, ఉపయోగింపబడును.

# మా ప్రతినిధులు.

ఈ క్రిందిమిత్రులకు మాపత్రిక పంచిపెట్టడానికీ, చందాలు వసూలుచేయడానికీ అధికార మిచ్చినాము. అన్నిసంగతులూ చందాదారులు ప్రతినిధులద్వారా తెలుసుకోవచ్చును.

చెన్నపట్టణము:— 1 శ్రీ అడవి బాపిరాజుగారు, బి, ఏ, [లాకాలేజి] సుందరనివాసం, మాంబళం, మద్రాసు.

2 ప్రకాశకులు—జయంతి. 7 ఆరణిగంగిన్న వీధి, చాకలపేట, మద్రాసు,

పర్లాకిమిడి:— శ్రీ ఇవటూరి కనకాచలంపంతులుగారు, ఎం, ఏ, ఎల్ టీ.

విజయనగరం:— శ్రీనందివాడ శ్రీనివాసరావుగారు, కంటోన్మెంటు.

విశాఖపట్టణం:— శ్రీ విజాపురపు వేంకటసుబ్బారావుగారు. మొసలికంటిభవనము.

రాజమహేంద్రవరము:— శ్రీభావరాజు వేంకటకృష్ణారావుగారు. బి. ఏ. బి, ఎల్. ఇన్నీసుపేట,

బందరు:— శ్రీవిశ్వనాథ వేంకటేశ్వర్లుగారు, గొడుగుపేట.

గుంటూరు:— కాసరబాదా నారాయణస్వామిగారు, అరండలుపేట

నర్సారావుపేట:— నాయని సుబ్బారావుగారు, బి. ఏ.

సూచన:—ఇతరప్రదేశాలలో మాప్రతినిధులుగా పనిచేసి, మాకు తోడ్పడగోరే మిత్రులు కార్యదర్శిగారిపేర వ్రాయవచ్చును. అట్టివారికి తగిన సౌకర్యమును వారు కలిగించుటకు సిద్ధముగా నున్నారు.

## ముఖ్యముగా గమనింపవలసిన చిరునామాలు.

౧ వ్యాసాలు పంపడానికి:— శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారు, బి, ఏ. సంపాదకుడు, 'జయంతి' గొడుగుపేట, బందరు.

౨ విరాళములు చందాలు మణిఆర్డరు చేయడానికిన్నీ, పైపత్రికనుగూర్చిన సమస్త ఉత్తరప్రత్యుత్తరాలకును, } శ్రీ కోలవెన్ను రామకోటీశ్వరరావు గారు. బి. ఏ. బి. ఎల్; కార్యదర్శి, 'జయంతి' ఆంధ్రజాతీయకళాశాల, బందరు.

3 చందాదార్లుగా చేర్చుకొమ్మని వ్రాయడానికి. } శ్రీపంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు ప్రకాశకులు 'జయంతి' 2 ఆరణిగంగన్న వీధి, చాకలపేట, చెన్నపట్టణము.

# 'జయంతి'కి విరాళములు.

శ్రీయుతులు, వింజమూరి. రంగాచార్యులుగారు ఎం, ఏ, బి, ఎల్.
వకీలు, గుంటూరు, ౧౦౦

,, జెల్లంకొండ రాఘవరావుగారు పమిడిపాడు, ౧౦౦

,, విశ్వనాథ సత్యనారాయణగారు, బి. ఏ. గొడుగుపేట, బందరు. ౨౫

,, అడవి బాపిరాజుగారు, బి, ఏ, లాకాలేజి, చెన్నపురి. ౨౫

,, కోలవెన్ను రామకోటీశ్వరరావుగారు, బి, ఏ, బిఎల్;
ఆంధ్రజాతీయ కళాశాల, బందరు. ౨౫

,, కొట్టుపాటి. వేంకటసుబ్బారావుగారు, బి, ఏ, బి, ఎల్,
వకీలు, గుంటూరు. ౨౫

,, గంథం వెంకయ్యనాయుడుగారు, బి, ఏ, బి, ఎల్, వకీలు, భీమవరము ౨౫

,, తాడేపల్లి సంపూర్ణ లక్ష్మీనారాయణగారు, బి. ఏ. బి. ఎల్.
నర్సారావుపేట. ౨౫

,, చెన్నాప్రగడ వెంకటసుబ్బారావుగారు ఎల్. ఎమ్, ఎస్, డాక్టరు,
భీమవరము, పంద్రంగి, నాగేశ్వరరావుపంతులుగారు ౩౫

,, నండూరి వేంకటసుబ్బారావుగారు, బి, ఏ, బి, ఎల్, వకీలు, ఏలూరు ౨౫

,, నాయని సుబ్బారావుగారు, బి. ఏ. నర్సారావుపేట ౨౫

,, ప్రభల చంద్రశేఖరశర్మగారు, కొత్తపేట, తెనాలి ౨౫

,, ప్రభల రామబ్రహ్మానందముగారు ,, ౨౫

,, భావరాజు వేంకటకృష్ణారావుగారు, బి, ఏ, బి, ఎల్, వకీలు,
రాజమహేంద్రవరము. ౨౫

,, ఇవటూరి కనకాచలం పంతులుగారు, ఎం ఏ, ఎల్ టీ,
పర్లాకిమిడి గంజాం. ౨౫

,, పెమ్మరాజు సీతారామమూర్తిగారు, బొబ్బిలి విశాఖపట్నంజిల్లా ౨౫

,, పోతాప్రగడ వెంకటచలపతిరావుగారు. బి, ఏ, బి, ఎల్, వకీలు,
బరంపురము గంజాం ౨౫

,, యర్రమిల్లి శ్రీరామమూర్తిపంతులుగారు, బి, ఏ, వకీలు,
బరంపురం గంజాం ౨౫

,, పాట్నూరి స్వామి బాబుగారు, నరసన్నపేట, గంజాం ౨౫

,, మోణంగి రజత నారాయణరావుగారు, హీరమండలం గంజాం ౨౫

,, త్రిపురాన సూర్యప్రసాదరావుగారు, సిద్ధాంతం గంజాం ౨౫

,, బి. రామచంద్రరావుగారు, పర్లాకిమిడి ,, ౨౫

,, అధికార్ల సూర్యనారాయణరావుగారు, బి. ఏ, బి. ఎల్, వకీలు,
పార్వతీపురం విశాఖపట్టణము ౨౫

,, అయ్యాగారి మోహనరావుగారు, బి. ఏ, బి, ఎల్, వకీలు
పార్వతీపురం విశాఖపట్టణముజిల్లా ౨౫

శ్రీయుత, గిడుగు వేంకటసీతాపతిగారు, బి, ఏ, ఎల్టీ, పర్లాకిమిడి, గంజాం ౨౫
,, చేపూరి సుబ్బారావుపంతులుగారు, బి, ఏ, ఎల్టీ, విజయనగరము ౨౫
,, కిడాంబి రంగాచార్యులుగారు, బి, ఏ, బి, ఎల్ ,, ౨౫
,, ప్రభల లక్ష్మీనృసింహంపంతులుగారు, బి, ఏ, బి, యల్, వకీలు, విశాఖపట్టణము. ౨౫
,, పందిరి మల్లిఖార్జునరావుగారు, రాజమహేంద్రవరము. ౨౫
,, కాసరబాదా, సదాశివరావుగారు, కాకినాడ. ౨౫
,, కొల్లిపర సూరయ్యగారు, కపిలేశ్వరపురం, కృష్ణాజిల్లా ౨౫
,, అకిపి శంకరరావుగారు, బి, ఏ, ఎల్, టి, రాజమహేంద్రవరము. ౨౫
,, చెరుకువాడ వెంకట్రామయ్యగారు, ,, ౨౫
,, పి. భద్రయ్యగారు, ఎం, ఏ, ఎల్, టి, ,, ౨౫
,, వేమూరి విశ్వనాథశర్మగారు, ఎం, ఏ, ఎల్, టి ,, ౨౫
,, కానుకొల్లు సీతారామచంద్రఅప్పారావుగారు, బి, ఎ, బి, ఎల్, వకీలు, ఏలూరు. ౨౫
,, మల్లాది యజ్ఞనారాయణగారు, బి, ఏ, బి, ఎల్, వకీలు, బాపట్ల, గుంటూరుజిల్లా. ౨౫
,, దోర్బల శేషాద్రిశాస్త్రిగారు, బి, ఏ, బియల్, వకీలు, బెజవాడ. ౨౫
,, వేమూరి శ్రీరాములుగారు, బి, ఏ, ఎల్ టి. నర్సారావుపేట. ౨౫
,, తురగా లక్ష్మీనారాయణగారు, యం, బి, బి, యస్, బి, యస్, ఎల్, సి, బందరు. ౨౫
,, మంత్రవాది శేషయ్యగారు. గుంటూరు. ౩౦
,, బండారు వీరరాజేశ్వరరావుగారు, బి, ఏ, బి.ఎల్, గన్నవరం పేట బెజవాడ. ౨౫
,, మునిపల్లె వెంకటేశ్వర్లుగారు, బి, ఏ, బి.ఎల్, బాపట్ల. ౨౫
,, బచ్చు జగన్నాథదాసుగారు, ఎం, ఏ, ఎం, ఎల్. అడ్వొకేటు, చెన్నపట్టణం, ౨౫
,, వింజమూరి గోవిందరాజాచారిగారు, బి, ఏ, బి, ఎల్, వకీలు, చెన్నపట్టణము. ౨౫

మొత్తము. రూ. ౧,౨౯౦

మా ఉద్యమముమీద అభిమానముంచి, మేము అడుగగానే విరాళము లిచ్చిన మిత్రవర్యులకు కృతజ్ఞతతో వందనాలు అర్పిస్తున్నాము. ఈవిరాళములు ఒక్కసంవత్సరముమాత్రమే ఇవ్వవలసి ఉంటుంది. తరువాత సంవత్సరాలలో సాధారణచందామాత్రమే.

జాతీయకళాశాల, బందరు. } కోలవెన్ను రామకోటీశ్వరరావు, కార్యదర్శి, "జయంతి."

జయంతి
Vol. I No. 4

# కిన్నెరసానినృత్యము

కెరటాలలోనుర్వు
తెర చాలులో సీటి
పొర జాలులో కిన్నె
రటు కదలి యిటు కదలి
చిటితరంగాలతో — పొటితరంగాలతో
నటనాలు మొదలెట్టెనే - క్రొన్నీటి
తుటుములా కదలాడెనే

పువుకన్నెలా జగా
రవ నవ్వులా వెల్లు
కవ చివ్వలా కిన్నె
రటు లూగి యిటులాగి
చిటిలు కెరటాలతో - పెటిలు కెరటాలతో
జవ్వ జవ్వన నూగెనే - తెలిమల్లె
పువ్వారువ్వులు పోయెనే

చిఱుగాలిలో నూగు
కొఱవంపులో సీటు
తరి తీపులో కిన్నె
రటు లేచి యిటులేచి
జల్లుతుంపురులతో - కొల్లతుంపురులతో
మెల్ల మెల్లననాడెనే - కెరటాల
జల్లులో ముంచెత్తెనే

నడి నీటిలో మెలి
జడ సందులో నీటి
ముడిపొందులో కిన్నె
రటు పొంగి యిటుపొంగి
రంగారునలలతో - పొంగారు నలలతో
చెంగు చెంగున దూకెనే, క్రొంగ్రొత్త
సింగారములు వొలికెనే

సురగాలిలో పొంగు
తరగాలిలో నీటి
తెరడాలులో కిన్నె
రటు పొరలి యిటుపొరలి
పరుగెత్తు నురుగుతో - దరులొత్తునురుగుతో
గల్లు గల్లున మ్రోగెనే - జల్లుమని
వెల్లువల్ విరజిమ్మెనే

సోన జారుతూ నీటి
పనవాలుతూ అంద
మున సోలుతూ కిన్నె
రటు చెదరి యిటుచెదరి
చిన్నారి నశలతో - పొన్నారి నడలతో
వన్నె వన్నెలు పోయెనే - కిన్నెరా
క్రొన్నెలా తళు కొప్పెనే

చిరుతేనెలా అచ్చ
రల గొంతులా గజ్జె
ఘల మ్రోతలా కిన్నె
రటుమొరసి యిటుమొరసి

ఘలు ఘల్లునా వెల్లు
వల పెల్లునా కొల్ల
వలి జల్లునా కిన్నె
రటు త్రొక్కి యిటు త్రొక్కి
గిలుకుటందియలునా - తళుకుటందియలునా
అలల నురుసులు తోచెనే - ఆమధ్య
జలజలా పొంగెత్తెనే.

జిగి బెళ్కులా ధగా
ధగ తళ్కులా జగా
జిగిళుల్కులా కిన్నె
రటు నవ్వి యిటు నవ్వి
అలల పెన్నురుసుతో - సెలల పెన్నురుసుతో
తెలుగు వాదుగులు పోయెనే - కిన్నెరా
తెలుగు తీపులు చిమ్మెనే.

తెలినురువ్వులో చెమ్మ
టలు చిమ్ముతూ అలన
టలు క్రమ్ముతూ కిన్నె
రటు సొక్కి యిటు సొక్కి
చిఱువిరానుకనులతో - శ్రమవిరానుకనులతో
సొగతనములు వోయెనే - లోగొంతు
రాగాలు వెలయించెనే.

తమి కోనలో మిటా
రము క్రక్కుతూ నిగా
రము లొల్కుతూ కిన్నె
రటు లెగిరి యిటు లెగిరి

కిన్నెరసాని నృత్యము.

గలగలారవళితో - జలజలా రవళితో
మెల్లగా నూగాడెనే - కెరటాల
జల్లుగా ముసురెత్తెనే.

తెగపాడుతూ అంద
ముగ నాడుతూ తేనె
వగలోడుతూ కిన్నె
రటు వాలి యిటు వాలి
తళుకు వాకలతోడ - బెళుకు వాకలతోడ
మలకలై నటియించెనే - తెలినీటి
పులకలై బుగ్గెత్తెనే.

లయ పెంచుతూ మధ్య
లయ దించుతూ పాట
రయ మెంచుతూ కిన్నె
రటు సోలి యిటు సోలి
తెలి నీటిమేనితో - తలిరాకు మేనితో
ఒయ్యారములు పోయెనే, కిన్నెరా
అయ్యారె యనిపించెనే.

ధణాధంగిణాం దథోం
గిణ తక్కిణాం మద్దె
లల మ్రోతలై కిన్నె
రటు మ్రోగి యిటు మ్రోగి
చిఱువెల్లు సోనలై - సిరులొల్కు సోనలై
మృదుతాండవము చేసెనే - వనవీథి
పదువుపాయలు కట్టెనే.

కిన్నెరసాని నృత్యము.

ననమేని వంపుతో - నును.మేని ముంపుతో
కాలి గజ్జలు మ్రోగెనే - జల్లుమని
క్రాలు కెరటాల్ చిందెనే.

అలకోనలో మంచు
వలిసోనలో వెల్లు
వల వానలో కిన్నె
రటు లోడి యిటులోడి

ననమేలు రూపుతో - వనమేలు రూపుతో
సొగసువంపులు వంగెనే- వెన్నెలా
చిగురు మంపులు సూపెనే.

తలిరోర్పుతో నీటి
యలలూర్పుతో అంద
ముల మార్పుతో కిన్నె
రటుతూగి యిటుతూగి

బిగువు టందాలతో — నగవులందాలతో
నిండుగా ప్రవహించెనే — పువ్వుల
చెండులా చెలువొలికెనే.

చిఱురాలపై మిట్టి
లగునేలపై మెట్టి
లగు చేలపై కిన్నె
రటుదూకి యిటు దూకి

గ్రక్కదలునీటితో - చిక్కవడు నీటితో
నీటిగుబురులు కట్టెనే - విరిపూల
తోటలా తళుకొత్తెనే.

తెరపొర్లుతూ యీగి
కొనుమర్లుతూ తిర్గి
పడుద్రొర్లుతూ కిన్నె
రటు తరలి యిటు తరలి
పావురా మెలుగుతో - తీవలా మెలుగుతో
ఒత్తుకుని తరగొప్పెనే — తరగల్లు
ఒత్తిల్లి తటమొత్తెనే.

అడవిలో చిఱుపాయ
లై వాకలై సోన
లై జాలులై కిన్నె
రటు ప్రాకి యిటుప్రాకి
దివ్యనృత్యములతో - దివ్యనిస్వనముతో
దిగ్దిగంతము లంటెనే - సురనదీ
దీప్తి దిక్కూల చిమ్మెనే.

జిలుగు టందియలతో
కులుకుక్రొవ్వడలతో
వెలది కిన్నెరసాని
పల్కుతో వలుగ పోయి
తెలివ్రాలతేనె వాకలువారగా జేసి
తెనుగువాగై పారెనే - నెత్తావి
తెనుగుపాటలు పాడెనే.

విశ్వనాథ సత్యనారాయణ

# దాహము!

నే నొకండ

జీవితపథాల ద్రొక్కుచు బోవుచుంటి
నాకు మిత్రులు లేరు, ప్రేమికులు లేరు;
నాహృదయవేదనా భరమే రగుల్చు
నారుధిరమందు వేడిమి. నాపదాలు
కంటకపదాల బడి చీలికలుగ బగిలె;
నాశిరోజము లెండల నలిగి, వాన
జివికి చిందరవందరై చెదిరిపోయె;
నాదుతనులత క్షుద్బాధ నవసి, యలసి,
సోలిపోయెను; చురచురగాలు నాదు
హృదయమరుసీమ 'తృష్ణ' బాహువుల సాచి
దాహా! మని బొబ్బలిడును.

(విశ్వం)

# గాలిదూదేకుల బాలుఁడు.

శక్రునిచాపంపు సాహాయ్యమునను
గాలిదూదేకుల బాలుండొకండు
చాపనిస్స్వానమ్ము చదలు నిండంగ
వెలిమొయిళ్ళుల దూది పింజల నేకి
అసితమేఘమ్మను వసనమ్ముఁదెచ్చి
మెఱుపుతీగనుసట్టి మేలిమిసూది
నంబరమ్మనెడు శయ్యను గూర్చియుంచి
తారకావళియను టాకాలు వెట్టి
చంద్రుండు శయ్యపై శయనించుచుండు;
శయ్యజీర్ణించిన సమయమ్ములందు
గాలిదూదేకుల బాలుండు వచ్చి
దూది నెండలో వైచి తొక్కుఁపో నేకి
శయ్యనుఁగూర్పగా సమయమ్ము వెదకు
నందుచేతనె మనకాకాశమందు
తెల్లనిదూదిపింజలు తోఁచుచుండు;
ఇచ్చవచ్చిన వేళ నేటేట క్రొత్త
క్రొత్త నీలిపఱుపుఁ గుట్టించుకొంచు
చంద్రుండు దానిపై శయనించి నవ్వు.

ఆవంత్స వేంకట రంగారావు; బి. ఏ. ("భావకవితాతరంగిణి")

# అమీను ఖానుఁడు

యయాతిచరిత్ర కృతిభర్త

రమారమి (1550—1580)

(అడవి శంకరరావుగారు, బి, ఏ.; ఎల్, టీ.)

ఆంధ్ర కావ్యముల కృతినంది, యాంధ్రకవులఁబోషించిన మహమ్మదీయ ప్రభు వొక్కఁడే గానఁబడు చున్నాఁడు. ఈతఁడు 1.50 సం॥ మొదలు 1581 సం॥వరకు గోలకొండ రాజ్యమునుఁ బాలించిన ఇబ్రహీమ్‌కుతుబ్షా. ఈ ఇబ్రహీమునే, యిభరామనియు, మల్కిభరామనియు నాంధ్ర కవులు వాడి యున్నారు. ఈతఁడు కృతినందిన యాంధ్ర కావ్యములలో అద్దంకి గంగాధరకవిరచించిన "తపతీసంవరణోపాఖ్యాన" మను శృంగార ప్రబంధము ముఖ్యమైనదిగాఁ గన్పట్టుచున్నది. ఈ "తపతీసంవరణోపాఖ్యానము" కాక, మహమ్మదీయులకుఁ గృతి నిచ్చిన యాంధ్ర కావ్యము మరి యొకటి మాత్రమే కనఁబడుచున్నది. ఇది పొన్నిగంటి తెలగన్నవిరచితమైన "యయాతి చరిత్రము." దీనిని కృతి నందిన వాఁడు పయినఁ బేర్కొనఁబడిన మల్కిభరాము కుతుబ్షావద్ద నున్నతోద్యోగియై యుండిన అమీను ఖానుఁడు. ఈ "యయాతి చరిత్ర" మానాఁటి యాంధ్రుల సాంఘిక చరిత్రను బాగుగ వెల్లడించు చుండుటచే చాల ముఖ్యమైన కావ్యమని చెప్పవచ్చును.

యయాతి చరిత్రము 1574 సం॥ నకును 1581 సం॥ నకును మధ్య కాలములో రచియింపఁబడినట్లు కందుకూరి వీరేశలింగము గారు తమ కవుల చరిత్ర యందు సరిగనే వ్రాసియున్నారు. దీనికి కారణము యయాతి చరిత్రము పీఠికలో తెలగన్న

సీ. ... ... ... ... ... ... ... ...

వెలయు మలికిభరాముఖాఁ గొలిచి మనుచు
కలనఁ దనచెయ్యి మీఁదుగాఁ గడిమి మెఱసి
మేలు సిరులందునట్టి యమీనుఖాన
యొడయఁడొకనాఁడు నిండు పేరోలగమున.

అని యమీనుఖానునకుఁ దాను కృతినిచ్చు నప్పటికి మలికభరాముఖా జీవించియే యున్నట్లు చెప్పుటయేకాక, అమీనుఖానుని ద్వితీయ పుత్రుడైన ఘాజిలాఖాన్

చ. కని తను రాజు తెన్నుకొనఁగా బెనుఫౌజులతో సిరంగరా
యని కడకేగి”

నట్లు కూడ చెప్పుట చేతను, ఈ శ్రీరంగరాజు తిరుమలదేవ రాయల తరువాత విజయనగర రాజ్యమును 1574 మొదలు 1585 వరకు పరిపాలించి యుండుటచేతను, యయాతి చరిత్రము 1574 సం॥ లో శ్రీరంగరాజు విజయ నగరసింహాసనమునకు వచ్చిన తరువాతను, 1581 సం॥ లో మలికిభరాముఖా మరణమునకు పూర్వమును రచియింపఁబడిన దని స్థిర పడుచున్నది.

## అమీనుఖానుని వంశము

మహమ్మదీయ ప్రముఖుఁడైన అమీనుఖానుఁ డాంధ్రకావ్యము నెట్లు కృతి నందఁ దటస్థించెనో యీక్రిందిపద్యములలో తెలగన్న వర్ణించి యున్నాఁడు:—

సీ. తెలివిసింగంపు గద్దియమీఁద రాతెలఁగంటి దొరలెల్ల మొద్దుఁ జేతులనెకోల్వఁ
బూని యోఁబదియాఱు మానిసి నెలవుల పుడమిఱేం డ్లూడిగంబులకుఁ జొరఁగ
శీవి మున్నిటిలోని దీవులన్నియు నేలు మన్నీలు మెట్టుఁదామరల కెరఁగఁ
దనతేజమునడిగట్టు వెనుక చీఁకటినెల్ల విరియించుతమ్ముఁడవిందు గాఁగ

తే. వెలయు మలికిభరాముఁగొలిచి మనుచు; కలనఁదనచెయ్యి మీఁదుగాఁగడిమి మెఱసి
మేలుసిరులందునట్టి యమీనఖాన, యొడయఁ డొకనాఁడు నిండుపేరోలగమున.

మ. పాలఁతుల్, చుట్టలు, రాయబారులు, దొరల్, ప్రోడల్, చెలుల్, మాన్నివా
రలు, మావంతులు, దీవుశేలు బలియుల్, రౌతుల్ మొదల్గాఁ దనుఁ
గొలువంగా, సంతసమంది కబ్బములు పేర్కొంచుఁ, బిల్పించి న
న్నల రంగాఁ దనదండ నుంచుకొని నెయ్యంబొప్ప మన్నించుచున్.

క. కలపము చేసిన గంధం బలదించిన వెనుక, వన్నియల పచ్చడముల్,
పలుమానికముల సొమ్ములు, బలు తేజీ, లిచ్చి కూర్మి పైపైఁ బర్వన్.

మ. తనకున్ని చ్చలు ప్రొక్కువారిని సిరుల్ దై వారఁగాఁ జల్లుచూ
పున నెల్లప్పుడుఁ జూచి మన్పఁ గలపెద్దన్యోడన్ మరింగంటి యు
ప్పనగారిన్ మదిలోనిమాట దెలియం బాటింపుచుం గాంచినన్,
గని యామేటి తలం పెఱింగి పొసఁగంగా నన్ను మన్నింపుచున్.

ఆ. వె. పిలిచి "పొన్నికంటి తెలగన్న, నీచేతఁ నచ్చ తెనుఁగు కబ్బ మన్ని యెడల
మించి చెలయఁగా నమీనుఖానునకిచ్చి పుడమిలోన సిరులఁబొగడు గనుము"

క. అనవుడు... ... ... ...

పయిపద్యములవలన అమీనుఖానుఁడు విద్వద్గోష్ఠిగలవాఁడ నియు, ఆతనిని కావ్య సత్కారమునకుఁ బురిఁ గొల్పినది మరింగంటి యుప్పన యనియు బోధ పడుచున్నది. ఈ మరింగంటి యుప్పన గోల కొండ యాస్థానములో అమీనుఖానుని వలెనే గొప్పయుద్యోగియై యుండనోపు.

"రాయపత్కి సాళ్వుండును," "సతాకాసింహాసనాధీశ్వరుండును," "తురగారోహణ రేవంతుండును," "సింహతలాటరాయుండును" నగు మలికిభరాము పాదుశాహునకు "హితవరియై చదువులకు గుదురై, మన్ననల కెన్నికయై చెన్నొందు నమీనఖానసింగంబు" వంశంబును తెలగన్న వర్ణించినాఁడు.

సీ. మున్నీటి రాణియా విన్నెఁ దెలియేవేల్పు నడుగుఁ గెందామర నలరుతేనె
బొంద వాల్గము లెన్ను ప్రామిన్కు లేవేల్పు చెలువంపుఁ బావాల గిలుకురవలు
కడిఁదిరక్కసి మూఁక వెడచాల్పు లేవేల్పు చేనున్న నుడివాలు చికిలికళుకుఁ
గమ్మఁదెమ్మెర ఘూప దిమ్ము దానేవేల్పు మంచుమించుల పాను పంచమూది
యతఁడు దానైన కర్తారుఁడలమి కూర్మిఁ బ్రోవ సత్యచింతామణి పాట్లచెరువు
నందుఁ దెందేపలుగ సిరుల్ గ్రందుకొనఁగ బుడమి వెలసెహుమాయీయాపుడమిఱేఁడు.

ఎవ్వాని పాదాబ్జములయందు గంగానది యుదయించుచున్నదో, ఋషులు పఠించు వేదము లెవ్వాని పావనమూర్తి నిన్నమూలో రాక్షస సమూహ మెవ్వానిచక్రమునకుఁ జడియుచుండునో, గారి మేపరి యగు శేషుఁ డెవ్వానికి పానుపుగా నున్నాఁడో, అట్టి విష్ణువే తానైన "కర్తారుని" యనుగ్రహమున 'సత్యచింతామణి పొట్లచెఱువు' గ్రామమునందు "హనుమామియా" రాజు రాజ్యము చేయుచుండెనని పయి పద్యమున కర్థము. హిందువులు పూజించు విష్ణువే మహమ్మదీయులు భజించు కర్తారుఁడని, యిట్లు నొక్కదేవునిమూర్తులే యని తెలగన్న స్ఫురింపఁ జేయుచున్నాఁడు. ఈహనుమామియా, "జానుబీబిని" పెండ్లిచేసికొనెనఁట. వారికి "బడేమియ్యా" యనునతనుఁడు గల్గెను. యాబడేమియ్యాసిలారుబీబిని పెండ్లియాడెను. వీరికి యయాతి చరిత్ర కృతిభర్తయగు "అమీనుఖానుఁ" డుదయించెను. "బడేమియా" సిలారు బీబిని మాత్రమే కాక "సరబనబీబీని" కూడఁ బెండ్లియాడె. యామెయందు "బాబను మియ్యా" యనుకొమారునిఁ గనెను.

## అమీను ఖానునిగుణములు.

ఈయమీను ఖానుఁ డెట్టి వాఁడో యీక్రింది పద్యములలో వర్ణింపఁబడినది.

సీ. పట్టంగనీఁడు సంబళికలు కలనిలోఁ జేరవచ్చిన మార్తుచేతఁ గాని
పూననీఁ డడపంబు పొగరుతోఁ బవరంబు సేయవచ్చినవానిచేతఁ గాని
తేనీఁడు గొడుగు మత్తిలి యాలంబులోఁ జేఁబడ్డ మన్నీని చేతఁ గాని
తాల్పంగనీఁడు కుందనపుఝూరీ చివ్వఁ జెనక వచ్చిన తేనిచేతఁ గాని
యతనిఁ గొనియాడ నలవియే నైదు తలల వేల్పు రాయనికైనను, వేయి తలల
ప్రౌఢకేనియు, నని చాలఁ బొగడ నెగడె నిండువేడ్క నమీనుఖానుండు ప్రజమి.

ఉ. మించి యమీనుఖానుఁ డెలమిన్ గలబట్లకు నెల్ల నిచ్చెఁ బ
ట్టంచుల పచ్చడాలు, వరహాలు, సరాలు, గుఱ్ఱాలు, పల్లకీల్
కుంచెల యందలాలు, గొడుగుల్, పడగల్ కడుతోగవస్తుగా
నెంచఁగ నెవ్వరీడతని కీగిపసన్ బరికించి చూచినన్.

పయి పద్యములలో అమీనుఖానుని "సంబళికలు" (వక్కలు ఆకులు వేసికొనుసంచి), "అడపంబు" "గొడుగు" కుందనపు ఝూరీ"

ఆతని యలవాటులఁ దెలియఁజేయుటయే కాక, భట్రాజుల కాతఁ డిచ్చు 'పట్టుంచుల పచ్చడాలు,' "వరహాలు", "గుఱ్ఱాలు," "పల్లకీలు" "కుచ్చులపల్లకీలు", "గొడుగులు" మొదలగునవి గోలకొండ సంస్థానములోని యాస్థాన మర్యాదలనుఁ దెల్పుచున్నవి. ఈయమీను ఖానుని పేర, (మలికిభరాముని పేర ఇభరాముపురము కట్టఁబడినట్లే) అమీను పురమొకటి కట్టఁబడినట్లును, అందు

సీ. దురములో వ్రేఁటూటుతునకలుగా వ్రేయునట్టి రౌతులకెల్ల నాటకట్టు
తోడరి బెబ్బులి నైనఁబెడకేలఁ బడఁద్రోయు పూఁపుఁ గల్గిన బంట్ల పుట్టినిల్లు
వట్టి మ్రాకుల నిగుర్పఁజాలెడు పాటలఁ బాటిల్లు జాణల పట్టుఁగొమ్మ
పుట్టఁబుట్టిన ప్రౌఢ పోల్పనఁ జెప్పఁగాఁ గలుగు మొత్తములకు నెలవునైన
తనపేరఁగల్గు నమీనుపురమునందు మున్నీటి జోకసేయంగఁజాలు
చెఱువు త్రవ్వించె మిగుల నచ్చెరువుగాఁగ నిందు వేడ్క నమీనుఖానుండు మెఱసి.

ఈయమీనుపురములోఁ జెఱువు త్రవ్వించుటయేకాక, ఈతఁడు

ఉ. తామరతంపరై సిరులఁ దార్కొను కౌసలి నాటి సత్యచిం
తామణి పొట్లచెర్లను సతంబగుచుండ నమీను ఖానుఁ డిం
పామతిలంగ నిల్పఁ బొడవై బెడఁగైన మసీదుఁ గాంచి యం
దే మను, వెండికొండ పయికేగఁ దలంపక చేసికంటియున్.

చూచినారాయీవర్ణన! కౌసలనాఁడులోని సత్యచింతామణి పొట్లచెర్ల గ్రామములో, అమీనుఖానుఁ డెత్తుగాఁ గట్టించిన మసీదుఁ జూచి, శివుఁడు కూడఁ దన వెండికొండమీఁద ననిష్టముఁ గలిగి, యా మసీదునందే యుండిపోవునని బ్రాహ్మణుఁడైన పొన్నకంటి తెలగన్న వర్ణించుచున్నాడు. మహావిష్ణువే "కర్తారుఁడుగా" వర్ణించిన తెలగన్న మహేశ్వరునికి మసీదులో నివాస మేర్పరుచుటలో నాశ్చర్యమేమియు లేదు. 1574 – 1581 సంవత్సరములమధ్య రచియింపఁబడిన యయాతిచరిత్రలోఁ జేసిన యీవర్ణనల వలన, యానాఁటి గోలకొండ నవాబుల యొక్కయు, వారియుద్యోగులయొక్కయు పాలనము మత ద్వేష రహితముగ నున్నట్లు చెప్పవచ్చును. 1564 సం॥ లో జరిగిన తళ్లికోట యుద్ధమునాఁటికి గోలకొండ, విజాపురము, అహమ్మదు నగరు ము

న్నగు మహమ్మదీయ రాష్ట్రములన్నియు తాత్కాలికముగా హిందూమతద్వేషముచే నేకమైనను, ఆయుద్ధము జరిగిన కొద్ది మాసముల తరువాత నుండియు,తమలో తాముపోరాడుచు తమ రాజ్యములలోని హిందూప్రజల సంతసింపఁ జేయుటకై ఆసుల్తానులు ప్రయత్నించుచుండిరి. అందుచేతనే దక్షిణహిందూదేశములో హిందువులలోను మహమ్మదీయులలోను, పరస్పర మత ద్వేషానల మంతగా చాలకాలము నిలిచి యుండలేదు. పయి మసీదును వర్ణించిన తెలగనార్యుఁడు సందర్భానుసారముగా మహమ్మదీయ మతమును గూర్చి పొగడి యున్నాఁడు ! చూడుఁడు !

చ. పొడవుల కెల్లనుం బొడవు, ప్రోడలు నెమ్మదిలోనఁ గాంచుని
   ల్కడ కడలేని తేజున, జగంబున కవ్వలదైన వెల్గు నె
   య్యెడలను బొందు వారలకు నెక్కుఁగ నిచ్చిన యామసీదు, నిం
   పడర నమీనఖాన యొడయండు తిరంబుగ నిల్పెఁ బొల్పుగన్.

జగంబున కవ్వలిదైనవెల్గును బొందఁగోరువారల కామసీదు నిచ్చెన వంటిదట ! తెలుఁగు కావ్యములలో, మధ్యమ యుగములో బయలుదేరిన కవుల వ్రాఁతలలో మహమ్మదీయ మత దూషణము మిక్కుటముగఁ గన్పట్టుచు, ఆనాటి వైషమ్యములను బ్రకటించుచున్నది. కాని తల్లికోట యనంతరము మహమ్మదీయ రాజ్యము లొండొంటితో డీకొనుటచే,మహమ్మదీయ మతమునకును, రాజ్యపాలనకును సంబంధము విడిపోయినది. అందుచేతనే యీకాలములో ఇబ్రహీముకుతుబ్షాకు తపతీ సంవరణోపాఖ్యానమును, అమీనుఖానునకు యయాతిచరిత్రమును కృతి నిచ్చుటయు, ఈకావ్యములలో మహమ్మదీయపాలకుల స్తోత్రములు మాత్రమే కాక, మహమ్మదీయ మతము కూడఁ గొంతవఱకుఁ బొగడఁబడుటయుఁ దటస్థించినది.

అమీనుఖానుని యుదార స్వభావ మాతని దానములు, అమీను పురములోఁ జెఱువుఁ ద్రవ్వించుట, సత్యచింతామణి పొట్లచెర్లలో మసీదుగట్టించుట వలననే కాక, హిందువుల యెడల నానితకిఁ గల యాదరమువలనఁగూడ వెల్లడి యగుచున్నది.

చ. కడక నమీనుఖానుఁడు జగంబు తనుంబొగడంగ, వేడ్కతో
విడువక యెప్పుడున్, బుడమి వేల్పుల బిడ్డలఁ బెండ్లిచేయఁగా,
నడరెడు బీతుఁ బోఁ బొడమ, నందు కతంబునఁ గాదె దూఱఁబే
రడవులలోపలన్ దబసిరై కనుపట్టెడు గాలిచూలి యుక్తా.

పయినఁ జెప్పిన విధముగా బ్రాహ్మణవటువుల కమీను ఖానుడు బెండ్లిండ్లుఁ జేయించుటయేకాక,

క. అబ్బురమై పొలుపొందెడు కబ్బంబులు చాలనందికనిరూనసంబుల్
నిబ్బరముగఁ బొడమెడు పేరుబ్బున నల్లడల జాణ లాహా యనఁగన్.

దీనివలన ఆతనిభాషాసేవ ప్రకటిత మగుచున్నది. అమీను ఖానుని యభిరుచులును, ప్రజాసేవయు నింకను వర్ణింపఁబడినవి.

సీ. మారేళ్లు నేరేళ్ళు మామిళ్ళు జిన్నలు మాదీఫలంబులు దూదినిమ్మ
లీడెలు మేడులు జీడులు దాడింబ లనఁపటులు నసలు చనుపకములు
పొగడలు పొన్నలు పోకమ్రాఁకులు కమ్మరేమలు నిమ్మలు రేగు లిప్ప
లంబాళములు కజ్జూరంబు లనాసలు నాడికదంబలు నారదబ్బ
లగరు లేలకి విరజాది యాకుఁదీఁగె మల్లియలు గొజ్జఁగులు దాక మొల్ల మొగిలి
మొదలు గానివియెప్పుడు బూచి కాచియుండు తోఁట లమీనుఖానుండు నిలిపె.

ఆ. గీ, ఏచి నని చిప్పూచి కాచి పండిన యమీన్పురము మేలితోఁట లరసి కాంచు
ముసలివారికైనఁ బసిబిడ్డలకునైనఁ బండ్లు వచ్చు నలరుఁ బ్రాయమొదవ.

క. చలిపందిరులును, సత్త్రువులు, నూతులు, బావులు, బువుం దోఁటలుఁ జె,
ర్వ్వాలు, నల్లిండ్లును మొదలుగ నిలిపి యమీనుఖానుఁడసమూనించెంబుడమిన్.

దీనివలన అమీనుఖానునకు తోఁటలు వేయించుట చాల నిష్ట మనియు, ఆతఁడు బాటసారులకుఁ జాల సౌకర్యములు కలుగఁ జేసె ననియు గ్రహింపవచ్చును.

## అమీనుఖానుని భార్యలు.

అమీనుఖానుని వలెనే ఆతని భార్యలు కూడ ప్రజానురంజ కముగ నడుచుకొన్నట్లు వర్ణింపఁబడినది. అమీనుఖానుఁడు ముగ్గురను బెండ్లియాడెను. బడేబీబీ, సెక్కర బీబి, సెమ్మబీబి యని వీరి ముగ్గురి పేళ్లు. వీరిలో బడేబీబీ

సీ. అత్తవారిండ్లకు నరుగు కన్నియలకుఁ గట్నంబు లిచ్చుచు గారవించుఁ
బ్రొద్దుపొద్దున నెవ్వెప్పుడు లేచివాడల పసిబిడ్డలకుఁ బాలుపోయు
నాఁకొన్నవారల కద్దమరేయైన నారగించఁగఁ బెట్టు నాసి యరసి
పాలుసీకనసిన బాగునఁ బెనిమిటి తలఁపులో మెలఁకువ మెలఁగనేర్చు
నార తన పుట్టినింటికి నత్తవారియింటికిని వన్నెఁ దెచ్చెఁ దుఁటువిల్తు
తల్లివంటి బడేబీబీ దరామె పొగడఁదమ్మి పూవింటనెల కొన్నదంటమైన.

తాను గొప్పయుద్యోగస్థుని భార్యయైనను, బడేబీబి ప్రజాక్షేమమునకై స్వయముగా నెట్లు పాటుఁబడు చుండినది పయిపద్యమువలనఁ దెలియు చున్నది కదా! అమీనుఖానునివంటి మహమ్మదీయప్రముఖులును, బడేబీబీ వంటి మహమ్మదీయ నారీరత్నములు గల గోలకొండ రాజ్యములో వీరికి వందసంవత్సరములు తరువాత, సుల్తాను వద్ద అక్కన్న, మాదన్నలవంటి బ్రాహ్మణులే ముఖ్యమంత్రులుగాఁ బనిచేయుటలో నాశ్చర్య మేమి యున్నది?

అమీనుఖానునకు బడేబీబీ వలన, గతాత్‌ఖానుఁడు, ఫాజీలఖానుఁడు అను యిర్వురు పుత్రులు కలిగిరి. రెండవభార్యయైన సెక్కరబీబీ వలన యబ్దుల్లీ షేకీభరాములను మరి యిర్వురుపుత్రులును, మూఁడవ భార్యయగు సెమ్మెబీబీ వలన అబ్దుల్ కరీమను పుత్రుఁడును గల్గిరి.

## అమీనుఖానుని కొమారులు – వారి పరాక్రమము.

పొన్నికంటి తెలగన్న అమీనుఖానుని కొమారుల పరాక్రమముల వర్ణించుటలో, ఆనాఁటి దేశచరిత్రమును జాల వెల్లడించియున్నాఁడు. ఒక్కగోలకొండ వ్యవహారములు మాత్రమే కాక ఆనాఁటి హిందూదేశచరిత్ర కూడ కొంతవరకీపద్యములలో నిమిడియున్నది. అమీనుఖానుని పెద్దకొడుకైన గతాత్‌ఖానుని పరాక్రమము క్రింద వర్ణింపఁబడినది.

సీ. నెఱపలుకు నెరవులనే చాల మెప్పించి యక్బరుచే మెప్పులందు కొనియుఁ
జని విశ్వనాథ దేవుని చేత మస్తున వెలయు నేస్తులఁ దెచ్చె వేన వేలు

పూనికి నేదులాఖాను వీటికి నేగి పలుమఱు మించు కప్పములు గొనియె

మాదనమల్క బరీదునిజాంశాహు, దన యేలికనుఁ బన్నుఁ బనుపనఁడచే

మఱియుఁ గన్నడరాజులు మెఱసి పొగడినెనరు సభుకొత్తఁ గ్రొత్త కానుకలుబనుప

మనియె మల్కిభరాము మన్ననఁ గతాతఖానరాయఁడు రెండవ కలువ రేఁడు.

సీ. తల్లిదండ్రి లేమాట తనకాన తిచ్చినఁ దలమోచి నడుచు గతాతఖానుఁ

డిభరాము పాదుశాయేలెడు పుడమిలోఁ దగవులరాజు గతాతఖానుఁ

డల చిన్నిపాయఁబునందు రాజుల చేతఁ దగునిమ్మపండు గతాతఖానుఁ

డేప్రొద్దు కూరిమి మెచ్చఁ గర్తారునిఁ దలఁపులోనిలుపు గతాతఖానుఁ

డరబి, పారసి,గుజరాతి యూరె మచ్చతెనుఁగు కన్నాజి మొదలుగాఁ దెలియవ్రాయ

దారిగన్నట్టి వాఁడు గతాతఖానుఁడహహా! యతనికి నెవ్వరీ డరసిచూడ ?

గోలకొండ రాజకీయ వ్యవహారములలో గతాతఖానుఁడు చాల ప్రముఖుఁడై యుండి, తనతండ్రిని మించినకీర్తిని సంపాదించుచుండె నని పయిరెండు పద్యములనుఁబట్టి మనము గ్రహింపవచ్చును. ఈగతాతఖానుఁ డాకాలములో ఢిల్లీపాదుషాగా రాజ్యముచేయుచుండిన అక్బరు పాదుషాను, తనవాక్చాతుర్యముచే మెప్పించి, ఆతనిమన్ననలఁ బడసినాఁడఁట! తెలుఁగుకావ్యములలో, మధ్యమయుగమున బయలుదేరిన వానిలో, ఢిల్లీపాదుషాలఁ బేర్కొనునవి యయాతిచరిత్రముతక్క మరి లేనట్లగ పడుచున్నది. అక్బరుపాదుషా ఢిల్లీ సింహాసనమునకు 1556 సంవత్సరమున వచ్చి 1605 వరకు పాలించియుండుటచే, తపతీసంవరణ కృతిపతియై గోలకొండను 1550 మొదలు 1581 వరకు బాలించిన మల్కిభరామునకును, ఆతని యాస్థానముననే యుండిన అమీను ఖానునకును సమకాలికుఁడు. అక్బరుపాదుషావద్దకు గోలకొండసుల్తానైన మల్కిభరాము గతాతఖాను నేసందర్భమునఁ బంపెనో స్పష్టముగఁ దెలియదు. ఢిల్లీపాదుషాలు దక్షిణ మహమ్మదీయ రాజ్యములను జయించునుద్దేశముతోఁ బ్రయత్నములు చేయుట, అక్బరుపాదుషానాఁటినుండియే ప్రారంభమైనది. ఢిల్లీ సామ్రాజ్యమునకును, గోలకొండకును, నడుమ రాయబారిగ గతాతఖానుఁడు నియమింపఁబడుటచే, నీతఁడు చాలసమర్థుఁడైన రాజకీయ వేత్తయై యుండవలెనని మన

మూహింపవచ్చును. 1565 లో విజయనగర సామ్రాజ్యము విచ్ఛిన్న మైనతరువాత, మహమ్మదీయ రాజ్యములు, తమరాజ్యములోని అంతః కలహములలో, ఢిల్లీశ్వరుని సహాయము వేడుటయు, తనసామ్రాజ్యము నీయవకాశములలో విస్తరింపఁజేయుటకై అక్బరు ఈతగవులలో జోక్య ము కలుగఁజేసి కొనుటయు చాలసారులు తటస్థించినది. మల్కిభరా ము 1581 లో మరణించక పూర్వము 1576 లో అక్బరు బేరారు అహ మ్మదునగరు సుల్తానుల కుటుంబకలహములలో కలుగఁజేసికొని, తన యుత్తరువులు నెరవేర్పఁబడక పోవుటచే, దక్షిణమునకు దండెత్తి వచ్చి నట్లు చరిత్ర తెలుపుచున్నది[1]. గలాతఖానుఁడక్బరును దర్శించిన దీసం వత్సరమునందేయై యుండును. ఇఁక గతాతఖానునకేనుగుల నిచ్చిన విశ్వనాథదేవు ఒరిస్సాప్రభువుగాఁ గనఁబడుచున్నాఁడు. తళ్లికోట యుద్ధము జరిగిన మరుచటిసంవత్సర మనఁగా 1566 సం. లో, రఫత్ ఖాన్‌లాహారీ యనువాఁడు గోలకొండనవాబగు ఇబ్రహీముకుతుబుషా యాజ్ఞానుసారముగా, సైన్యములతో బయలుదేరి రాజమహేంద్రవర ము మొదలుకొని ఖాసింకోటవరకుఁ గల ప్రదేశముల నంతను జయించె ను. తళ్లికోటకు పూర్వమే ఈతఁడు రాజమహేంద్రవరము వరకు జయించుకొని వచ్చినను, 1565 సం. మహమ్మదీయ రాజ్యములన్ని యు నేకమైనప్పుడు విజయనగరవినాశమునకుఁ దోడ్పడుటకై వెను కకు బిలిపింపఁబడి, ఆయుద్ధమైన వెంటనే మరల తనదిగ్విజయమును పూర్తిచేయుటకు బయలుదేరెను. ఇట్లీతఁడు మరలబయలుదేరిన ప్పుడు రాజమహేంద్రవరమువద్ద పెద్దయుద్ధముజరిగి, వేదాద్రి, సీతా పతి అనువారల యాధిపత్యమున ఆప్రాంతములవారు గోలకొండ సైన్యముల నెదిర్చి నాలుగునెలలవరకు ముట్టడికాగిరి. తరువాత గోల కొండ సైన్యములలో లెక్కల వ్రాతకాడుగానున్న యొక పండితుని మూలమున యుభయపక్షములకు సంధిజరిగి, వేదాద్రి ఖాసింకోటకు న్ను, సీతాపతి విజయనగరమునకును, తమతమ కుటుంబములతో వెడలి పోయిరి. గతాతఖానుఁడీ దండయాత్రలో రఫత్‌ఖాన్ లాహారీ సైన్య ములలో నాతనికి లోబడిన యుద్యోగియై యుండవలయును. రాజ

1 గ్రిబ్బిల్, హిస్టరీ ఆఫ్ ది డక్కన్, సం 1.

మహేంద్రవరమును లోఁబరుచుకొని గోలకొండ సైన్యములు ఖాసింకోట వరకు చొరుచుకొని వెళ్లి ఒరిస్సాదేశము ప్రవేశించెను. చిన్నచిన్న జమీందారులు లోఁబడి గొల్లపిల్లి, వీరకూటము, దేవిపురము, చంద్రవరము మొదలగుస్థలములు పట్టుపడుటచే, రఫత్ ఖాఁ లాహిరీ ఆప్రాంతములలో బలవంతుఁడై యున్న విశ్వనాథదేవు మీఁదికి దాడివెడలి, పొట్నూరిలో ఆతని సోదరుని ఖైదీగఁ బట్టుకొనెను. తరువాత కొండదేవపిల్లికూడ గోలకొండసైన్యములకు లోఁబడెను. కాని యింతలోనే విశ్వనాథదేవు అయిదువేల గుఱ్ఱపుదళముతోను యేబదివేల కాల్బలముతోను, ఏనూరేనుగులతోను, ప్రతిఘటించెను; కాని యోడిపోయి, పారిపోవలసి వచ్చెను. తరువాత విశ్వనాథదేవు తనకొమారుని గోలకొండ సైన్యశిబిరమునకుఁ బంపి, సంధిఁజేసికొనెను. ఈసంధిషరతుల ననుసరించి, ప్రతిసంవత్సరము కొంతకప్పమును గోలకొండనవాబునకు తాను చెల్లించుటకును, నలువదియేనుగులను నవాబునకు కానుకగా నిచ్చుటకును, విశ్వనాథదేవు అంగీకరించెను. గతాత్ఖానుఁడు విశ్వనాథదేవు వద్దనుండి తెచ్చెనని వర్ణింపఁబడిన యేనుగులీసంధిప్రకార మొసంగఁబడినవేయై యుండును. ఈసంధి 1569 సంవత్సరములో జరిగినది.

గతాత్ఖానుఁ డేదులాఖాను వద్దకుబోయి చాలసారులు కప్పములు పుచ్చుకొనినట్లు కూడ తెలగన్న వర్ణించియున్నాఁడు. ఏదులాఖాను బీజపూరుసుల్తాను. తెలగన్ననాఁటి బీజపూరుసుల్తానుయొక్క పూర్తియైనపేరు ఆలీఆదిల్షా. ఈతఁడు 1557 మొదలు 1579 వరకు పరిపాలించి, ఇబ్రహీముకుతుబుషాకు రెండుసంవత్సరములపూర్వము మరణించెను. తల్లికోట యుద్ధమునకు పూర్వమును, అనంతరమునుకూడ, బీజపూరునకు, గోలకొండకును నిరంతరము పోరాటములు సాగుచుండుటచే, గతాత్ఖానుఁ డేయుద్ధానంతరమున బీజపూరుకప్పములు వసూ చేసెనో ప్రత్యేకముగ చర్చించుట యనవసరము. గతాత్ఖానునిచే ఏదులాఖాను మాత్రమేకాక, మాదనమల్కుబరీదును, నిజాంశాహును కూడ నోడింపఁబడినట్లు తెలగన్న వర్ణించినాఁడు. మాదనమల్కుబరీదు

బీదరుసుల్తాను కుటుంబములోనివాఁడు. బీదరుసుల్తానులు బరీదుశాలని పిలువఁబడుచుండిరి. నిజాంశాహు అహమ్మదునగర రాజ్యమేలుసుల్తాను. గతాతఖానుఁ డోడించిన కన్నడరాజులు విజయనగరపురాజులే. ఇన్ని యుద్ధములలో పాల్గొనిన గతాతఖానుఁడు గొప్పసేనాధిపతి కాకపోయినను చాలదేశములఁ జూచినవాఁడై, యనుభవనీయుఁడైన సైనికోద్యోగియై యుండి యుండును. గతాతఖానునకు పెక్కుభాషలలో ప్రావీణ్యముండుట కీదేశాటనమే యొక కారణమై యుండును. ఈదండయాత్రలలోను, యుద్ధములలోను, గతాతఖానుని వెనుకనే అమీనుఖానుని రెండవ కొడుకగు ఫాజిలాఖానుకూడ నేగుచున్నట్లు తెలగన్న వ్రాసిన పద్యముల వలన గోచరించుచున్నది.

ఇఁక అమీనుఖానుని రెండవకొమారుఁడైన ఫాజిలుఖాను కూడ తనయన్నగారైన గతాతఖానుని వలెనే రాజకీయవ్యవహారములలో చాల ప్రాముఖ్యత వహించి గోలకొండ నవాబుమెప్పొందుచున్నట్లే క్రిందిపద్యములలో వర్ణింపఁబడియున్నది.

చ. కని తను రాజు లెన్నుకొనఁగాఁ బెనుపౌజులతో సిరంగరా
యనికడ కేగి, మాటలనె యాయనఁ దేలిచి తెచ్చి, మల్కుకుబా
మనకువ నంటుచేసి, యొరిమం గడు మెచ్చులుగొన్న మేటి, నే
మని పొగడంగవచ్చు నవు నౌ నిఁక ఫాజిలుఖానరాయనిన్.

విజయనగరరాజైన శ్రీరంగరాయలకడకు చాల సైన్యముతో నేగి, యాతనిని గోలకొండకు మల్కిభరామునొద్దకుఁ గొనితెచ్చి, వారిరువురకును సంధిఁజేకూర్చిన ఫాజిలఖానుఁడు రాజనీతి చతురుఁడై యుండవలయును కదా! మల్కిభరామునకు సమకాలికుఁడై, విజయనగర రాజ్యమును 1574 మొదలు 1585 వరకుఁ బరిపాలించిన శ్రీరంగరాయలు, తల్లికోట యుద్ధమున నిహతుఁడైన రామరాజుయొక్క తమ్ముఁడగు తిరుమలదేవరాయల కొమారుఁడు. తల్లికోటయుద్ధానంతరము, తిరుమలదేవరాయలు తనరాజధానిని పెనుగొండకు మార్చుకొనెను. 1574 సం. లో విజయనగర సింహాసనమునకు వచ్చిన శ్రీరంగరాయలు, 1581 సం. లో మల్కిభరాముకుతుబుషా మరణించక

పూర్వమే తగవులలో ఫాజిలాఖానుని సైన్యములచే గోలకొండకుఁ గొని తేఁబడియెనో, అప్పుడు జరిగిన సంధి యేవిషయమై. జరిగినదో, తెలియుటలేదు. ఒకవంక అక్బరుపాదుషాను మెప్పించుటకై గతాత ఖానుని, మరియొకవంక శ్రీరంగరాయలతో సంధిఁజేసికొనుటకై ఫాజిలాఖానుని ఇబ్రహీమ్ కుతుబుషా పంపుటఁజూడ, ఈతఁడు దనపరిసరములనున్న తోడి దక్షిణమహమ్మదీయరాజ్యములతోఁ బోరాటములలోఁజిక్కుపడి, అక్బరును శ్రీరంగరాయలను స్నేహితులుగఁ జేసికొన యత్నించుచున్నట్లు దోఁచుచున్నది.

ఇబ్రహీముకుతుబుషా, తాను రాజ్యమునకు రాకపూర్వము, తన యన్నయగు జామ్షీదుకుతుబుషాకుజడిసి, కొన్ని సంవత్సరములు విజయనగరములో నుండియుండుటచే, ఆసంవత్సరములలో ఆతనికచ్చట రామరాజభూషణుఁడు మున్నగు కవుల సహవాసము లభించి, తనుస్వాలమున ఆంధ్రభాషాభిమానము కల్గిన దని వీరేశలింగముగారు వ్రాసి యున్నారు. ఇబ్రహీమ్కుతుబుషాయును, ఆతని ఆస్థానపు టుద్యోగి యగు అమీనుఖానుఁడును ఆంధ్రప్రబంధముల గృతినందుటకిది యొక కారణము కావచ్చును. తన్ను రక్షించిన విజయనగరరాజులకు వ్యతిరేకముగా ఇబ్రహీముకుతుబుషా తాత్కాలికముగా తల్లికోట యుద్ధములోఁ బోరాడినను, పూర్వస్నేహమును బట్టి తరువాత కొద్ది సంవత్సరములలోనే విజయనగరము రాజైన శ్రీరంగరాయలతో సంధిచేసికొనుటలో నాశ్చర్యము లేదు. ఫాజిలఖానుఁ డీసంధిని పొసగించుటలోనేకాక, యితర విషయములఁగూడ రాజసేవను కీర్తికరముగఁ జేయుచున్న ట్లగుపడుచున్నది.

సీ. మది లోఁగి యల నిజామనమల్కు పెట్టిన పల్లకీ లొకవంక బాగుమీఱ
ఉదిరి యేదులఖానుఁ డొసఁగిన పైగోవగుఱ్ఱముల్ బడివాఁగ గొల్చిరాఁగ
వేడుకతో నేడు మాడెలవారలు కానుకలంపినట్టి యేనుఁగులు బెరయ
కన్నడరాయఁడు మన్నించి యంపిన ముత్తేల పైత్లైల హత్తిమెఱయ
తే. వచ్చితెచ్చిన సొమ్ములు మచ్చికలర నిచ్చి యిభరాము శాహుచే మెచ్చుగనియె
నట్టిఫాజీలు ఖానరాయనికి సాటిగలరె నేర్పరులెల్ల జగంబులందు.

అహమ్మదునగరముసుల్తాను నగు నిజామునముల్కు వద్దనుండి పల్లకీలను, బీజపూర్ సుల్తానగు ఆదీల్ ఖాను వద్దనుండి పెగూదేశము నుండి తెచ్చిన గుఱ్ఱములను, ఒరిస్సాదేశపు సరిహద్దులలోనున్న యేడు మాడెములయొక్క పాలకులనుండి యేనుగులను, విజయనగరరాజు వద్దనుండి ముత్యముల పెట్టెలను, ఫాజిలఖానుఁడు దెచ్చుటవలన గోలకొండవైభవము వెల్లడియగుటయే కాక, పెగూదేశమునుండి పోర్చుగీసువారు దిగుమతిచేసి దక్షిణరాజ్యములలో వర్తకము చేయుచున్న గుఱ్ఱములు శ్రేష్ఠములుగా నెన్నఁబడుచున్నట్లగుపడుచున్నది.

ఇఁక అమీనుఖానుని రెండవభార్య సెక్కరబీబికొడుకులలో పెద్దవాఁడైన అబ్దులల్లీనిగురించి యీక్రిందిరీతిని తెలగన్న వర్ణించినాఁడు.

సీ. తనరూపు వలయందుఁ దలిరాకుబోఁడుల కనుఁదళ్కుజేడిపగములు దగులఁ
దనచాగ మనుమబ్బు మొనవేఁడువారను చినుకుమేపుడు పుల్గులెనసి పొదలఁ
దనయశోఁగు దమ్ములను రాచనెట్టెంపుఁ బలుగిండి రాతుమ్మెదలు మెలఁగఁ
దనపరంజీ చిల్వకును మార్తులా కొండ్ల యనురు గాడుపు లింపు లాపఁగుచుండ

తే. నౌనరునిభరాము పాదుశాహుజారునందు బొందుగా వ్రాయనేర్చిన ప్రౌఢయైన
యబ్దులల్లికి నీడెవ్వరరసిచూడ నహహ గొనముల నతనికి నతఁడె తగును.

క. అరబీ, పారసి, కన్నడ, మరుమీ, కస్మాజి, తెనుఁగు, మొదలగుబాసల్
పరికించి కుతుబుశాతలఁ పరయుచుఁ బొలుపొందు నబ్దులల్లీ పుడమిన్.

అబ్దులల్లీ తనయన్నలవలె గోలకొండపీడి పరరాజులమీఁదికి సైన్యముల నడిపికాని, రాయబారములు నడిపికాని, స్వాతంత్రబాధ్యతతోఁ గూడిన ఘన కార్యములుచేయక, మల్కిభరాముశా "హజారు" నందే లేఖకుఁడై యుండి, తన సవితియన్నయగు గతాతఖానుని వలెనే బహుభాషాప్రావీణ్యుఁడై యుండెను. అబ్దులల్లీ విలువిద్యను గురించి యొకపద్యములో వర్ణింపఁబడినదికాని, ఈతఁ డానాఁటియుద్ధములలో నాయకత్వము వహింపలేదని చెప్పవచ్చును. ఈతనితమ్ముఁడైన మేకిభరాముకూడ అంత ప్రాముఖ్యత కెంకను వచ్చియుండక పోవుటచే, తెలగన్న ఆతనిని శూరునిగామాత్రము వర్ణించి యూరకొన్నాఁడు.

అమీనుఖానుని మూడవభార్యకొడుకైన అబ్దులకరీ మీఁటీరునఁ బ్రశంసింపఁ బడినాఁడు.

సీ. మాటనేర్పున రాజు మనెఁగూత్రనిండఁగా నలరించునెప్పు డబ్దులకరీము
వలఁజనికైవడిఁ దలిరాకు బోఁడుల నలపించు జాణఁ డబ్దులకరీము
పారసి యరబులేర్పడ వ్రాయఁగాఁదువంగ నణప తలంప నబ్దులకరీము
అడుగువారలకు లే దనుమాట తనమదిఁ దలఁపఁ డెన్నఁడును నబ్దులకరీము
తే. మించి యిభరాముశాహు మెప్పించిమేలు తగటుదట్టీల్ కుళాయీలుపొగరుమిగులు
గుఱ్ఱములు నందలమ్ములు గొడుగు గాంచి,కలిమి పొగడొందెఁ బుడమి నబ్దులకరీము.

దీనివలన అబ్దులకిరీము పారసి, యరబి భాషలలో పండితుఁడని తెలియుచున్నది. మల్కిభరాము తనికిఁ జేసిన సత్కారము లానాఁటి గోలకొండ రాచమర్యాదలను ప్రకటించుచున్నవి.

ఇట్లు తనఅయిదుగురు కొడుకులును ప్రభుత్వములో గొప్పగొప్ప యుద్యోగములలో నుండగా, అమీనుఖానుఁడు దనవృద్ధాప్యములో తోఁటలు వేయించుచు, చెఱువులఁ ద్రవ్వించుచు, మసీదులఁ గట్టించుచు, చలువపందిరులఁ బెట్టించుచుఁ దనయేలిక యగు మల్కిభరామువలెనే ఆంధ్రభాషయం దాసక్తిఁ గలిగి, మరింగంటి అప్పన్నగారివంటి హైందవోద్యోగులతోను, పొన్నికంటి తెలగన్నవంటి ఆంధ్రకవులతోను, విద్వద్గోష్ఠిలో శాంతముగా దినములను వెళ్లఁబుచ్చియుండవలయును. తెలగన్న ఈతనికొమాళ్లను గురించి "మఱియు మెఱయుసిరులకు నెలవై, తమపేరుండైన హాజరతిమోఖి దుంజిఖాదిని యడుగు దమ్ములు తలంపులో నెలకొల్పఁగ తాతఖానుండును, ఫాజీలుఖాన యొడయుండును, నబ్దులల్లీ రాయుండును, నబ్దులకరీమును, వీరలకుఁ గూరిమితమ్ముండైన తసీరునిహాజరతి శేఖు బుదురుదిఖాదిరని మదిందలంచు శేఖిభరాముండును దనర్చిరి." అని కూడ వ్రాసియున్నాఁడు. ఇట్టి కుటుంబమునకు పెద్దయైన అమీనుఖానుఁడు, తెలగన్న వ్రాసినట్లు

ఉ. ఇట్టి కొమాళ్ళు, రాసిరుల హెచ్చుఁగ మించినప్రోడ యేలికై
పట్టపుఱేండ్ల మ్రొక్కఁగని పాటిలునాయిభ రాముశాహుచే
పట్టి, యనుంగుగా నతుపఁ, బాయక మూడుతరాలనుండి క
న్పట్టు నమీనుఖానుఁడు రపంబున మించె నసంబు కల్మిచేన్."

అమీనుఖానుని కుటుంబము గోలకొండ రాజసేవలో నూూడు తరములనుండి యున్నట్లు దీనివలన స్పష్టమగుచున్నది. ఇటువంటి యుద్యోగీయ కుటుంబము లనేకములు తరతరములనుండి సేవఁజేయుచు మల్కిభరాము నొద్దనుండుటచేతనే ఆనాఁటి గోలకొండను తెలగన్న ఈతీరున వర్ణించి యున్నాఁడు.

సీ. తెలుఁగంటి దొరరాల తెగలఁ దీఁటినకోట నిగనిగల్ నలుఁగడల్ నిండియుండు
దమ్ములవిందురా కొమ్మలదగదగల్ వేలుపుఁ బ్రోలిర్లు విరియఁజేయఁ
గొత్త శంబులకెంపు క్రొత్తడంబులరంగు నింగికిఁ దోపు వన్నియలునింపఁ
గడలియగానని చిల్వపడఁతి బాలగడిత తెలినీట నేత్రోద్దుఁ గలిసియుండ
తే. మిసిమి బంగారుమేడల మీఁదియెడల నిడిన ముత్యాలఁ జుక్కలుఁ దడఁబడంగ
దేశియకల్లరు వెలుఁగంద నలరునెపుడు మేలువజ్జీర్ల గమికొండ గోలకొండ.

ఇందు గోలకొండకోట, కోటకొమ్మలు, బురుజులు, కోటచుట్టునున్న యగడ్త, యతిశయముగా వర్ణింపఁబడినను, ఆనాఁటి గోలకొండ వైభవమును జాటుచునే యున్నది. గోలకొండ, వజ్రములు మున్నగు గనుల కానాఁడే చాల ప్రసిద్ధికెక్కియుండెను. తల్లికోట యుద్ధానంతరము ఇబ్రహీము కుతుబ్షా దక్కను యుద్ధములలో నంతగా జోక్యము పుచ్చుకొనక, తన దేశము నభివృద్ధిఁ జేసికొనుటలో కాలము నంతయుఁ గడుపుచుండెననియు, గోలకొండకోట మరల క్రొత్తగా కట్టఁబడి, బలమైనదిగాఁ జేయబడుటయేకాక, కోటలో ననేక ఉన్నత హర్మ్యములు నిర్మింపఁబడెననియు, చరిత్రకారుఁడగు గ్రిబ్బిల్ వ్రాయుచున్నాఁడు. ఆనాఁటి తెలుఁగుదేశము, ఈజిప్టు దేశమువలెనే ప్రపంచమునకంతకును వాణిజ్యస్థలమైనదనియు, తుర్కిస్థానమునుండి, అరేబియానుండి, పెర్షియానుండి వర్తకులువచ్చి తమసరకుల నమితముగా నమ్ముచుండుటచే క్రమముగా వారిసంఖ్యయు, రాకలు హెచ్చుచున్నవనియు ఫెరిష్టా వ్రాయుచున్నాఁడు. అందుచే కోటయొక్క "నిగనిగల"ను గురించియు, కోటకొమ్మల "దగదగ"లను గురించియు, బురుజుల "తోపువన్నియ"నుగూర్చియు, అగడిత "తెలినీటిని" గూర్చియు, "మేడల"గూర్చియు తెలగన్న వ్రాసినది కొంతవరకు నిక్కువమే.

యయాతి చరిత్రమును జదివినవారికి కథాభాగములో కూడ ఆనాఁటి ఆంధ్రుల ఆచారములు, వారియాటలు, పాటలు, అప్పటి గోలకొండ పురవైభవము, నాటిదుస్తులు మొదలగువానిని మనసులో నుంచుకొని తెలగన్న చేసిన వర్ణనలు పెక్కులు గాన్పించును. కవిత్వ విషయములో నిది కూచిమంచి తిమ్మకవి అచ్చతెనుఁగు ప్రబంధముల మించినదని వీరేశలింగము గారే వ్రాసియున్నారు. చారిత్రకముగానిది ఆంధ్రుల సాంఘికచరిత్రను వ్రాయుటకు చాలఁ దోడ్పడుచున్నది. ఇట్టి కావ్య సంతానమునుఁ బడసిన అమీనుఖానుఁడు దాను ధన్యుఁడగు టయేకాక, ఆంధ్రదేశమునకు చాల యుపకారము చేసినవాఁడని చెప్ప వచ్చును. దక్షిణమున హిందూమహమ్మదీయ వైషమ్యములు నేఁటి కిని పెచ్చుపెరుగక పోవుట కీ యమీనుఖానులవంటి యుదారభావ ములు కలవా రుండుటయే యొక ముఖ్యకారణము.

రాజమహేంద్రవరము. అడవి శంకరరావు.

# ప్రమాణవిచారము.

## ౧ ఉపోద్ఘాతము.

ఈ పనిచేయవచ్చును, చేయరాదు అనేజ్ఞానము మనుష్యులతో పాటు పశుపక్ష్యాదులకును గలదు. అది రెండువిధాలు. 1 తాత్కాలికము. 2 భవిష్యత్కాలికము అని. ఇందు మొదటిది—పచ్చగడ్డి పండ్లు, గింజలు మొదలగువాటిని జూచి వాటిని దిన నూహించుటయూ, ఎవరైనా తమను బాధించేవా రున్నారేమోయని యిటునటు చూచి తిన నూహించుటయూ. రెండవది—వర్షాకాలము వచ్చునని గూళ్లుకట్టి ఆహారపదార్థముల నిలువాచేయుట మొదలగునవి యూహించనగును. ఇది మనుష్యులకు గూడ కలదగుటంబట్టి సామాన్యజ్ఞానమున్నూ సహజమున్నూ అనవచ్చును. దీనిని లౌకిక జ్ఞానమని కూడ అనవచ్చును.

## ౨ అలౌకికజ్ఞానము.

సామాన్యజ్ఞానముకంటె భిన్నమయినదియు, సర్వప్రాణి సాధారణము కానిదియూ ఇంకొకటి మనకుకలదు. ఈజన్మమందే అత్యంత దూరముగా నున్న ఫలమునకుగాను ఇప్పటినుండి ప్రయత్నముచేయుట; పరలోకమునందును జన్మాంతరమందునూ కలుగఁబోవు ఫలముల కీజన్మమున బ్రయత్నించుటయూ జూడఁగా మనుష్యులకు అలౌకికజ్ఞానమని యొకటి గలిగినట్టు ఊహించవలసియున్నది.

ఈ అలౌకికజ్ఞానము మనకుఋషులు కనిపెట్టి చెప్పినశ్రుతిస్మృతిపురాణములద్వారాను మఱింత హెచ్చగును. కావున వాటి ప్రమాణమును విచారించ నవసరము వచ్చినది. ప్రమాణములను తత్తారతమ్యమును జెప్పుటకుముందు మీాదజెప్పిన ఉభయవిధజ్ఞానములకునిన

యమగుట వల్ల కర్మలను వాటి భేదమును జెప్పుట అప్రసక్తముకాదు.

## 3 కర్మలు—తద్భేదము.

దృష్టఫలకములు, అదృష్టఫలకములు అని కర్మలు రెండువిధములు. ఈజన్మమందే మనము ఫలము అనుభవింప వీలగునవి దృష్టఫలకములు, పరలోక జన్మాంతరముల ఫలించునవి అదృష్టఫలకములు. దృష్టఫలకములు రెండువిధములు—లౌకికజ్ఞానవేద్యములు, అలౌకికజ్ఞానవేద్యములు అని. అందుమొదటి వాటిఫలము సర్వవేద్యము—అన్నముతింటె ఆకలితీరును—స్త్రీపురుష సంయోగమువల్ల సంతానము పుట్టును. రెండవతీరువి—పాలూఅన్నము తినినపూట చేపలుతింటే అప్పటికి రుచిగానున్ననూ కాలాంతరమున రోగము కలుగజేయునందురు; పంచదార ఎక్కువతింటే కాలము మళ్లినపుడు సుఖవాసులకు బహుమూత్రవ్యాధి పట్టుననుట మొదలగునవి.

అదృష్టఫలకము లెప్పుడూ అలౌకికజ్ఞానవేద్యములే.

| కర్మలు | ఫలములు (దృష్ట) | |
|---|---|---|
| 1 వివాహము | ధర్మసంపద, ప్రజాసంపద | అలౌకికజ్ఞానవేద్యము. |
| 2 చెఱువులు త్రవ్వించుట, సత్త్రవులు వేయుట | భూతతృప్తి (లేక) పరోపకారము. | ,, |
| 3 పిల్లలు బుగ్గిలోనాడుట | కడుపులోపాములు పట్టుట | ,, |
| (బుగ్గిలో వానపాములు మొదలగువాని గ్రుడ్లుండి ఆటసమయమున గోళ్లలో చిక్కుకొని భోజనసమయమున కడుపులోనికి పోవును.) | | |
| 4 కలరాపురుగులు గల నీరు త్రాగుట | రోగము | ,, |
| 5 నిత్యస్నానము... | శరీరమలత్యాగము; | లౌకికజ్ఞానవేద్యము |
| | ధాతుసామ్యము. | అలౌకికజ్ఞానవేద్యము |

| కర్మలు | (అదృష్ట) ఫలములు | |
|---|---|---|
| 1 యజ్ఞముచేయుట | స్వర్గము | అలౌకిక జ్ఞానవేద్యము |
| 2 బ్రాహ్మణహత్యాదులు | నరకము, జన్మాంతరమున రోగము | " |
| 3 మంత్రస్నానము | పాపమోచనము | " |

ఇట్లే ఇతరముల తెలియనగును.

ఇందుకొన్నిటికి దృష్టఫలములు గలచోట్ల అదృష్టఫలము కూడ జెప్పియున్నపుడు కర్మలుచేయుట యందు ఆభిముఖ్యము గలుగజేయుటకై యనియే చెప్పవలసియున్నది. "సంభవతి దృష్టఫలకత్వే అదృష్టఫలకల్పనా అన్యాయ్యా" అనుటవల్ల ఫలమీమాంసలో దృష్టఫలము గనుపించినపుడు అదృష్టఫలము గల్పించరాదు, అనితాత్పర్యము. ఈయర్థమునందే వచనాంతరము—"లభ్యమానే ఫలదృష్టే నాదృష్టఫలకల్పనా" అని.

మఱియు "ప్రపాస్తడాకాని చ పరోపకారాయ న ధర్మాయ" అని శాబరభాష్యము—(చలిపందిళ్లు) చలివిందరలు చెఱువులు పరోపకారము కొఱకు, ధర్మమునకు కాదు—ధర్మమనగా అదృష్టఫలమని అభిప్రాయమయి యుండును.

౪ శ్రుతిస్వరూపము.

ధర్మప్రమాణములలో శ్రుతియొకటి. "అష్టవర్షం బ్రాహ్మణముపనయీత"— ఎనిమిదేండ్ల బ్రాహ్మణబాలునకుపనయనము చేయవలెను. "జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత" స్వర్గముకోరినవాడు జ్యోతిష్టోమనామక యాగముచేయవలెను. శ్రుతియంటే వేదవచనము. వేదము ఋషులద్వారా వచ్చినదిగాని ఋషికృతము మాత్రముకాదు. కనుక అపౌరుషేయము. అది నిత్యము.

ప్రత్యక్షశ్రుతియని, అనుమానికశ్రుతియని శ్రుతి రెండువిధాలు. "అష్టవర్షం బ్రాహ్మణ" ఇత్యాదులు వినినంతనే ప్రకృతార్థము

స్ఫురించును, గనుక ప్రత్యక్షశ్రుతు లనబడుచున్నవి. ఆనుమానిక శ్రుతియంటే ఇప్పుడు మనము చూచిన వేదములో కనుబడకున్ననూ ఈయర్థముగల శ్రుతి పూర్వముండునని యూహించవలసినది. ఉదా. మనకు వివాహమంత్రమును బోధించు శ్రుతులు కనబడుచున్నవిగాని "వివాహము చేసుకోవలసినది" అనునది ప్రత్యక్షముగా గనబడ లేదు. ఐననూ అలాటిశ్రుతి పూర్వమందు ఉండియుండును. ఋషుల గ్రంథములలో విధులు కనబడుచున్నవి. లేకుంటే వివాహమంత్రములు వ్యర్థము లగును అని యూహింపవలసియున్నది. ఇట్టివి పురుషుల మయిన మనము కల్పించుటచే నిట్టివి పౌరుషేయము లందురు.

## ౫ స్మృతి స్వరూపము.

వేదభాష అందరికీ తెలియనికాలమున సర్వజనులకు సుగమమగు సంస్కృతభాషలో వేదోక్తధర్మములను బోధించుటకు ఋషులు రచించిన గ్రంథములు స్మృతులు. వీటిలో లోకక్షేమమునకుగా ఋషులు స్వాభిప్రాయములు గూడ వ్రాసిచూపిరి. స్మృతులను మనువు, పరాశరుడు, యాజ్ఞవల్క్యుడు మొదలగు ఋషులు వ్రాసినారు. ఇవి 18. వ్యాసుడు లౌగాక్షి మొదలగువారు వ్రాసినవి ఉపస్మృతులని మరి 18 అందురు.

స్మృతియనగా జ్ఞాపకశక్తి అని యర్థము. తమ అనుభము జ్ఞాపకముంచుకొని వ్రాసిన గ్రంథమగుటవల్ల స్మృతియనిపేరు పొందినది. పురుషనిర్మితములు కనుక స్మృతులు పౌరుషేయములు, అనిత్యములు. పురుషనిర్మితములైన వేదాంగములు కూడా స్మృతులనియే కొందరు శాస్త్రమున వ్యవహరింతురు. ఋషిప్రోక్తమైన తంత్రము స్మృతి అని అపుడు లక్షణము.

## ౬ ఆచార స్వరూపము.

ప్రాచీనులలోగాని ఆధునికులలోగాని శిష్టులనడవడికే ఆచారమనిపేరు. అదే శిష్టాచారమనబడును. అదిన్నీ ధర్మబోధకమే. ప్రాచీ

నుల చరిత్ర ఇతిహాసపురాణముల వల్ల తెల్లియుచున్నది గనుక పురాణములలోని కథా భాగములకు మాత్రము ఆచారమని పేరుపెట్టవచ్చును. "శ్రుతిస్మృతిపురాణేషు విరుద్ధేషు పరస్పరం, పూర్వంపూర్వం బలీయస్స్యాత్ ఇతిన్యాయవిదో విదుః"—అను శ్లోకములోని పురాణశబ్దార్థము ప్రాచీనుల యాచారమని చెప్పుట సమంజసమని తోచుచున్నది. కావున పురాణములలో గూడ ధర్మబోధక ప్రత్యక్షవిధి నిషేధ వచనములన్నిన్ని స్మృతులనియే చెప్పనగును. కేవల కథాభాగములు ఆచారపదవాచ్యములు గూడా కావచ్చును.

శిష్టాచారమనుటవల్ల శిష్టులంటే యెవరో చెప్పనలసియున్నది. "శిష్టాః ఖలు విగతమత్సరా నిరహంకారాః కుంభీధాన్యా అలోలుపా దంభదర్పలోభ మోహక్రోధవర్జితాః" కుంభీ అనగా మంటిపాత్ర, ధాన్యపుజాడీ. అంతమాత్రమే ధాన్యము నిలువాచేయవలెను. అధికము నిలువాచేసినపుడు శిష్టత్వమునకు కొఱతవచ్చునని తాత్పర్యము. తక్కిన పదముల అర్థము సుగమము.

## ౭ శ్రుతి ప్రామాణ్యము.

శ్రుతి తనంతతానే ప్రమాణము దాని ప్రామాణ్యమును ఇంకొకటి నిర్ణయింప నవసరములేదు. పురుషనిర్మితము గానందున అప్రామాణ్యహేతువులగు రాగద్వేషాదులు కల్పింపవీలులేదు. కనుక స్వతఃప్రమాణమనబడును. దీపము స్వప్రకాశమైనట్లే. దీపము ఇంకొకదానిని తెలియుటకు సాధనమగును. దీపమును తెలియుటకు మఱొక దీపముగాని మరివేరు పదార్థముగాని అవసరములేదు. తనంతతానే ప్రకాశించును. గనుక దీపేతరవస్తువులు పరప్రకాశ్యములయి యున్నవి

## ౮. స్మృతి ప్రామాణ్యము.

స్మృతి పౌరుషేయమగుటచే రాగద్వేషాదు లారోపించుటకు వీలున్నందున శ్రుతికి విరుద్ధమయితే ప్రమాణముకాదు. శ్రుతివిరోధములేనప్పుడు స్మృతిప్రమాణమే. దాని ప్రామాణ్యాప్రామాణ్యములు

శ్రుతినిబట్టి నిర్ణయింపబడుటచేత స్మృతి పరతః ప్రమాణమందురు. అయితే మాధవాచార్యుల వారు పరాశర మాధవీయములో-"ప్రామాణ్యస్య స్వతస్త్వాదప్రామాణ్యే కారణాభావాచ్చ స్మృతయః ప్రమాణం" అని స్మృతులకు స్వతఃప్రామాణ్యము గూడ నంగీకరించి యున్నారు. కాని ఆయంగీకార మన్నిటికీ కాదు. శ్రుత్యుక్తములయ్యును కొన్నికర్మలు దేశకాలాది పరిస్థితుల ననుసరించి స్మృతులలో నిషేధింపబడి యున్నవి. చూడండి —మనువు "కుర్యా ద్ఘృతపశుం సంగే కుర్యాత్పిష్టపశుంతథా। నత్వేవతు వృథా హంతుం పశుమిచ్ఛేత్కదాచన"= నేతితోగాని పిండితోగాని పశువును చేసి మఱీ యజ్ఞము చేయవలెగాని వృథాగా పశువునెపుడూ చంపరాదు. ఇక్కడ వృథా అనుదాని అర్థము ఏమి? యజ్ఞములేనికాల మందనియా? కాదు. అపుడు పశురూపము చేయవలసిన అవసరమేమి? పిండి నేయీ మనము ఇతరకాలములలో పశురూపము చేయనిదీ తినకూడదనియా? మఱేమి? మాంసాహారులు కాని ద్విజులయజ్ఞమందుకూడ సాక్షాత్పశుహింస చేయరాదనియే చెప్పవలెను. మాంసాహారు లయినపుడు వృథాపశుహింస అనబడదు. ఎవ రేయన్నము తిందురో దేవతల కదే యన్నమని ఇతరవచనములు కొన్నియుండుటవల్ల ఇట్టిస్మృతివచనములకు స్వతఃప్రామాణ్యమే చెప్పవలెనని వారియభిప్రాయమై యుండును. ఇట్టివే "అశ్వాలంభం గవాలంభం సన్న్యాసంపలపైతృకం, దేవరాచ్చసుతోత్పత్తిః కలౌపంచ వివర్జయేత్" అనువాటిలోని అశ్వాలంభగవాలంభ మాంసశ్రాద్ధాదిధర్మజ్ఞసమయములుకూడాను. కాని వీటిప్రామాణ్యము దేశకాలాది సాపేక్షము. కావున పరతఃప్రమాణములే యన నొప్పును.

మఱియు యాజ్ఞవల్క్యుడు "శూద్రస్త్రీని ద్విజుడు పెండ్లాడకూడదు. తానుసంతానరూపముగా పుట్టునుగనుక" ఉత్తమజన్మము నుండి అధమ జన్మము పొందగోరరాదని హేతువుచెప్పి మనువుమొదలగు ఋషులుండఋూ అంగీకరించిన శూద్రావివాహము అధర్మముగా పరిగణించి "నైతన్మమమతం" అని తనకిష్టము లేదన్నాడు. దీనికి స్వతః

ప్రామాణ్యము చెప్పవలసి ఉంటుంది. చెప్పిన హేతువు సరిగానచ్చి నపుడు ప్రమాణము కాదని యెవ్వరనగలరు?

## ౯ ఆచారప్రామాణ్యము.

శిష్టులకు రాగద్వేషాదు లుండవుగనుక వారి యాచారము ప్రమాణమే అయినను శ్రుతిస్మృతులకు విరుద్ధమైన యాచారము అప్రమాణమని కొన్ని వచనములున్నవి. ముస్ముం దుదాహరింతును. శ్రుతిస్మృతులలో అనుక్తములయి అవిరుద్ధములయిన వాటికి శిష్టాచారము ప్రమాణము. అనుక్తముల విషయమున స్వతఃప్రమాణమే. అయిననూ అవిరుద్ధములైనపుడే గ్రాహ్యమగుటచే పరతఃప్రమాణ మనవలసి వచ్చినది.

## ౧౦. ప్రమాణములతారతమ్యము. (ప్రబల దుర్బలభావము.)

(A) ప్రత్యక్షశ్రుతి:—రెండు ప్రత్యక్షశ్రుతులకు విరోధముగలిగినపుడు రెండూప్రమాణములే. "ఉదయించిన తరువాత హోమము చేయవలెను." అని ఒకశ్రుతి. "ఉదయించకముందే హోమము చేయవలెను" అని మఱొకశ్రుతిఉన్నవి. రెండూ ధర్మములే. "శ్రుతిద్వైధంతు యత్రస్యా త్తత్రధర్మా వుభౌస్మృతౌ" అని ప్రమాణము. ఇట్టి చోట వికల్పమందురు; సమానబలము లగుటచేత. (B) ఆనుమానిక శ్రుతి:—ప్రత్యక్షశ్రుతికంటె ఆనుమానిక శ్రుతి దుర్బలము. ప్రత్యక్షశ్రుతికి విరోధముగ ఆనుమానికశ్రుతిని గల్పించకూడదుగనుక. (1) ప్రత్యక్షశ్రుతి అపౌరుషేయము-ఆనుమానికము పౌరుషేయము కావుననూ (2) ప్రత్యక్షశ్రుతి స్వతఃప్రమాణము, ఆనుమానికము పరతః ప్రమాణముకనుకనూ, (3) ప్రత్యక్షము వెంటనే అర్థబోధకము, ఆనుమానికము ఒకవచనముయొక్క అర్థము అవగాహన చేసుకొన్న తరువాత దానిసబట్టి పిమ్మట కల్పించబడును (విలంబోపస్థితికము) కనుకనున్నూ ప్రత్యక్షశ్రుతికంటే ఆనుమానిక శ్రుతి దుర్బలము.

ప్రతీస్మృతివచనమునకున్నూ ఈయుక్తముగలశ్రుతివచనము ం

డునుకనుక యిది ప్రమాణమూ అని స్మృతికి ప్రామాణ్యము చెప్పన క్కరలేదు. ఒక్క అదృష్టఫలముల చోటనే దృష్టఫలమున్నచోట వాటి ఫలమును బట్టియే అవి ప్రమాణములగును. చూడండి శాబరభాష్యం" స్మృత్యధికరణము—"గ్రంథస్తు అనుమీయేత కర్తృసామాన్యాత్ స్మృతివైదిక పదార్థయోః" = శ్రుతులలోచెప్పిన పదార్థమునకూ స్మృతులలోచెప్పిన పదార్థమునకూ కర్త యొక్కరే అగుటవల్ల (ఒక్క చోటనుండే వచ్చినవిగనుక) స్మృతినిబట్టియీయర్థముగల శ్రుతి యుం డవచ్చునని యూహింపనగును అనిదాని అర్థము. అనిచెప్పి ఆయధిక రణము చివరను "తేన యే దృష్టార్థాః తే తత ఏవ ప్రమాణం. యేతు అదృష్టార్థా స్తేషు వైదికశబ్దానుమానం" = దృష్టఫలకములు వాటిఫ లములనుబట్టియే ప్రమాణములు. అదృష్టఫలకములకు మాత్రము వేద వచనము కూడా యీయర్థమునుండుం టుందని ప్రమాణముగా స్మృతిని దీసుకొనవలెను అని దానియర్థము అని నాకు తోచింది. పెద్దలుతత్వ మును నిరూపించనర్హులు. ఇట్లేల చెప్పవలసివచ్చిందంటే ఋషులు సర్వజ్ఞులుకారు. సామాన్య మనుష్యులకంటే అధికాలౌకిక జ్ఞానముగల వారనవచ్చును. సర్వజ్ఞత్వము పరమేశ్వరునికే గలదు. అట్లే కాకపోతే "శ్రుతిస్మృతివిరోధేతు శ్రుతిరేవ గరీయసీ" అని ఋషివచనమునకు ఋషులే దుర్బలభావమును జెప్పిరేల? మఱియు "ఋషయోఽపి పదా ర్థానాం నాంతం యాంతి పృథక్త్వశః, లక్షణేనతు సిద్ధానాం అంతం యాంతి విపశ్చితః" = ఋషులుకూడా ప్రత్యేకముగా అన్నిపదార్థ ములనూ కనుగొనలేరు. లక్షణముద్వారానే పండితులవలెనే తెలుసు కొందురు అని శ్లోకతాత్పర్యమయి యుండును. శాబరభాష్యం అ 2 పా 1, సూ 32.

3. స్మృతియనగా వేదవిజ్ఞానముగల ఋషులచే నిర్మితమైన గ్రంథమని చెప్పియుంటిని. శ్రుతికీ స్మృతికీ విరోధమువస్తే శ్రుతి బలీయము, స్మృతి దుర్బలము అని కూడ చూపితిని.

దానికి ఉదాహరణము- శాబరభాష్యం అ 6 పా 1 సూ 10,11, 12, 13, 14 లలో "భార్యాదాసశ్చ పుత్రశ్చ నిర్ధనా స్సర్వఏవతే,

యత్తే సమధిగచ్ఛన్తి యస్యతే తస్య తద్ధనం." = భార్యకూ, నౌకరీవానికీ కొమారునకూ, యజమానుని ధనమందు హక్కు లేదు. ఒకవేళ వారేమయినా సంపాదించినా అదివారియజమానునిదే అని అర్థము. ఇది స్మృతి. దీనికి విరుద్ధముగా- "పత్నీ వై పారిణాయ్యస్య ఈశే" = పత్ని ధనమునకు హక్కుదారురాలు అని యర్థముగల శ్రుతిఇది. ఈశ్రుతినిబట్టి మీాదిస్మృతి అప్రమాణమన్నాడు. దానికి హేతువులు కొన్ని భాష్యకారుడు చెప్పినాడు. ఎట్లన, స్వర్గకామము పత్నికికూడా ఉన్నది. ఉన్నపుడు యజ్ఞానికి అధికారముకలదై యుండవలె. ధనములేనివానికి యజ్ఞాధికారములేదు సోమవిక్రయము జరుగదుగనుక అనిన్నీ "ధర్మేచ, అర్థేచ కామేచ" అని దానకాలసంవాదమునుబట్టి కూడా ధనాధికారమున్నది అనిన్నీ, హేతువులు చూపించినాడు—"ఫలార్థినీహి సా స్మృతి ర్నాదరిష్యతే, స్మృత్యనురోధా దస్వా స్యాత్ –స్వవతీ శ్రుత్యనురోధాత్" = ఆమెకు ఫలమందు కోరికగలదు. స్మృతిని అనరించము. స్మృతి నాదరిస్తే ధనములేనిది కావలసివచ్చును. శ్రుతినిబట్టి ఆమె ధనముకలది అని అర్థము.

4. ఆచారప్రామాణ్యాము. "చోదితంతు ప్రతీయేత" అను జైమినిసూత్రము క్రింద భాష్యము అ1 పా3 సూ10 లో "యత్ప్రిమాణేనావిరుద్ధం త దవగమ్యమానం నన్యాయ్యంత్యక్తుం యత్తుశిష్టాచారః ప్రమాణమితి తత్ ప్రత్యక్షానగవతేఽర్థే" = ఏప్రమాణమునకూ విరోధవములేనపుడు, దానివల్ల ఫలము కనబడుచుండగా వదిలిపెట్టుట న్యాయ్యము కాదు. ప్రత్యక్షముగా ఫలము తెలియరాని కర్మలవిషయమునవే శిష్టాచారము ప్రమాణము అని అర్థము. అచటనే "ప్రత్యుపస్థాపిత నియమానా మాచారాణాం దృష్టార్థత్వాదేవ ప్రామాణ్యం" = ప్రత్యుపస్థాపిత=తెచ్చిపెట్టబడిన, నియమానాం=నియమములుగల, ఆచారాణాం=ఆచారములకు, దృష్టార్థత్వాదేవ=ఫలము కనబడుచున్నది కనుకనే, ప్రామాణ్యము (చెప్పనగును) అని దానియర్థము. కావున దృష్టఫలములయినపనులను వాటిఫలమును బట్టియే సంస్కర్తలు స్థాపింపనర్హులు.

శిష్టాచారమును పాటించ నవసరములేదు అని తాత్పర్యము వచ్చుచున్నది.

## ౧౧ శ్రుతిలింగ ప్రమాణతారతమ్యము.

ఈపదకొండవ ప్రకరణములో పరిభాషమూరును. చదువరులు సావధానులగుదురు గాకయని ప్రార్థితులు. ఇదివరకు శ్రుతిఅంటె వేదమని లోకసిద్ధార్థము. ఇప్పుడు వేదములోగాని స్మృతిలోగాని 'ఇది చేయవలెను, ఇది చేయరాదు' అని ప్రత్యక్షముగా చెప్పుటశ్రుతియని పారిభాషికము. "నిరపేక్షఃకంఠరవశ్శ్రుతి" యని ఆపదేవీయమునను, "శబ్దశ్రవణంశ్రుతి" అని శాబరభాష్యమునను చెప్పినారు. వైదికశ్రుతి స్మార్తశ్రుతి అనిచెప్పబడును. మృతాగ్నిహోత్రమున, పిత్ర్యదైవత్యమున "ప్రాచీనావీతీదోహయేత్" "యజ్ఞోపవీతీహి దేవేభ్యోదోహయతి" = పిత్ర్యదైవత్యమున ప్రాచీనావీతిగాను, దైవికమున యజ్ఞోపవీతిగాను దోహనముచేయవలెను. ఇది వైదికశ్రుతి. "భార్యాదాసశ్చ పుత్రశ్చ నిర్ధనాః" అన్నది స్మార్తశ్రుతి. లింగమంటే "అన్యపరంహీదం వచనం వాచోనిత్యతామనువదతి" అని శబరస్వామి వాక్యమువల్ల, ఒక అర్థమును ప్రతిపాదించు వచనమునందు నింకొక యర్థమునుకూడ స్ఫురింపజేయుశక్తి అనవలసియున్నది. "సామర్థ్యంలింగం" అనికూడా చెప్పియున్నది. దీని కుదాహరణము—మీద చెప్పిన "యజ్ఞోపవీతీ దోహయేత్" అను శ్రుతి వచనమునకు ముఖ్యార్థము దాని కిదివరకు చెప్పినదే. ఆయర్థమువల్ల దర్శపూర్ణమాసలలోనే యజ్ఞోపవీత విధానముకాదు పైతృకమున కూడా దైవకర్మలో ఉపవీతముచేయవచ్చును అనేఅర్థము స్ఫురించుచున్నందున ఆశక్తి ఆవచనమునకే కలదు. శావు ననే అ 3, పా 2, సూ 2 లో "సామర్థ్యంచ శబ్దైకదేశః" అని ప్రమాణవచనైకదేశముగా జెప్పినాడు. శ్రుతి లింగములలో లింగము దుర్బలము.

అయితే వేదముకంటె స్మృతి దుర్బలము. శ్రుతికంటె లింగము దుర్బలముగదా! మఱి వైదికలింగముకన్న స్మార్తశ్రుతి స్వరూప

మును బట్టి ప్రబలమా ఆశ్రయమును బట్టి దుర్బలమా? లింగము వేదము నాశ్రయించింది. శ్రుతి స్మృతినాశ్రయించింది. ఇట్టిచోట ప్రాచీన మీమాంసకులు ఆశ్రయబలమే బలమని యంగీకరించినట్లు కనబడుచున్నది. శ్రీమాధవాచార్యులవారు "మాతులస్యైవకన్యా" అనే వైదికలింగము నాశ్రయించి "మాతులస్య సుతాముాఢ్వా" అనే మాతులకన్యా వివాహనిషేధబోధకస్మృతి త్రోసివేసి మాతుల కన్యాపరిణయము శాస్త్రీయమని సిద్ధాంతించినారు. "వేదంకృత్వా వేదిం కరోతి, తుతే ఆచామేత్" అన్నపుడు కూడా ఆశ్రయమును బట్టియె స్మృతికి ప్రాబల్యముస్థాపించి శ్రుతివిహితక్రమమును త్రోసి వేసినాడు. అచట ఆచమనక్రియ పదార్థము. వేదకరణ, తదనంతర వేదికరణములు క్రియలే కావున పదార్థములై, ఆ రెండుక్రియల పౌర్వా పర్యమును వేదవచనము బోధించుచున్నది. పౌర్వాపర్యము అన్నది కాలరూపము. కాలమెపుడూ క్రియాంగముగాని ప్రధానముకాదు. అప్రధానమయిన కాలము నాశ్రయించింది కనుక వేదవచనమయ్యును దుర్బలమైనది. ప్రధానమైన ఆచమన క్రియారూప పదార్థము నాశ్ర యించుటచే స్మృతిప్రబలమయ్యె, ధర్మశాస్త్రమున ప్రమేయము ధర్మ ము. తత్ప్రవర్తక వచనము ప్రమాణము. "క్రియాయాఃప్రవర్తకం వచనంచోదనా" అని భాష్యము. కనుక చోదనాప్రవర్త్యముక్రియ. అదే ధర్మశబ్దవాచ్యము.

ఇట్లుండ నవీనమీమాంసకులు ప్రమాణబలాబలముకంటె ప్ర మేయబలాబలము శ్రేయమని ఆపదేవుడన్నాడని చెప్పి శ్రుతిలింగా దులు ప్రమేయములు కనుక స్మార్తశ్రుతికంటె వైదికలింగమే దుర్బ లము అని అనుచున్నారు. శ్రుతిలింగాలు చోదనైకదేశము లైనందున ప్రమాణములుకాని ప్రమేయములెట్లు? "ప్రమావిషయం ప్రమేయం" అనే ఇతరశాస్త్రమర్యాద ననుసరిస్తే సర్వమూ ప్రమేయమే. ధర్మ శాస్త్రములో అట్లుకాదు. వాక్యార్థజ్ఞానంలో లింగము శ్రుతివిషయ ములౌనందున ప్రమేయములైతే వాక్యార్థజ్ఞానము ప్రమాణమగును.

ఈశాస్త్రములో ప్రవర్తకవచనమే ప్రమాణము. తద్జ్ఞానముకాదే! సరే ఆపక్షమే అవలంబించినపుడు వైదికశ్రుతి స్మార్తశ్రుతి విరోధించినపుడు ప్రమేయబలాబల న్యాయమును బట్టి రెండూ తుల్యబలము లని వికల్పము చెప్పగలరా? ఇది విమర్శకులే నిర్ణయింతురుగాక. శ్రుతిలింగాలు ప్రమేయములైతే వాటికి ప్రమాణవచన మేది కావలెను? ఆప్రమాణవచన ప్రవర్త్యములేనా శ్రుతిలింగాలు? కావు. ప్రమాణవచన ప్రవర్త్యముధర్మము. ధర్మస్థానమునకు శ్రుతిలింగాదులు చేరవు. ధర్మ ప్రవర్తకములే.

ఈశ్రుతి లింగాదిన్యాయము అపూర్వప్రయుక్త కర్మలవిషయముననే ప్రవర్తించుననియు, అదిన్నీ అంగప్రధాన సంబంధమును నిర్ణయించు పట్టుననే యనియు మీమాంసకులందఱూ అంగీకరించిన విషయమే. కర్మలన్నీ అపూర్వద్వారాగానే ఫలించవలె నన్న నియమము లేదు. అందు యాగాదులే అట్టివి. తక్కినవి కావు. "సర్వేష్వప్యంగేషు అపూర్వప్రయుక్తత్వం వేదితవ్యం" అని ఉన్నది.

## ౧౨ ఉపసంహారము

### ఇందు శ్రుతిఅంటే వేదమనియే పూర్వవతు అర్థము

ఇట్లు ప్రబలదుర్బలభావము శాస్త్రములో కనుబడుచున్నపుడు రెండు స్మృతులు విరోధిస్తే వికల్పమే చెప్పవలెను. అట్లనక కొందఱు నవీనులు అన్నివచనములకూ ఏలాగో ఒకలాగు వ్యవస్థచేసి విరోధము పరిహరించుటకుగా ఏకవాక్యత (ఐకమత్యము) అని ఒకటి ఉండవలెనంటారు. వేరు వేరు కాలములలో వేర్వేరు ఋషులచే రచింపబడిన వాటికి ఐకమత్యమేల ఉండవలెను? ఋషులకు సర్వజ్ఞత్వమంగీకరించి ఐకమత్యము చెప్పుతామంటే ఆఋషులే వచనములకు ప్రబలదుర్బల భావమేల చెప్పుతారు? "మన్వర్థవిపరీతాతు యాస్మృతిస్సానశస్యతే" మనుస్మృతికి విరుద్ధమయినస్మృతి హీనబలమన్నారు. "శ్రుతిస్మృతి పురాణేషు విరుద్ధేషుపరస్పరం పూర్వంపూర్వం బలీయస్యాత్" అని

స్మృతికంటె పురాణానికి దౌర్బల్యమేల చెప్పవలెను? అన్నీ వేదార్థ ప్రతిపాదకములు కావు. స్వాభిమతములుకలవు. "నైతస్మమమతం" అను యాజ్ఞవల్క్యవచనము గూడ చూపించియుంటిని. ఇవన్నీ వారి మతమున నెట్లు సమాహితములగునో తెలియజాలకున్నాను. మాధవాచార్యులవారు ఒకస్మృతిని "బహుస్మృతి విరోధాదుపేక్ష్యం" అని అన్నారు కూడాను. విరోధమంగీకరించి వ్యవస్థచేయకనే త్రోసి వేసినారు.

స్మృతులు ఏకకాలికములు కాదని వేరుగా మరొకవ్యాసమున జూపుదును. ఏకకర్తృకములకే ఏకవాక్యత అవసరము. భిన్నకర్తృక పౌరుషేయములకేకవాక్యతచెప్పుట న్యాయ్యము కాదు.

గావున శ్రుతికంటె స్మృతి దుర్బలము. దానికంటె శిష్టాచారము దుర్బలము. దృష్టఫలములలో శిష్టాచారము పరిగణించ అవసరము లేదు. విజ్ఞులూహింతురుగాక.

పర్లాకిమిడి

బంకుపల్లి మల్లయ్యశాస్త్రి

# గజపతివారి హయాం

కీ. శే. బుక్కపట్నం రాఘవాచార్యులుగారు.

క్రీస్తుశకము పన్నెండవ శతాబ్దమధ్యభాగమందు (శ.౧౦౬౫) వుత్కళదేశమందలి కటకసంస్థానికులగు గణపతిగజపతి బాలభాస్కర గజపతి మొదలగు ఓఢ్రరాజులు తెలుగుదేశ మేలినారని యింతకు పూర్వము చెప్పబడియె. ఇప్పుడు తిరిగి ఆసంస్థానమువారే కొందరు రెడ్లహయాం ముగిసిన తరుణమున తెలుగుదేశ మాక్రమించుకొని సుమారు ౭౦ సంవత్సరములు ప్రబలముగా పరిపాలన చేసినారు.

ఈ సంస్థానికులు యీదేశ మేలుబడికి రావడము యిది మూడవతడవ యని తెలియవగి యున్నది. రెడ్లయనంతరము తూర్పునుంచి గజపతివారు వ్యాపించుకొని వచ్చినకొద్ది పడమటినుంచి నరపతివారు రాసాగిరి. వీరి యుభయసంస్థానికులకు తీరని కలత ప్రారంభమయి వీరిని వారు వారిని వీరు పలుసారులు ముట్టడించుచు నౌకరి సీమలు మరియొకరు పట్టుకొనుచు [రాగా] వైరము ప్రబలమయినది. తుదకు శింగభూపతి కపిలేశ్వరగజపతులనాడు శాలివాహన ౧౩౬౦–౧౩౭౦ (క్రీ. శ. ౧౪౩౮–౧౪౪౮) సంవత్సరముల మధ్య

---

[బుక్కపట్నం రాఘవాచార్యులుగారు వ్రాసిన 'తెలుగు దేశచరిత్ర' అనే గ్రంథములోనుంచి ఈ భాగం తీసి మాదిరికి ప్రకటిస్తున్నాము. రాఘవాచార్యులుగారు ఈ గ్రంథాన్ని చెన్నపురిరాజధాని కాన్సిలు మెంబరుగారగు డి. యస్. కార్తికలుగారి ఉత్తరువుప్రకారము వ్రాశారట. వీరు సంస్కృతాంధ్రపండితులు. కొంతకాలం గుంటూరు తాలూకా ఫస్టుక్లాసు రివిన్యూ ఇన్స్పెక్టరీ చేసి తరువాత డిప్యూటీ తహశీలుదారుగా కూడా పనిచేశారు. శాసనములూ మొదలైనవాటిని పరిశీలించి తెలుగు దేశచరిత్ర ఎవ్వరూ వ్రాయని కాలంలో ఈయన ౧౯౧౦వ సంవత్సరం లగాయతు ప్రకటింపబడ్డ శాసనాలూ గ్రంథాలూ పరిశీలించి ఈగ్రంథం వ్రాశారు. అందువల్ల మొట్టమొదట వ్రాయబడ్డ ఆంధ్రదేశచరిత్ర వీరిదే. అచ్చుకాకపోవడంవల్ల ఇది ఎవరికీ తెలియరాలేదు.] కో॥ రా॥

రెడ్డివారి తెలుగుదేశము గజపతివారి స్వాధీనములోకి వచ్చి శాలివాహన ౧౪౩౬-౧౪౩౭ (క్రీ. శ. ౧౫౧౪-౧౫౧౫) సంవత్సరముల పర్యంతము అవిచ్ఛిన్నముగా వారి యధికారములో నుండెను. ఈ లోగా మధ్యమధ్య తురుష్కరాజులు ముట్టడించుచు వచ్చినప్పటికి యీగజపతిరాజులు మహాశూరులై తగుబలస్తోమముతో ప్రతిఘటించి యుండిరి. గాన వారికి వశులుగాక మంచి...దేశమును వారి (అశ్వపతి[1]) స్వాధీనము కానీయరైరి. అశ్వపతివారికి వీరేగాక నరపతి వారును[2] అంతఃకలహములవలన గర్భశత్రువులుగాను, స్వీయులు అవశ్యజయ్యులుగాను నేర్పడిరి. ఇందువలనకూడ గజపతివారికి తెలుగు దేశముపై దీర్ఘకాలప్రభుత్వమునకు తిరిగి మంచి యవకాశ మేర్పడియె.

## దేశమేలు రాజుల కోవలనుగూర్చి

బెజవాడ కట్టించిన మాధవవర్మ సంతతివారగు రెండు కోవల గజపతిరాజులును రెడ్ల యనంతరము తెలుగురాజ్యము నేలినట్లు శాసనములవలన తేలినది. [గజపతుల కోవ లేవన*]

(౧) శింగరాజుకోవయు (౨) కపిలేశ్వరగజపతికోవయు. వీరిలో శింగరాజుకోవనుగురించిన శాసనములలో ఆయన పూర్వోత్తర పురుషుల పేరులు సవిస్తరముగా చెప్పబడి యున్నవి. కపిలేశ్వరుని [కోవలో ఆయన*] వద్దనుంచి మాత్రమే చెప్పబడి యున్నది. కాని కపిలేశ్వర గజపతి తండ్రి తాతలనుగురించి యెత్తుకోబడలేదు. అయి నప్పటికి ముందు దృష్టాంతదార్ష్టాంతికసమన్వయముగా కనుపర్చబోవు కథవలన యీరెండు కోవలవారు నొక్క మాధవవర్మ సంతతిలోని వారే యనియు, వీరు నుభయులు కలిసి రాజ్య మేలిరనియు, వారిలో

1. అశ్వపతులు=తురుష్కులు.

2. నరపతివారు=విజయనగరము రాజులు.

శింగభూపతియొక్క కోవకంటె కపిలేంద్రునియొక్క కోవవారు ప్రబలతలోకి వచ్చి ప్రఖ్యాతి కెక్కినవారైనారనియు తెలియనగు.

వీరు శాలివాహన ౧౩౫౧ (క్రీ. శ. ౧౪౨౯) లగాయతు శా. శ. ౧౪౫౦ (క్రీ. శ. ౧౫౨౮) వ సంవత్సరమువరకును ఆంధ్రదేశ మేలినారని కొండపల్లి కొండవీడు దండకవిలెలలో అందాజాగా[3] చెప్పబడి యున్నది. గాని వారి శాసనములవలన నది యందాజా పడిన గాని రూఢి యనుటకు వీలు లేదు; ఎందుచేతనంటే రెడ్ల శాసనములు దాదాపు ౧౩౬౬ వరకు కనుపించినవి. ఈకాలములోని గజపతిశాసనములు కనిపించలేదు. శా.శ. ౧౩౭౦-వ సంవత్సరము పిమ్మట నుంచి గజపతిశాసనము లుంచున్నవి. శాసనములు లేకపోయిన మాత్రముచేతనే శా.శ. ౧౩౫౦ లగాయతు ౧౩౭౦-వ సంవత్సరమువరకు వారి హయాం లేదని చెప్పవచ్చునా యనెడి సంశయము పుట్టును. అయితే యిందుకు రెడ్డిరాజు లీకాలమునం దుండినట్లు శాసనములు కాన్పించుటవలన ఆసంశయము నివారింపబడుచున్నది. ఇంతలోనున్న శాసనములవల్లనే యీకాలములో రెడ్లహయాం దైనందినక్షీణదశగా నుండెగదా వారిని జయించినవారు గజపతివారె గదా యనెడు నంశముునకు ఫక్తు రెడ్లహయాము శా. శ. ౧౩౬౬ వరకు వున్నదని చెప్పటమే అడ్డము వచ్చుచున్నది. కావుననే శాలివాహన ౧౩౫౦ వరకు రెడ్లహయాం తెలుగుదేశమున బాగావుండి అటుపిమ్మట సుమారు ౧౬ సంవత్సరములు గజపత్యాదిరాజుల తళ్లవలన నానాటికి తీశి కట్టుకు వచ్చెనని యిదివరకు చెప్పబడియె. ఈ విశిష్టసంగతులవలన గజపతిరాజులు శాలివాహనశకం ౧౩౫౦-వ సంవత్సరముపిమ్మట తెలుగుదేశము పుచ్చుకోవడముకు ప్రయత్నములు జరిగించి పలుసారులు రెడ్లమీదికి వచ్చుచుండి ఆఖరుకు శాలివాహన ౧౩౬౦-౧౩౭౦ సంవత్సరములలో రెడ్లదేశ మంతయు ఆక్రమించినారని స్పష్ట

---

౩. అందాజాకు స్థిరముగా అని సుమారుగా అని అర్థమున్నట్లు తోస్తుంది.

మగుచున్నది. కావున దండకవిలెలలో గజపతివారు యుద్ధార్థముగా నైనా యీ దేశములోకి కాలుపెట్టినది లగాయతు గణనచేసి వారి పునఃప్రభుత్వప్రారంభము శా. శ. ౧౩౫౦ నుంచి యైనదని అందాజాగా వ్రాయబడినట్లు వూహించ దగియున్నది.

శాలివాహన ౧౪౫౦ వరకు గజపతివారి ప్రభుత్వము తెలుగు దేశములో నుండెనని చెప్పే దండకవిలెయు అందాజా అనే చెప్ప వలెను. ఎందుచేతనంటే శాలివాహన ౧౪౩౬-౧౪౩౭ సంవత్సరములలో (క్రీ. శ. ౧౫౧౪-౧౫౧౫) యీగజపతివారిని పూర్తిగా జయించి యాంధ్రమండలమేగాక వారి కళింగదేశ మంతయుగూడ కృష్ణదేవరాయలు తీసుకొన్నట్లు నె...రు శాసనమువలన విస్పష్టము కాబోవుచున్నది. గనుక [గజపతుల లోబడి*] శాలివాహన ౧౪౫౦ వరకు అని చెప్పుటకు వీలులేదు. అయితే కళింగరాజుసంతతి వారు కొందరు తెలుగుదేశమున మిగిలియుండి నరపతివారికి లోబడి బెజవాడ మొదలగు ప్రదేశములయందు శా. శ. ౧౪౪౦ ఆ సంవత్సరములలో నివసించి యున్నట్లు ముందు శాసనములవలన కనపడును గాన స్వతంత్రాధిపత్యము లేకపోయినను వారు శా. శ. ౧౪౫౦ వరకు దేశమధ్యమునందే వసించి వున్నట్లు స్థూలదృష్ట్యా చెప్పబడెనని నవదగి యున్నది.

బుక్కపట్నం రాఘవాచార్యులు

# సాతవాహనులు

వేటూరి ప్రభాకర శాస్త్రిగారు

సాతవాహను లంధ్రులు గారని వాదించువారు గొందఱు గలరు. సాతవాహన రాజులలోఁ బ్రఖ్యాతి గన్నవారు, కుంతల దేశ మండలి ప్రతిష్ఠాన పట్టణము రాజధానిగాఁ గుంతల సౌరాష్ట్ర మహా రాష్ట్రాది దేశములనే పాలించినట్లు శాసనములందు గానవచ్చుటయు నంధ్ర దేశమును పాలించినట్లు గానరాకుండుటయు వారి వాదమునకుఁ బ్రబలసాధనము. పురాణములందు వా రంధ్రులుగాఁ బేర్కొనఁ బడిరి. ఇది పై వాదమునకుఁ బ్రబల బాధకమే యయినను వారు దీనిని బుక్కిటి పురాణపు మాటగాఁ ద్రోసివేయఁ జూతురు. ప్రాచీన సాతవాహను లంధ్రదేశమును బరిపాలించిరనుట కాధారములు లేవా? విచారింతము.

నాసిక, కార్లి మొదలగు చోట్ల గుహాలలోఁగల సాతవాహన శాసనములలో వాసిష్ఠీ పుత్త్రపులుమావి శాసనములు ముఖ్య మయినవి. వానిని బట్టియే పయి వాదమును, పి. టి. శ్రీనివాసయ్యాం గారు, సూక్తంకరుఁడు, సుబ్రహ్మణ్యయ్యరు ప్రభృతులు, నెల కొల్పిరి*. అందు వారి వాదమున కాధారమయిన పట్టిది:—

"రాజరాజ్ఞో గోతమీ పుతస, హిమవత మేరు మందర పవత సమసారస, అసిక, అసక, ముళక, సురఠ, కుకురాపరంత అనుప విదభ అకరావతి రాజస, విఝ, చవత, పారిచాత, సహ్య, కణ్హ గిరి, మచ, సిరిటన, మలయ మహింద, సెటగిరి, చకోరపవత

---

* మ. సోమశేఖర శర్మగారి 'ఆంధ్ర మహా సామ్రాజ్యము' అను వ్యాసము భారతి సంచికలఁ జూడుఁడు. పైవారి వాదముల స్వరూపమెల్ల నందు వారు పరామర్శించిరి.

పతిస,-'' దీని సంస్కృతచ్ఛాయ యిట్లు:—రాజ రాజస్య గౌతమీ పుత్రస్య హిమవన్మేరు మందర పర్వత సమసారస్య, అసిక, అశ్మక, ముళక, సురాష్ట్ర, కుకు రాపరాంతానూప విద ర్భాక రావంతి రాజస్య, వింధ్య ఋక్షవత పారియాత్ర సహ్య కృష్ణగిరి మఞ్చ శ్రీస్థాన, మలయమహేన్ద్ర శ్వేతగిరి చకోర పర్వత పతేః,*భాండార కర పండితుఁడు బూలరు పండితుఁడు, భగవాన్‌లాల్ ఇంద్రాజి పండితుఁడు, మొదలగువారు పలుమార్లు పయి శాసనమును బరిశోధించి ప్రకటించిరట! ఇందుఁ జేర్కొనఁబడిన దేశములను బర్వతములను, వారు గుర్తించిరి. కాని యీయెల్లరకుఁగూడ, 'ముళక' దేశమేదో తెలియరాలేదట! ఒకరు 'ముళక'మును 'ముండక' మునుగా సంస్కరింపవలెననిరట! ఇంకొకరు సంస్కరింపకుండనే, 'ముళకు' లే 'ముండకు' లగుదురనుట కాధారములఁ జూపిరట! ఈ తలపోఁతలలో మునిఁగి యీముళక దేశ మేదో వారు గుర్తింపఁజాలక పోయిరి.

ఈ తలపోఁతలలోఁగూడఁ గొంత వింత విషయమున్నది. అది కడపటఁ దెలుపుదును. పయి శాసనమునఁ జేర్కొనఁబడిన ముళక దేశము నేఁడు ములికినాఁ డనఁబడు దేశమే యని నేను నిశ్చయించుచున్నాఁడను. నేఁటి యంధ్రదేశము ప్రాచీనకాలమున వేంగీదేశముగాను ముళక దేశముగాను బేర్వోలసి యుండెను. కడప, కర్నూలు,

*శ్రీ భావరాజు వెంకటకృష్ణరావుపంతులుగారు, జయంతి ౨-వ సంచికలో నంధ్రాక్షరములలో సంస్కృతచ్ఛాయాంధ్ర వివరణసహితముగా నీశాసనముఁ బ్రకటించిరి. ఈ పూన్కి మిక్కిలి శ్లాఘ్యము. కడముట్ట నిర్వహింతురు గాకని కోరుచున్నాను. ఇప్పుడు ప్రకటించిన శాసనముల సంస్కృతిచ్ఛాయలోఁ బ్రబలమయిన ప్రమాదములున్నవి. ''అపరాజిత విజయపతాక సతుజన దుపధనసీయ పురవరస'' అను దానికి అపరాజిత విజయ పతాకస్య శత్రుజన దుష్ప్రధ నియమనస్య పురవరస్య ''అని ఛాయ వ్రాయఁబడినది.'' అపరాజిత విజయపతాక శత్రుజన దుప్ర ధర్షణీయ పురవరస్య'' అని యుండవలెను. ఇట్టి వింతలను గలవు.

బళ్లారి, నైజాము రాజ్యములోఁ గొంత, యీనాఁడు ములకనాఁడుగా నుండెను. ములకనాటికి శ్రీగిరి నడిబొడ్డు. రాజ్యములు రాజధానులు, మాఱుటలో ఈనాళ్ల ప్రాముఖ్యమును, బరిమాణమును మాఱినవి. ఈ విషయమును బ్రబలముగా నిరూపించుట కిక్కడ చోటు చాలదు. పల్నాఁడు శ్రీనాథుని నాఁడుగూడ ములికినాఁడను వ్యవహారము నందు చుండెననుట కాధారముగలదు. క్రీడాభిరామమందలి యీ క్రింది పద్యముఁ జదువఁదగును.

ఉ॥ చిత్తముగూర్చి మాచెరల చెన్నుఁడు శ్రీగిరిలింగముం గృపా
యత్తతఁ జూడ ముల్కి విషయంబున కా మహిమంబు చెల్లఁగా
నుత్తరలోన మింట జల ముట్టిన మాత్రన నాపఱాలలో
విత్తిన యావనాళ మభివృద్ధి ఫలించుట యెట్లు చెప్పఁడా!

ముళక దేశము సాతవాహనుల యేల్బడిలో నుండుటచేత నే వారు 'శ్రీస్థాన' మునకును బతులయిరి. శ్రీస్థాన మనఁగా శ్రీశైలమే. పర్వతముల పేళ్ల వరుసలో నున్నదిగాన యది శ్రీశైలమేయగును. అయినను గొందఱు సందేహించుచున్నారట. ఏకప్రమాద మనేక ప్రమాదములకుఁ గారణమగుట నిక్కడఁ జూడఁదగును. ముళక దేశమును గుర్తింపక పోవుటచేత నే వారు శ్రీస్థానమనఁగా శ్రీశైల మగునని నిశ్చయింపఁజాలక సందేహింపవలసిన వారయిరి. అగును. ప్రత్యంత దేశమున కేలికలుగాక యీ పర్వతమునకుమాత్రము వా రెట్లు పతులు గాఁగల్గుదురు? పర్వతముమీఁది కాకాశయానమున రాకపోకలు జరపుచు ప్రభుత్వమును నెఱపుకొనుచుండినట్లు తలఁప వలెనా? ఈ యసంగతియే శ్రీస్థానము శ్రీశైలము గాకపోవచ్చునను నపోహమును బుట్టించినది. మఱియు నాసికగుహలోనే కల వాసిష్ఠీ పుత్త్రి పులుమావి శాసనాంతరమున 'ధనకట' భిక్షులకు దానము చేసినట్టు కలదు. ఈ ధనకటమును ధనకటక (ధరణికోట)

మని తలఁచుటకుఁగూడ గొందఱు సందేహించిరట! ఇది మూఁడవ ప్రమాదము. ధనకటకమున ననేక సహస్రసంఖ్యాకులగు బౌద్ధ భిక్షుకు లుండిరని హ్యూయెన్ త్సాంగు వ్రాఁతలు తెలుపుచున్నవి. అంత ప్రసిద్ధమయిన మన ధనకటమును గూర్చి కూడ సందేహించుటకుఁ గారణము వా రంధ్రదేశమును బాలించిరన్న విషయమును గుర్తింపక పోవుటయగును.

బళ్లారిజిల్లా మాయక్దోనిలోను, హిరహడగల్లిలోను దొరకిన పల్లవ (శివస్కందవర్మ) శాసనములలో 'సాతవాహనిహార' మని 'సాతాహనిరట్ఠ' మని (సాతవాహనహారము, సాతవాహనరాష్ట్రము) పేర్లున్నవి. ఆపేర్లా శాసనములు దొరకిన స్థలములకుఁ జెందినవే యని యందఱు నంగీకరింతురు. అం దొకగ్రామముపేరు 'చిల్లరేక కోడుంక.' నేఁడు తెల్గుదేశమున 'చిల్లరిగె' యింటిపేరుగల బ్రాహ్మణులున్నారు. వారు మాధ్వులు. బళ్లారిజిల్లాలో చిల్లరిగె యను గ్రామము గలదేమో! పయి శాసనములోని చిల్లరేక చిల్లరిగె కావచ్చునని నా తలంపు. బళ్లారిమండలము సాతవాహన రాష్ట్రమయియుండఁగా సాతవాహను లంధ్రులగుట సంగతమే కాదా? కాని యీ శాసనములు క్రీ. తర్వాత మూఁడవ శతాబ్దిలోనివిగాన, యప్పటికి సాతవాహను లా యల్పదేశముఁ బాలించుచున్నట్లు తలఁపవలె నందురట! ఇది యెంతయు నసంగతము. శివస్కందవర్మ దానము చేయునప్పు డాదేశము శివస్కందవర్మపాలితమే యగును గాని సాతవాహన పాలితముగాదు. శివస్కందవర్మ యాదేశమునకుఁ బారంపర్యముగా వాడుకలోనున్న పేరిని (సాతవాహన రాష్ట్రమని) పేర్కొన్నాఁడు గాని యానామ మానాఁడే పుట్టినది కాదు. ఆనాఁటి కనేకదేశములు సాతవాహన రాజ పాలితములుగా నుండినను సాతవాహన రాష్ట్రమని విశిష్టనామ ముండుట, బళ్లారిప్రాంత దేశమున

కా సాతవాహనుల ప్రాచీన ప్రధాన పాలిత దేశత్వమును నిరూపించు
చుండుట లేదా? ఈ శాసనములఁబట్టి సాతవాహనులు తొలుత,
ముళకదేశమునో, యందలి యేకదేశమగు బళ్ళారిప్రాంతమునో
పాలించినట్లును, దానికే సాతవాహన రాష్ట్రమని సాతవాహన హార
మని పేరయినట్లును దలఁపవలసియుండును. అట్లు దలఁపకుండుట
నాల్గవ ప్రమాదము. తొలుత వారు వేంగీదేశమును బాలించుచున్న
యంధ్రరాజులగు నిక్ష్వాకురాజులకు భృత్యులయియుందురు. ఈ కార
ణముచేతనే కొన్ని పురాణములలో సాతవాహను లంధ్రభృత్యులని
పేర్కొనఁబడియుందురు. క్రమశః ప్రబలులై కర్ణాటదేశమెల్ల నేలి
యుందురు. ఈ 'కర్ణి' రాజులపేరనే 'కర్ణినాఁడు' అని దేశనామ
మేర్పడి, మార్పులుచెంది కన్నడ, కర్ణాట రూపములఁ జెందియుండ
వచ్చును. మైసూరు తల్కొండ స్టేటులో స్థానకుండూర శివాలయ
శిలాశాసనమున "సాతకర్ణి పూజించిన యాలయములోఁ దాను
పూజచేయుచు"న్నట్టు అర్చకుఁడు వ్రాసికొన్నాఁడు. ఇట్లు వారు క్రమ
ముగాఁ బ్రాబల్యముఁజెంది, కుంతల ఘూర్జర మహారాష్ట్రాది దేశము
లను జయించి క్రొత్తగాజయించిన దేశముల పరిపాలనసౌకర్యముకై
గోదావరీతీరమునఁ గుంతలదేశమునఁ బ్రతిష్ఠానము గల్పించుకొని
యుందురు. అట్లు ప్రతిష్ఠానముఁ బడయుటచేతనే యా రాజధానికిఁ
బ్రతిష్ఠానమని పేరయ్యెను. జాతక కథలు, పద్మ, కూర్మ, లింగ,
భవిష్య పురాణములు, రామాయణోత్తరకాండము, కథా సరిత్సా
గరము, మహాభారతము, విక్రమోర్వశి ప్రతిష్ఠానమును బ్రశంసించు
చున్నవి. ప్రతిష్ఠాననామము సాతవాహనరాజ కల్పితమని నా నమ్మ
కము. ప్రతిష్ఠానమను రాజధానీ నామమే యంధ్ర భృత్యులుగానున్న
వా రంధ్రులగుటను, అది క్రొత్తగా నెలకొల్పఁబడిన రాజధానియగు
టను సూచించుచున్నది. ప్రతిష్ఠానమునుండఁగా వీరు శకరాజులచేఁ

-గొంతతాఁకిడిం బడిరి. కొంత యుత్తరరాజ్యమును గోల్పోయిరి. అప్పుడు ధనకటకమునుగూడ వీ రుపరాజధానిగాఁ జేసికొనిరి. ఇక్ష్వాకు లప్పటికి దుర్బలులయి యుందురు. అనేకాధ్వరకర్తలును, వైదిక మతాభిమానులును నయ్యు సాతవాహను,లిక్ష్వాకులవలె వారి మతమైన బౌద్ధమతమును బరిరక్షించిరి. బౌద్ధులకు దానములఁజేసిరి. వారి స్తూపములఁ గాపాడిరి. పెంపొందించిరి. కృష్ణా గోదావరీ నదుల నడిమి దేశమెల్లఁ దుదకు వారి యేల్బడి క్రిందనే యుండెను. హాలసాతవాహనుఁడు సంధానించిన సాతవాహనసప్తశతిలోఁ దెలుఁగు దేశమునకుఁ జెల్లఁదగిన వర్ణనలు పెక్కులు గలవు.

గోదావరీనది సముద్రముతో సంగమించునంతదాఁకఁ గల దేశములో సాతవాహన వంశముతో సమానమయిన వంశము వే ఱొకటి లేదని యొక గాథలోఁ గలదు. బ్రహ్మశ్రీ, మా. రామకృష్ణ కవిగారు సంపాదించిన లీలావతీ కథలో హాలునకు సప్త గోదావర తీరమున భీమేశ్వరమునఁ బెండ్లి జరగినట్లు కలదట! అమరావతీ స్తూప మున గౌతమీ పుత్త్రిశాత కర్ణి శాసనమున్నది. కృష్ణా ముఖద్వార మున యజ్ఞశ్రీ శాతకర్ణి పదునెన్మిదవ పాలనవత్సరమున వేయింపఁ బడిన బౌద్ధదాత శాసనము దొరకినది. అంధ్రవల్లభుఁడని యంధ్ర నాయకుఁడని, అంధ్రవిష్ణువని, శ్రీ వల్లభు డని సిరికాకొల్ని నాథుఁ డని వర్ణితుఁడగు శ్రీకాకు ళాంధ్రనాయకస్వామి యంధ్రులగు సాత వాహనులలో నొక్కనిపేర వెలసినదైవమై యుండవచ్చునని నాతలం పు. సిరిక కొలను అని యా గ్రామనామపుఁ దొలిరూపము. కొలనే వైష్ణవమువచ్చి దివ్యస్థలమై 'కొళ' మయినది. అక్కడ గొప్ప చెఱువుండినట్లు స్థలమాహాత్మ్యమునను గలదు. 'సిరిక' పదము 'శ్రీముఖ' పదమునకు తెలుఁగు వికృతి కాఁదగును. మఱియు, వా సిష్ఠీ పుత్త్రిపులుమావి నాసిక శాసనమున సాతవాహనులు బ్రాహ్మ

ణులని ప్రస్తుతులయిరి. శ్రీకాకుళ స్థలమాహాత్మ్యమునఁగూడ, నా యంధ్రనాయకస్వామి నాగదేవ భట్టారకు నింటఁబుట్టిన బ్రాహ్మణుఁ డని కలదు. అక్కడ నాస్వామి బ్రాహ్మణకన్యను వివాహమాడెనట! ఈకథ శ్రీముఖ శాతకర్ణిది కాఁదగును. ఆంధ్రరాజులు తెలివాహా నదీతీరమున నుండినట్లు బౌద్ధ జాతక కథలలోఁ గలదట! లీలావతీ కథ, హాలుని నాటికి గోదావరి సప్తశాఖలు గలదని తెలుపుచున్నది. జాతకకథలలోఁ జెప్పఁబడిన తెలివాహానది గోదావరీ సప్తశాఖ లలో నొక్కటియగు తుల్యభాగ యగు నేమోయని నాయూహము.

సంస్కృత, దేశి, భాషాకృతులలోఁ బెక్కింట నంధ్రస్త్రీల కుచసౌభాగ్యమసాధరణమైనదిగా వర్ణితమయ్యెను. ఆవర్ణన మన్వర్థ మయినదని యమరావతీ స్తూపశిల్పములు ప్రతిపాదించుచున్నవి. ఆ స్తూపనిర్మాణకాలమున నంధ్రస్త్రీలకుఁ గుచాచ్ఛాదనము లేకుండు టనుగూడ నమరావత్యాది స్తూపరూపములు నిరూపించుచున్నవి. అవికలు లేని యంధ్రస్త్రీలు ప్రతిష్ఠానమున కేఁగినపిదప నతినిగూఢ కుచలగు ఘూర్జర మాహారాష్ట్ర స్త్రీల సంగతిచేఁ గ్రొత్తనాగరకత బలసి అవికలను పైఁటలను నుంచుకొనసాగిరి. పైఁటపదము ప్రతిష్ఠాన పదభవమే. ప్రతిష్ఠానముననుండి యలవడినది గాన కుచాచ్ఛాదనము నకు నానగరముపేరే దజ్జ్ఞాపకముగా పేరయ్యెను. అవికలకుఁగూడఁ బైఠిణీ అవికలనియే పేరు. పైఠిణీ పదముగూడఁ బ్రతిష్ఠానపద భవ మే. సంస్కృతమున 'కంచుక' మను పద మున్నను, నది స్త్రీపురుష సామాన్యమయిన 'అంగరకా'కు పేరుగా నున్నది. సాతవాహన సప్త శతిలో నది ఘూర్జరాంగనలు వేసికొను మేలిముసుఁగు (ముఖ మునకుఁ గూడ నుండును) పర్యాయముగాఁ గలదు. ఆంధ్ర, ద్రవిడ, కర్ణాట, మళయాళ స్త్రీ లానాఁడు అవికలు లేనివారే. ప్రతిష్ఠాన సంగతిచే నంధ్ర కర్ణాటాంగనలు పైఁటలను అవికలను దాల్చిరిగాని

యదిలేని ద్రవిడ మళయాళ స్త్రీలు, నేఁటికిని వానిని దాల్పని వారు గానే యున్నారు. పురుషులు వోలె స్త్రీలును, (నేఁడును మళయాళ మున నున్నట్లు) కొన్ని సమయములందు ఉత్తరీయమును దాల్చుటే కాని, అవికలఁ దాల్చుట యాకాలమున దక్షిణ భారతదేశమున లేదు. ప్రతిష్ఠాన సంబంధము సాతవాహనుల తర్వాత నంధ్రదేశమునకు లేదు. సాతవాహనులతర్వాతఁ బ్రతిష్ఠాననగరము పాడుపడి పల్లెటూరయ్యె నది. పైఠిణీ రవికలును పైఁటలును బ్రతిష్ఠానము రాజధానిగా నొప్పు చున్నప్పుడే వెలయుట సంగతము. నాఁటి ప్రతిష్ఠానము, కృష్ణా గోదా వరీ నదీసాగర సంగముదాఁకఁ గల యంధ్రదేశముతోఁ బ్రబలసంబం ధము గలదనుటను 'పైఁట, పైఠిణీఅవిక' పదములు నిరూపించు చున్నవి. శాసనములం దేనాఁడు సాతవాహనులు రాజ్యమేలినట్లుగా గలదో యానాఁడే యంధ్రదేశము (ముళక) నేలినట్లును గలదు. వా రాంధ్రులని పురాణములు చెప్పుచున్నవి. నేఁటి యాంధ్రదేశమునకే తక్క నితర దేశములకు వేనికిని నంధ్రనామ మేనాఁడును గానరాదు. సాతవాహను లంధ్రదేశముతోపాటుగా నితరదేశములనుగూడ జయించి పాలించుట వారి యంధ్రతకు రంజకము కాఁదగును గాని భంజకము గాఁగూడదు. తొలుదొలుతటివారిరాజ్యము ముళకదేశము లోని సాతాహాని రట్ఠమగును. సాతవాహనుల యంధ్రత యిన్నివిధ ములఁ బ్రవ్యక్తమగుచుండఁగా, వా రంధ్రులుగారనియు నంధ్రదేశ మును బాలింపలేదనియుఁ జేయు వాదములకు విలువ నిలువఁగలదా? విష్ణుపురాణమున వర్ణితులగు ముండకువే ముళకు లగుదురని ఇంద్రాజి పండితులు వ్రాసిరట! ఇది సంగతము గావచ్చును. ఇక్ష్వాకులనుగూర్చి నేను వ్రాసిన వ్యాసమున* ఆంధ్రులకు ముండియులని ధర్మామృత గ్రంథ కథలోఁ బేరున్నట్లు తెలిపితిని. 'ముండక' 'ముండియ' శబ్దము

* ప్రభవపుష్య భారతీ సంచిక చూచునది.

లేకార్థవాచకములు గావచ్చును. ధర్మామృతకథలోఁ జేర్కొనఁబడిన ముండియులే విష్ణుపురాణాదులలోఁ జేర్కొనఁబడిన ముండకులు గాఁదగుదురు.

పురాణములలోని కలియుగ రాజవంశాను చరితములను గూర్చి పర్జిటర్ పండితులు వ్రాసిన గ్రంథము మిక్కిలి విలువగలదే. కాని దక్షిణహిందూదేశపు వ్రాఁత ప్రతులలోని పాఠములకును వారు ప్రకటించిన పాఠములకును భేదములు పెక్కులున్నవి. వానినెల్ల మరలఁ బరిశోధించి, దక్షిణ హిందూదేశ వోలిఖగ్రంథ పాఠభేదములను వేఱుగా నేను వెల్లడింపఁ జూచుచున్నాఁడను. 'పయిని జేర్కొనఁబడిన సాధనములు సాతవాహనులయాంధ్రత నాక్షేపింపరాకుండ నిలుపఁగలవని నానమ్మకము. హాలుని చరిత్రమే యనఁదగిన లీలావతీ కథలో సిద్ధనాగార్జునుఁడు హాలుని మంత్రియని కలదు.* సిద్ధనాగార్జునుఁ డంధ్రుఁడగుట నాతనిపేర వెలసియున్న శ్రీశైల పాదమగు సిద్ధనాగార్జునుని కొండయు, నక్కడి స్తూపములును, నిరూపించుచున్నవి. ఆతని నేలిన రాజు గూడ నంధ్రుఁడగుట సంగతముగాదా? మఱియు సాతవాహనుల యంధ్రతకు సాధకములయిన విషయములు సాతవాహన సప్తశతిలోఁ జాలఁగలవు. వానిని వేఱొక వ్యాసమున వెల్లడింతును.

చెన్నపట్టణము. వేటూరి ప్రభాకరశాస్త్రి.

* రామకృష్ణకవిగారి పుష్పాంజలి భారతి చూచునది.

# మహాభారతగాథా విశేషములు

పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రిగారు

పాండవుల కర్థరాజ్యార్హత యెట్లు కలిగినది? న్యాయమునకు భీష్ముఁడె రాజ్యార్హుడు. ఆతఁడు శంతనునికై చేసిన ప్రతిన ననుసరించి రాజ్యమును వదలుకొనినాఁడు కాని విచిత్ర వీర్యానంతరము ధృతరాష్ట్ర పాండురాజులు యౌవన దశ నొందువరకుఁ దానె రాజ్యముఁ జేసి సమిష్టిగనుండుటచే గ్రుడ్డివాఁడైనను ధృతరాష్ట్రుని సింహాసనమున గూర్చుండఁబెట్టి విదురుని మంత్రిగఁజేసెను. పాండురాజు సైన్యాధిపతియై దిగ్విజయముఁజేసి సంపాదించిన ధనముతో నన్నుచే నశ్వమేధ యాగము జేయించినాడు. ధృతరాష్ట్ర, పాండురాజుల కాలములో వారికెట్టి విభేదము కలుగలేదు. పాండురాజు శాపదగ్ధుడై యరణ్యమునఁ దపముచేయునపుడు రాజ్యముతో నతఁడు సంబంధమును వదలుకొనియున్నాఁడు. ఆసమయమున ధృతరాష్ట్రుఁడె పూర్వాచారము ననుసరించి రాజుగ నుండెను. పాండురాజ వీర్యమువలన సంతతి కలుగక యాతని క్షేత్రమునందే పాండవులు జన్మించిరి. పాండవుల జన్మలు నాఁటివారి కనుమానాస్పదములై యున్నవి. దానిని గుఱించి ముందువ్రాయగలను. ఎటులైనను పాండవులు పితృనిర్యాణానంతరము హస్తిపురికిఁ జేరిన పిమ్మట ధృతరాష్ట్రుఁడు తన పుత్రులతో సమముగ ధర్మరాజాదుల నాదరించి యుక్తవయస్కుఁడైనపుడు మునుపటి సమిష్టిబుద్ధితో ధర్మజునకు యౌవరాజ్యపట్టాభిషేకముఁ జేసియున్నాడు కాని పాండవుల యసందర్భ వ్యవహారముల చేతనైననేమి, దుర్యోధనాదుల యీర్ష్యచేనైననేమి పాండవులు వారణావతమునకు మిషచే వెడలఁగొట్టఁబడిరి. ధృతరాష్ట్రుఁ డీవెడలఁగొట్టుటలో దుర్యోధనాదులు

సర్వాధికారముల నాక్రమించిన పిమ్మట పాండవులు హస్తిపురికి వచ్చి
నను వారికిఁ బ్రజలపై పలుకుఁబడి యుండదను తలంపు మాత్రమె
యున్నది. కాని దుర్యోధనుఁడు లక్కయింట బాండవుల దహింపవలె
నను పాపబుద్ధికలవాఁడైనాడు. విదురుఁ డీదుర్యోధను కపటోపాయ
ముల నెప్పటికప్పుడు ధర్మజునకుఁ దెలుపుచుండుటచే పాండవులు
తమ్ముదహింపవచ్చిన పురోచనునే లక్కయింట దహించి యప్రతిష్ఠ
పురోచనునకును దుర్యోధనునకు నంటఁగట్టి భీతిచే మారువేషములను
ధరించి యరణ్యముల వెంట పఱువిడి ద్రౌపదీ స్వయంవరకాలమునకు
(రమారమి నాలుగేండ్లకు) ద్రుపదపురముఁ జేరఁగలిగిరి. అర్జునుఁడు
మత్స్యయంత్రముఁ గొట్టుటచే ద్రుపదుని సాహాయ్యము పాండవులకుఁ
గలిగెను. ద్రుపదుఁడు సాధారణుడుకాఁడు. ఆతనికి ద్రోణాచార్యునిపై
విశేషవిరోధము కలదు. ద్రుపదుని "మాకంది" రాజ్యమును
ద్రోణుఁడు కౌరవులతోఁగూడి దండయాత్రఁజేసి జయించి కురురాజ్య
మును విస్తరింపఁజేసినాఁడు. దానినిఁ గూడ పిమ్మట వ్రాయఁగలను.
పాండవులు ద్రుపదుతోఁ గలియునపుడే యువకులై స్వాతంత్ర్యమును
సంపాదించిన బలరామకృష్ణులును సంబంధ బాంధవ్యములచేఁ బాండ
వులఁ గలిసిరి. అప్పటికి దుర్యోధనుఁడు కురురాజ్యమునఁ బలుకుఁబడి
సంపాదించి రాజ్యాంగములను స్వాధీన పఱచుకొనియున్నాఁడు. పాండ
వులు యాదవ పాంచాలురఁ గలయుట విని వారి జయించుటయా?
వారిని దమలోఁ గలుపుకొనుటయా యను నాలోచన కౌరవసభలోఁ
గలిగినది. విదురుఁడెప్పుడును పాండవపక్షపువాఁడేను. కర్ణుఁడుయుద్ధము
జేసి జయింతమను నుత్సాహముతోఁ గూడియున్నాఁడు. కాని పాండవ
పాంచాలుర బలము నెఱిగిన ద్రోణుఁడును, అప్పటికి కురుపాండవుల
యందు సమానతాత్పర్యముగల భీష్ముఁడును పాండవులతో విరోధము
కూడదనియు, వారి కర్ధరాజ్యమిచ్చుట యుక్తమనియుఁ జెప్పుటచే

ధృతరాష్ట్రుఁడు పాండవులను రప్పించెను. అపుడు భీష్ముఁడు చెప్పిన వాక్యములలోఁ బాండవుల కి ట్లర్ధరాజ్యార్హత కలదనినాఁడు[1].

"మ. ధీరులా ధృతరాష్ట్ర పాండుల—తిప్రశస్తగుణుల్ ప్రసి
ద్ధోరుకీర్తులు నాకు నిద్దఱు— నొక్కరూప తలంపఁగా
వీరు వారనునట్టిబుద్ధి వి—భేదమెన్నఁడు లేదు గాం
ధారి పుత్రశతంబునందుఁ బృ—థాతనూజుల యందునున్"

"వ॥ కావున నప్పాండవులతోడి విగ్రహంబు నేఁ తె కెన్నండును నొడంబడఁ బితృపైతామహంబయిన రాజ్యంబునకు మీయట్ల వారు నర్హులు గావున వారలకు నర్ధరాజ్యం బిచ్చిన నీకును నీబాంధవులకును లోకంబులకును బ్రియంబగునట్లుగాని నాఁ డపకీర్తియగు"(ఇది నన్నయ తెనుఁగు)

ఓ దుర్యోధనా? ఇది మాతండ్రి తాతల రాజ్యమని నీ వెట్లు చూచెదవో వారును అట్లె మాతండ్రితాతల రాజ్యమని తలఁతురు. కీర్తిమంతులగు నాపాండవులు రాజ్యార్హులు కానియెడల నీకుమాత్రము రాజ్యార్హత యెట్లు కలుగును? అపుడు రాజ్యార్హత యెవరికిని లేదు. అయితే ధర్మముచేతనే నీవు రాజ్యమును పొందితివనుకొంటివేని వారు నింతకుఁ బూర్వమే రాజ్యముఁ బొందియున్నారని నాతలఁపు. మంచి చేతనే రాజ్యార్ధమును వారికిమ్ము ఇది సర్వజనులకు నిష్టము. అట్లు

---

1. భీష్మః॥ నరోచతే విగ్రహో మే పాండుపుత్రైః కథంచన, యథైవ ధృతరాష్ట్రో మే తథాపాండుర్న సంశయః। గాంధార్యాశ్చయథా పుత్రా స్తథాకుంతీ సుతామమ, యథాచమమ తేరక్ష్యా ధృతరాష్ట్ర తథాతవ। యథాచ మమరాజ్ఞశ్చతథా దర్యోధనస్యతే। తథాకురూణాంసర్వే షామన్యే షామపిపార్థివ। ఏవంగతే విగ్రహం తైర్నరోచే సంధాయవీరైర్దీయ తామర్థభూమిః। తేషామపీహ ప్రపితామహానాం రాజ్యంపితుశ్చైవ కురూత్తమానాం॥ దుర్యోధన యథా రాజ్యం త్వమిదంతాత పశ్యసి

చేయనినాఁడు మాకిష్టములేదు, నీ కపకీర్తి తప్పకవచ్చును.[1] ఈవాక్య సందర్భముల నాలోచింపఁగా ధృతరాష్ట్ర, పాండురాజులనాఁడు రాజ్యము కలిసి పాలింపఁబడెననియు, అది ద్రుపదపురమునుండి పాండవులను రప్పించువరకు సమిష్టిరాజ్యముగానే యుండెననియు స్పష్టపడుచున్నది. అందువలననే సామర్థ్యాతిశయము కలవాఁడగుటచే ధర్మజుని ధృతరాష్ట్రుఁడు యౌవరాజ్యాభిషిక్తుఁ జేసియున్నాఁడు.[2] భీష్ముడు చెప్పువాక్యములలో పాండవులు రాజ్యార్హులు (అజ్యేష్ఠ సంతతివారుగాన) కాని యెడల దుర్యోధనాదులును రాజ్యానర్హులేను (అంధ సంతతివారగుటను). మఱియు వా రింతకుఁబూర్వమె నీవు ధర్మముచేఁ బొందినటుల రాజ్యము నొందియుండిరనుటలో ధర్మజుని యౌవరాజ్యాభిషేకము జ్ఞప్తిపఱచుటర్థమై యున్నది. అప్పటి పరిస్థితులచేఁ బాండవులఁ గలిపికొనుట తప్ప వేఱుపాయము ధృతరాష్ట్రునకు దుర్యోధనునకుఁ గాన్పింపనందున పాండవులను రప్పించి యర్థరాజ్యము ధృతరాష్ట్రుడు పాండవుల కిచ్చియున్నాఁడు. అర్ధరాజ్యముఁ బాండవుల కిచ్చునపుడు ధృతరాష్ట్రుఁడాడిన యీ క్రింది వాక్యములు పూర్వమెటుల నుండినను పాండవుల కర్ధరాజ్యార్హత నపుడు కలుఁగ జేసినటుల స్పష్టమగుచున్నవి. భీష్ముఁడే పాండవుల కర్ధరాజ్యముఁ బంచిపెట్టించుటకు కారకుఁడైనాఁడును.

---

1. శ్లో॥ మమ పైతృకమిత్యేవం తేపి పశ్యంతి పాండవాః
   యదిరాజ్యం నతేప్రాప్తాః పాండవేయా యశస్వినః
   కుతఏవ తవాపీదం భారతస్యాపి కస్యచిత్
   అథ ధర్మేణరాజ్యం త్వం ప్రాప్తవాన్ భరతర్షభ
   తేపి రాజ్య మేనుప్రాప్తాః పూర్వమేవేతి మమతిః
   మధురేణైవరాజ్యస్య తేషామర్థం ప్రదీయతాం
   ఏతద్ధి పురుషవ్యాఘ్ర హితం సర్వజనస్యచ
   అతోన్యథాచే త్క్రియతే నహితం నో భవిష్యతి
   తవాప్యకీర్తిస్సకలా భవిష్యతి నసంశయః॥          ఆదిపర్వ 203 అధ్యాయ.
2. ఆదిపర్వ 139 అధ్యాయ

ధృతరాష్ట్రుఁ డిటుల ననుచున్నాఁడు:—ఓ ధర్మరాజా! నేను చెప్పినమాటలను సోదరులతోఁగూడ వినుము. తిరిగి మనలో విరోధము కలుగరాదు (కనుక) ఖాండవప్రస్థమునుఁ బ్రవేశింపుము. అక్కడనుండిన మిమ్ము నర్జునుఁడు సంరక్షించుచుండుటచే నింద్రునిచే సంరక్షింపఁబడిన దేవతలనువలె నెవఁడును మిమ్ము బాధింపలేఁడు. రాజ్యముయొక్కసగమునుబొంది ఖాండవప్రస్థములోఁ బ్రవేశింపుము[1].

ఈ ఖాండవప్రస్థము హస్తినాపురికి దక్షిణముననుండిన యమునానదీప్రాంత మహారణ్యము. పాండవుల నచటికి ధృతరాష్ట్రుఁ డంపుటలోఁ గొంత కృత్రిమాలోచన యుండినటులఁ గాన్పించును. ఆ ఖాండవమహారణ్యమున నాగు లను మిశ్రజాతీయు లున్నారు. "అశ్వసే" నాదులందు మహావీరులు. ఈ నాగజాతివారితోఁ బోరాడి పాండవులు చత్తురనితలఁచియే వీరినచటి కర్థరాజ్యభాగమను మిషతో ధృతరాష్ట్రుఁ డంపియుండును. శ్రీకృష్ణసహాయులగు పాండవు లా మహారణ్యమున "నింద్రప్రస్థ" పట్టణమును నిర్మించిరి. అదియే నేఁటిఢిల్లీ. ఇప్పటి ఢిల్లీయందు "ఇంద్రపట్" అను ప్రదేశముకలదు. అదియే ప్రాచీనపు టింద్రప్రస్థ మందురు. ఆ ఖాండవప్రస్థ మహారణ్యమున నుండిన నాగులతో నర్జునునకు ఘోరయుద్ధమైనది. శ్రీకృష్ణుఁడు తోడ్పడుటచే నావనము నర్జునుఁడు దహించి సుక్షేత్రముగఁ జేసియున్నాఁడు. ఆ వనప్రదేశమె నేఁటి ఢిల్లీబయలు. పాండవులనాఁడు మహారణ్యముగనుండిన ఖాండవము నేఁడు బంగరుపండు మహాక్షేత్రముగను, రాజాధిరాజులు చక్రవర్తులు నివసించు దివ్యస్థలముగాను మారుట యీశ్వరమహిమాతిశయము కాదా? పాండవులు ఖాండవ

---

1. ధృతరాష్ట్రః॥ భ్రాతృభిస్సహ కౌంతేయ నిబోధ గదతో మమ
పునర్నో విగ్రహో మాభూత్ ఖాండవప్రస్థ మావిశ। నచవో వసతస్తత్ర
కశ్చిచ్ఛక్తః ప్రబాధితుం, సంరక్ష్యమాణాన్ పార్థేన త్రిదశానివ వజ్రిణా।
అర్థం రాజ్యస్య సంప్రాప్య ఖాండవప్రస్థమావిశ. ఆదిపర్వం 207 అధ్యా.

ప్రస్థముఁ జేరినపిమ్మటనే వారి కధికబలము చేకూరినది. పాంచాలురతో ద్రౌపదీసంబంధమే కాక అర్జునుఁడు సుభద్రనుఁ బెండ్లియాడుటచేఁ యాదవులతోఁగూడ సంబంధ బాంధవ్యము లెక్కువ య్యెనవి. శ్రీకృష్ణున కప్పటికి యాదవులలోఁ బలుకుఁబడి హెచ్చుగనున్నది. మహాయుద్ధ కాలమునాఁటికి శ్రీ కృష్ణునిపలుకుఁబడి యాదవులలోఁ జాల తగ్గినది. ఆవృత్తాంతమునుఁ బిమ్మట వ్రాయఁగలను. పాండవులకు వారణావతమునకుఁ బోవునాటికి ప్రజలలో నంతగ పలుకుఁబడి లేదు. కారణము వారి జన్మవృత్తాంతము లనుమానాస్పదము లగుటయే. దానిని దిఙ్మాత్రముగ వ్రాయుచున్నాఁడను.

పాండవులజన్మలను నాఁటివారు సందేహింపలేదా?

పాండవులజన్మలు హస్తినాపురవాసులకు గూఢపరచి మునులచేఁ జెప్పఁబడినవి. వా రెట్లుచెప్పిరో చూడుఁడు.

బ్రహ్మచర్యవ్రతమునం దుండిన యా పాండురాజునకు దివ్యమైన హేతువుచే ధర్మునివలనఁ బ్రత్యక్షముగ నీ యుధిష్ఠిరుఁ డచటఁ బుట్టియున్నాఁడు. అట్లే భీముఁడను నీ మహాబలవంతుని వాయువా పాండురాజున కిచ్చెను. ఇంద్రునివలనఁ గుంతియందే యీ యర్జునుఁడు పుట్టెను. మాద్రి యశ్వినీదేవతలవలన నీశ్రేష్ఠులగు నకుల సహదేవులఁ గనినది.[1]

(పై వాక్యములు మునులు పాండవులఁ గుంతితోడ దీసికొని

---

1. శ్లో. బ్రహ్మచర్యవ్రతస్థస్య తస్య దివ్యేనహేతునా
సాక్షా ద్ధర్మాదయంపుత్ర స్తత్ర జాతో యుధిష్ఠిరః।
తథైనం బలినాంశ్రేష్ఠం తస్యరాజ్ఞో మహాత్మనః
మాతరిశ్వా దదౌ పుత్రం భీమంనామ మహాబలం।
పురుహూతా దయం జజ్ఞే కుంత్యామేవ ధనంజయః
యౌతు మాద్రీ మహేష్వాసావనూత పురుషోత్తమౌ
అశ్విభ్యాం పురుషవ్యాఘ్రౌ విమౌ తావపి పశ్యత. ఆదిపర్వం 126 అధ్యా.

వచ్చి హాస్తినాపురిలో భీష్మాదులకు నప్పగించునపుడు చెప్పినవి). మును లంతర్హితులైనపిమ్మట పౌరులలో నీక్రిందికలకలము కలిగెను.

ఆ యా మునులచేఁ దెలుపుడుచేయఁబడిన పాండవుల నపుడు కౌరవులు పట్టణమునందలి యన్నివర్ణములవారలు చూచి సంతసముచే నాక్రోశించిరి. కొంద ఱీబాలురు పాండురాజుకుమారులు కారనిరి. మఱికొంద ఱగుదురనిరి. మఱికొందఱు పాండురా జెపుడో చాల కాలముక్రితము మృతినొందెనే యెట్లు వీ రతనిబిడ్డలనిరి[1].

దేవీభాగవతమునఁగూడ పాండవులఁ గుంతి హాస్తిపురికిఁ గొని వచ్చినపుడు పౌరులు వారిజన్మలఁగూర్చి యనుమానించినటులనున్నది.

(ఋషులు) కుంతి నైదుగురుబిడ్డలతో హాస్తిపురిం బొందించిరి[2]. అపుడు జనులు—పాండురాజు శాపమునుఁదెలిసిన జనులు—(పాండురాజు స్త్రీసంపర్కము కలిగినంతమాత్రమున మృతినొందునని జనులెఱుగుదురు) కుంతి నోవనితా! యీబిడ్డ లెవరిబిడ్డ లనిరి. అపుడు కుంతి దుఃఖాన్వితురాలయ్యెను. ఆప్రజలఁగూర్చి కుంతి యీపిల్లలు దేవతల బిడ్డలేను, కురుకులమున నుద్భవించినవారేను (అనెను.) నమ్మకము కొఱకు దేవతలంద ఱామెచే నాహూతులైరి.

---

1. శ్లో. తైస్తై ర్నివేదితాన్ దృష్ట్వా పాండవాన్ కౌరవాస్తదా
శిష్టాశ్చ వర్ణాః పౌరాయే తేహర్షాచ్చుక్రుశు ర్భృశం
ఆహుః కేచిన్నతస్యైతే తస్యైతఇతి చాపరే
యదాచిరం మృతఃపాండుః కథంతస్యేతి చాపరే. ఆదిపర్వ 1 అధ్యా.

6. శ్లో. పంచపుత్రయుతాంకుంతీ మనయన్హాస్తినాపురం
పప్రచ్ఛుశ్చజనాస్సర్వే కస్యపుత్రావరాననే
పాండోశ్శాపం సమాజ్ఞాయ కుంతీ దుఃఖాన్వితాతదా
తానువాచ సురాణాం వై పుత్రాః కురుకులోద్భవాః
విశ్వాసార్థే సమాహూతాః కుంత్యాసర్వే సురాస్తదా.
దేవీభాగవత ద్వితీయస్కంధ 6 అధ్యాయ.

నిజమునకుఁ బాండవులు కృత్రిమజన్మకలవారేను. నాఁటికాలమున వైదిక దేవతలయందు మహిమలను జనసామాన్యము తలఁచుచుండుటచేఁ గుంతి యెటులనో యైదుగురుబిడ్డలను సంపాదించెననికాని కుంతీమాద్రుల కితరులవలన బిడ్డలుకలుగఁగా వారు దేవమహిమలవలనఁ బుట్టినవారని మిష పెట్టినదనికాని చెప్పవలసియున్నది. కర్ణునిఁ గుంతి రహస్యముగఁ గనినసంగతి నామె చివఱదశలోఁగాని చెప్ప లేదు. అర్జునుఁడొకఁడే పాండవులలోఁ గుంతికిఁ బుట్టినటులఁ బార్థశబ్దముచే నూహింపదగియున్నది. యమ, మరుత్తులు కుంతి జపించినంత మాత్రముననే వచ్చి ధర్మజ, భీముల నిచ్చిపోయిరి. ఇంద్రుఁడటులు కాక సంవత్సరము కుంతీపాండులు తపస్సుచేసినఁగాని వచ్చి యర్జును నీయలేదు. కుంతీ గర్భజనితు లగుటచేతనే కర్ణార్జునులు సమానవీరులైరనికూడ తలఁపవలసియున్నది. మఱియుఁ బాండవులు సంవత్సరసంవత్సరము వ్యవధిగ పుట్టినను అందరు నైదుసంవత్సరముల ప్రాయము గలవారుగానే కాన్పించిరట అనగా నైదేండ్లయీడుగల పిల్లలఁ గుంతి సంపాదింపలేదుకద? పాండవులఁ గుంతి "శతశృంగ" పర్వతమునఁ గనియున్నది. శతశృంగ పర్వతము "టిబెతు" దేశములోనిది. ఈపాండవు లచటఁబుట్టిరి. నన్నయభట్టునకు లభించిన సంస్కృత భారతమునఁ బాండురాజు మరణానంతరము పాండవులు హస్తిపురికివచ్చు నాటికి 16, 15, 14, 13 సంవత్సరముల వయస్సుకలవారై యుండిరి[1]. అందువలనఁ దిబెతుదేశభాష వారి కబ్బియున్నది[2]. ఒక దేశభాష మాత్రమె కాదు, తిబెతు దేశీయులై యుందురు. తిబెతు దేశమునఁ బెక్కండ్రొక్కవనితఁ బెండ్లియాడు నాచారము ప్రాచీనకాలమునుండి నేఁటివరకు గలదు. ద్రౌపదీ పరిణయ సమయమున

1. ఆంధ్రమహాభారతము 6 ఆశ్వాసము 140.

2. ఆదిపర్వ 146 అధ్యా.

ద్రుపదుఁడు పెక్కుం డ్రొక్కవనితఁ బెండ్లియాడుట యుక్తమా యన ధర్మజు డిట్లన్నాఁడు.

"ఓ ద్రుపద మహారాజా! ధర్మము సూక్ష్మమైనది. దీని గతిని మేమెఱుగము. (మాయొక్క) పూర్వులు వెళ్లినదారినే మేము పోవుచున్నాము[1].—ధర్మజుఁడు మాపూర్వికులు పోయినదారిని మేము పోయెదమనుటలో "తిబెతీయు"లని ధ్వని కలుగుచున్నది. కారణ మేమన కురువంశములో నెవరు ననేకుల పెండ్లియాడలేదు గాన కుంతీదేవి చాల గుట్టుగలస్త్రీ. ఆమె యర్జునునిఁదప్ప మిగిలిన నలువుర నెటులనో సంపాదించికొని (అర్జునుఁగనియుండును) కాని లేక వ్యభిచారముచేఁ దాను ముగ్గురగని సవతిచేఁగూడ నటులఁ గనిపించి కాని కౌరవులలో భాగస్వాములుగాఁ దీసికొనివచ్చి పెట్టియుండును. పౌరులందువలననే యనుమానించిరి. అనుమానించుటయె కాదు. ధృతరాష్ట్రుఁడు పాండవులను వారణావతమునకుఁ బొమ్మనగా ధర్మజునకు హాస్తిపురిలోఁ సహాయముఁ జేయువారు లేరైరి[2]. దీనుపై పాండవులు భీష్మాదులకు వందనముచేసి యనుజ్ఞగొనగా వారనుమతించిరట. పాండవులయందు కుంతీదేవియొక్క చెల్లెలుబిడ్డలగు శిసుపాల, దంతవక్త్రి, విందానువిందులకుగూడనిష్టములేదు. విందానువిందులు మహాయుద్ధములో గౌరవ పక్షముననుండి యర్జునుచేతనే చచ్చిరి. శిసుపాలుఁడు పాండవాహితుఁడై రాజసూయ యాగసమయమునఁ గృష్ణుచేఁ జచ్చుట నందఱెఱిఁగియున్నదియే. దంతవక్త్రినకు భారతగాధతో సంబంధములేదు కాని పాండవహితుడగు శ్రీకృష్ణునితోఁబోరి చచ్చినవాఁడేను. శిసుపాలుఁడు జీవించియుండినచోఁ దప్పక కౌరవ

---

1. సూక్ష్మో ధర్మో మహారాజ నాస్యవిద్మో వయంగతిం।
పూర్వేషా మానుపూర్వేణ యాతం వర్త్మానుయామహే॥

ఆదిపర్వ 195 అధ్యా.

2. ఆదిపర్వ 143 అధ్యాయ.

పక్షమునకువచ్చువాఁడేనని శ్రీకృష్ణుఁడర్జునునకు ఘటోత్కచవధ సమయమునఁ జెప్పియున్నాఁడు. పాండవుల జన్మకర్మాదులు కౌరవాచార విరుద్ధములుగను భారతీయాచార విరుద్ధములుగ నుండుటచేతనే దుర్యోధనుని ధనబలాదులను లక్ష్యపెట్టని బాహ్లిక, సోమదత్త, భూరిశ్రవస్సులు, కుంతియొక్క సోదరీసుతులు తుదకు మాద్రియొక్క యన్నయగు శల్యుఁడు మొదలగువారు పాండవులలోఁజేరక కౌరవులలోఁజేరిరి. పాండవులయందు నాఁటి వైదిక ఋషులకుఁగూడ గౌరవము లేదు. అందువలననే వైదికవాఙ్మయమునఁ బాండవులపేరు నప్పటి ఋషులు సూచింపలేదు. బాగుగ నాలోచింప చంద్రవంశమునఁ బుట్టినరాజులలో భరతుఁడు మొదలు పరీక్షిత్తువరకు వైదిక ఋషుల కిష్టమగు స్తుత్య వృత్తము గలవారెవ్వరును లేనందుననే వారిపేరులు వైదికవాఙ్మయమున లిఖింపఁబడలేదని తోఁచుచున్నది. దౌష్యంతి భరతునికే యన్యుఁడు పుత్రుఁడైనాఁడు. శంతనునినుండి పరీక్షిత్తువరకు రాజవంశము నానాసంకరములతోను కూడియున్నది. ఆసంకరదోషము ప్రపంచోపద్రవముఁ దెచ్చిపెట్టి సుమారు డెబ్బదిలక్షల వీరులు యుద్ధమున మరణమునొందవలసి వచ్చినది. జనమేజయునినుండి సంఘము శుద్ధమునొందినటులఁ గాన్పించును. జనమేజయుఁడు తనభార్యపై నణుమాత్ర జారత్వశంక కలుగుటచేతను శ్రీరామునివలె భార్యం ద్యజింప బ్రయత్నించిన కథ పురాణాంతరములలోఁగలదు[1]. ఈప్రక్కపుటలో నైతిరేయ బ్రాహ్మణములోని యశ్వమేధ యాగకర్తల పేరుల నధ్వర్యుల పేరులతో వ్రాయుచున్నాఁడ నందు వ్యాసధర్మజులపేరులు లేకపోవుట గమనింపఁదగియున్నది.

పిఠాపురము. పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి.

1. ఐతిరేయబ్రాహ్మణము 8 పంచిక 4 అధ్యాయము.

| సంఖ్య | అశ్వమేధయాగకర్త | అశ్వమేధయాజి యొక్క తండ్రి | అధ్వర్యుఁడు | అధ్వర్యుని తండ్రి | విశేషములు |
|---|---|---|---|---|---|
| 1 | జనమేజయుఁడు | పరిక్షిత్తు | తురుఁడు | కవషుఁడు | ప్రపంచమునంతయు జయించెను. |
| 2 | మానవుఁడు | శర్యాతి | చ్యవనుఁడు | భృగువు | డిటో |
| 3 | శతానీకుఁడు | సత్రాజిత్తు | సోమశుష్మ | వజరత్నాయనుఁడు | డిటో |
| 4 | అంబష్ఠునికుమారుఁడు | అంబష్ఠుఁడు | పర్వతనారదులు | | |
| 5 | యుధాంశ్రేష్ఠుఁడు | ఉగ్రసేనుఁడు | పర్వతనారదులు | | |
| 6 | విశ్వకర్మ | భువనుఁడు | కశ్యపుడు | | భూమికాశ్యపిగా నీయజ్ఞముచేత నైనది. |
| 7 | సుదాసుఁడు | పిజవనుఁడు | వసిష్ఠుఁడు | | ఋగ్వేదమున సుదాసునిగాథకలదు |
| 8 | మరుత్తు | అవీక్షితుఁడు | సంవర్తుఁడు | అంగిరసుఁడు | విశ్వేదేవత లీయజ్ఞమున సదస్యులైరట. |
| 9 | అంగుఁడు | ఉపాంగుఁడు | ఉదమయుఁడు | అత్రి | పదివేలయేనుగులను ఋత్విక్కులకు దానమిచ్చెను. |
| 10 | భరతుఁడు | దుష్యంతుఁడు | దీర్ఘతముఁడు | మమత (తల్లి) | 133 అశ్వమేధములఁజేసెను. |
| 11 | దుర్ముఖుఁడు | పాంచాలదేశపురాజు | బృహదుక్థుఁడు | | ఈతనివలె నన్నియజ్ఞముల నెవరును చేయలేదు. |
| 12 | అత్యరాతి | జనంతపతి | సాతహవ్యుఁడు | వసిష్ఠుఁడు | |

# ధర్మశాస్త్రకర్తలెవరు?

గాడె నరసింగరావుగారు, బి. ఏ., ఎల్. టి.

మనుస్మృతి, పరాశరస్మృతి, యాజ్ఞవల్క్యస్మృతి మొదలగు ధర్మశాస్త్ర గ్రంథములను గురించి లోకములో నొక వాడుక యున్నట్లున్నది. అది యేమిటనగా, ఏగ్రంథ మెవని పేర నున్నదో అతడే ఆశాస్త్రమును రచించినవాడని. దీనికి కారణము ఏమిటయి యుండునని భోగట్టాచేయగా మనుస్మృతి వ్యాఖ్యానమునను పరాశర స్మృతి వ్యాఖ్యానమునను గల మను పరాశరాదుల వాక్యములకు ప్రామాణ్య సంపాదన విషయకమగు చర్చలోని యీ క్రిందివాక్యము లోకవాడుకకు కారణము కావచ్చునని కొందరనుచున్నారు.

మనుస్మృతి కుల్లూక భట్టు వ్యాఖ్యానము.

వైరుషే యత్త్యేపి మను వాక్యానాం అవిగీత మహాజన పరిగ్రహాత్ శృత్యుపగ్రహాచ్చ వేదమూలకతయా ప్రామాణ్యాం తథాచ ఛాందోగ్య బ్రాహ్మణే శ్రూయతే "మనుర్వై యత్కించి దవదత్త ద్భేషజం భేషజతాయా" ఇతి.

పెద్దల యంగీకారమున్నూ ఆచరణయున్నూ గలదు కాబట్టిన్నీ ఆవాక్యములు వేదమూలకము గాబట్టిన్నీ వేదమందు మనువును స్తోత్రముచేశారు కాబట్టిన్నీ మనువాక్యములు ప్రమాణముగా గ్రహించవలెనని పై వాక్యముల తాత్పర్యము.

పరాశరస్మృతి మాధవాచార్య వ్యాఖ్యానము.

మనుయాజ్ఞవల్క్య పరాశరాదయః వేదే స్తుతత్వాత్।

మన్వాదులు వేదమందు స్తోత్రము చేయబడినారు గనుక నని పై వాక్యము తాత్పర్యము.

వీటిని బట్టి చూచినచో మన్వాదులు గ్రంథములు చేసినవా
రన్న యనుమానము కలుగుచున్నది. గాని స్మృతి గ్రంథములు
ప్రమాణములగుటను గూర్చిన యీ క్రిందిశ్లోకమున నదొకవిధమున
నున్నది.

ప్రాయేణానృతవాదిత్వాత్ పుంసాం భ్రాంత్యాది సంభవాత్
చోదనా నుపలబ్ధేశ్చ శ్రద్ధా మాత్రా త్ప్రమాణతా॥

ఈ శ్లోకమునుబట్టి నమ్మకమే ప్రమాణ హేతువని తోచు
చున్నది గాబట్టి మన్వాదులు గొప్పవారని వేదమందు చెప్పబడి
నారన్న మొదటివాక్యములే ఈ నమ్మకమునకు కారణమైయుండ
నోపును. అయితే వేద నిత్యత్వవిషయమున పూర్వ మీమాంసకులు
చూచిన మరియొక యభిప్రాయము గలుగుచున్నది. అనిత్య సంయో
గమువలన వేద మనిత్యమగును గనుక ననిత్యులగు పురుషుల నామ
ములు వేదమం దుండనేరవనిన్నీ అట్టి నామములున్నచోట వాటి
కర్థాంతరము కల్పించవలెననిన్నీ పూర్వ మీమాంసాసూత్రములకు
శబరస్వామి రచించిన భాష్యమున గలదు. దీనింబట్టి చూచినచో
పురుషనామము లున్నచో నది వేదమే కానేరదు. అందుచేత మన్వా
దులు వేదమందు స్తోత్రము చేయబడినారన్న యభిప్రాయమును
గూర్చియు తన్మూలకముగ వచ్చిన శ్రద్ధనుగూర్చియు ననుమానపడ
వలసి యుంటుంది. ఇదిగాక ఆపస్తంబ ధర్మసూత్రముల వ్యాఖ్యాన
మున 'ఆర్యసమయేన' అన్నపదమునకు ఆర్యులనగా శిష్టులనిన్నీ
వారే మన్వాదులనిన్నీ వ్రాసినారు. ఆపస్తంబ ధర్మసూత్రములందున్న
''యథోక్త మన్యదతః పరిషత్సు'' అను సూత్రమునకు వ్రాసిన
వ్యాఖ్యానములో 'పరిషత్సు' అన్న పదమునకు మానవాది ధర్మ
శాస్త్రములని వ్రాసినారు. వీటిని బట్టిచూడ మానవాది ధర్మశాస్త్ర
ములు పరిషత్సమయములు, ఆర్య సమయములు అన్న యనుమానము

కలుగుచున్నది. ఇదియే నమ్మకమునకు కారణము కావచ్చును. ఇదిగాక "వేద మూలకతయా ప్రామాణ్యం" అని యిదివర కుదహరించిన కుల్లూక భట్టువాక్యమున గలదు. అందుచే వేదమూలకత్వమే నమ్మకమునకు కారణమని యెంచి ధర్మములన్నియు వేదమూలములని భావించవచ్చును గాని "దేశధర్మ జాతిధర్మ కులధర్మాన్ శ్రుత్యభావా దబ్రవీన్మనుః" అని వశిష్ఠ స్మృతియందున్నది. అందుచేత ధర్మశాస్త్రములందున్నవన్నియు వేదమూలకములు గావని తోచుచున్నది.

ధర్మములలో కొన్ని ఆర్యసమయములూ, పరిషత్సమయములూ ఉండుటచేతనున్నూ కొన్ని వేదమూలకముగానివిన్నీ కొన్ని వేదమూలకములూ ఉండుటచేతనున్నూ మన్వాదులకున్నూ వారి పేరను లోకములో ప్రచారముననున్న శాస్త్రగ్రంథములకును గల సంబంధ మెట్టిదని విచారించవలసియున్నది: అనగా ధర్మశాస్త్ర కర్తలెవరు? ధర్మములకు కర్తలెవరు? అను సంశయములు విచారణ విషయము లగుచున్నవి.

ఈ విషయమున ధర్మశాస్త్ర గ్రంథములం దెట్లున్నదో మొట్టమొదట చూచెదము.

యాజ్ఞవల్క్య స్మృతియం దీక్రింది శ్లోకములు గలవు.

మన్వత్రి విష్ణుహారీత యాజ్ఞవల్క్యోశనాంగిరాః।
యమాపస్తంబ సంవర్త కాత్యాయన బృహస్పతీ
పరాశర వ్యాస శంఖ లిఖితా దక్షగౌతమౌ।
శాతాతపో వసిష్ఠశ్చ ధర్మశాస్త్ర ప్రయోజకాః॥

ఇందు చెప్పబడిన ఋషులు ధర్మశాస్త్ర ప్రయోజకులని యున్నది.

ప్రయోజకులనగా నడిపించినవారని యర్థము. శాస్త్రములు

వేరేగలవని యూహించవచ్చును. ఇచ్చట 'ప్రవర్తకాః' అని యొక పాఠము గలదు. దానింబట్టి కూడా నడిపించినవారనే తోచుచున్నది. అందుచే దీని ప్రకారము ధర్మశాస్త్రములకును మన్వాదులకును ప్రయోజ్య ప్రయోజక సంబంధమేగాని మన్వాదులకు గ్రంథ కర్తృత్వ మున్నట్లు కనిపించదు.

పరాశర స్మృతియం దీక్రింది శ్లోకములు గలవు.

శ్రుతామే మానవా ధర్మా వాసిష్ఠాః కాశ్యపా స్తథా
గార్గీయా గౌతమీయాశ్చ తథా చౌశనసా స్మృతాః॥
అత్రే ర్విష్ణోశ్చ సంవర్తా ద్దక్షాదంగిరస స్తథా
శాతాతపాచ్చ హారీతా ద్యాజ్ఞవల్క్యా త్తథైవచ
కాత్యాయనకృతా శ్చైవ తథా ప్రాచేతసా న్మునేః॥

ఈ శ్లోకములే మరియొక ప్రతియం దిట్లున్నవి.

శ్రుతామే మానవా ధర్మాః వాసిష్ఠాః కాశ్యపా స్తథా
గార్గీయా గౌతమీయాశ్చ తథా చౌశనసాః స్మృతాః॥
అత్రేర్విష్ణోశ్చ సాంవర్తా దక్షా ఆంగిరసా స్తథా
శాతాతపాశ్చహారీతా యాజ్ఞవల్క్య కృతాశ్చయే
కాత్యాయన కృతా శ్చైవ ప్రాచేతస కృతాశ్చయే
ఆపస్తంబ కృతా ధర్మా శంఖస్య లిఖితస్యచ॥

ఈ రెండు పాఠములందును కొన్ని ధర్మములు కృతములని చెప్పి మిగిలినవి తద్ధితలతో చెప్పుటచేత వాటినిగూడ కృతములనియే యెంచినచో దీనికిని పై శ్లోకమునకును విరోధము కలుగుచున్నది.

పై తీనసిలోనివని పరాశర మాధవీయమం దీక్రింది శ్లోకము లున్నవి.

తేషాం మ న్వంగిరోవ్యాస గౌతమాత్ర్యుశనో యమాః
వశిష్ఠ దక్ష సంవర్త శాతాతప పరాశరాః।

విష్ణ్వాపస్తంబ హారీతాః శంఖః కాత్యాయనో భృగుః।
ప్రచేతా నారదోయోగీ బోధాయన పితామహౌ
సుమంతుః కశ్యపో బభ్రుః పైఠీనో వ్యాఘ్ర ఏవచ
సత్యవ్రతో భరద్వాజో గార్గ్యః కార్ష్ణాజినస్తథా
జాబాలి ర్జమదగ్నిశ్చ లోకాక్షి బ్రహ్మసంభవః।
ఇతి ధర్మప్రణేతారః షట్త్రింశ దృషయస్తథా॥

దీనింబట్టి మన్వాదులు ధర్మప్రణేతలు అనగా ధర్మమును చేసిన వారని గాని నడిపించినవారని గాని తెలియనగును.

వృద్ధ గౌతమ సంహితలో యీక్రింది శ్లోకము లున్నవి.

శ్రుతా మే మానవా ధర్మాః వాశిష్ఠాః కాశ్యపా స్తథా
గార్గేయా గౌతమీయాశ్చ తథా గోపాలితస్యచ
పరాశర కృతాః పూర్వ మాత్రేయస్యచ ధర్మతః.
ఉమామహేశ్వరా శ్చైవ నంది ధర్మాశ్చ పావనాః
బ్రహ్మణా కథితాయేచ కౌమారాశ్చ శ్రుతామయా
ధూమ్రవర్ణ కృతాధర్మాః క్రౌంచ వైశ్వానరా అపి
భార్గవ్యా యాజ్ఞవల్క్యా శ్చమాండ వ్యాకౌశికా స్తథా
భారద్వాజ కృతాయేచ బృహస్పతి కృతాశ్చయే
సుమన్తు జైమిని కృతా శ్శాకునేయా స్తథైవచ
అగస్త్య గీతా మౌద్గల్యా శ్శాండిల్యా స్తులహాయనాః
వాలఖిల్య కృతాయేచ సప్తర్షి రచితాశ్చయే
ఆపస్తంబ కృతాధర్మాః శంఖస్య లిఖితస్యచ
ప్రాజాపత్యా స్తథా యామ్యాః మాహేంద్రాశ్చ శ్రుతా మయా
వైశ్వానరాఖ్యగీతాశ్చ విభాండక కృతాశ్చయే.
నారదీయ కృతాధర్మాః కాపోతాశ్చ శ్రుతామయా
క్రౌంచమాతంగ గీతాశ్చ సౌధహారీతకా స్తథా



పింగవర్మ కృతాకాంతా యేచవా వసుపాలితాః
ఉద్దాలక కృతాధర్మా ఔశన సాస్త్రథైవహి
వైశ్యపాథన గీతాశ్చయే చాన్యే ప్యేవమాదయః॥

ఇందు కొన్ని ధర్మములు కృతములనియు కొన్ని గీతములు అనగా చెప్పబడినవనియు, కొన్ని పాలితములనియు చెప్పి కొన్నిటిని తద్ధితరూపములచే జెప్పుటచే నీ తద్ధితాంత పదముల కెట్టి యర్థము చెప్పవలెనో తెలియరాకున్నది.

యాజ్ఞవల్క్య సంహితయందు ప్రయోజకులని చెప్పుటచేతను ఇతర గ్రంథముల కృత, గీతశబ్దములచేతనూ తద్ధితాంత శబ్దముల చేతను తెలియవచ్చుచున్న సంబంధము ఇట్టిదని నిశ్చయించుటకు వీలులేకున్నది.

ఇంతవరకు ధర్మశాస్త్ర గ్రంథములందు మన్వాదుల విషయమున నే మున్నదో చూచితిమి. ఇందువలన సంశయము విడలేదు. ఇక ప్రత్యేక ప్రత్యేకముగా ప్రతి ధర్మశాస్త్ర గ్రంథమందును నేమున్నదో చూతము.

అత్రిసంహిత, విష్ణుస్మృతి మొదలగు గ్రంథముల మొదటి శ్లోకముల జూచినచో నీ గ్రంథముల కర్తృత్వ మనేక రకములుగా నున్నట్లున్నది.

'అత్రిః శాస్త్ర మకల్పయత్' 'దక్షః శాస్త్ర మకల్పయత్' 'శంఖః శాస్త్ర మథాకరోత్' అని ఆయా గ్రంథములం దుండుటచే అత్రిస్మృతి, దక్షస్మృతి, శంఖస్మృతి– యీ గ్రంథములు అత్రి, దక్ష, శంఖులచే కల్పించబడినవని తెలియవచ్చును.

విష్ణుస్మృతి, హారీతస్మృతి మొదలగువాటియందు విష్ణుదేవుడును బ్రహ్మయు నాధర్మములు చెప్పినట్లున్నది. కొన్ని గ్రంథములందు బ్రహ్మచెప్పిన ధర్మముల నొకరు మరియొకరితో చెప్పిన

ట్లున్నది. ఈ రెండవరకము వాటిని సంగ్రహము లనవచ్చును గాని మొదటివాటిని గురించి యేమి చెప్పవలెనో ముందు ముం దాలోచించెదము.

యాజ్ఞవల్క్యాదులను కొందరు ఋషు లడిగినట్లును వారు ధర్మములను చెప్పినట్లును యాజ్ఞవల్క్య, ఔశనస, సంవర్త, బృహస్పతి, పరాశర, వ్యాస, వృద్ధగౌతమ, మను స్మృతులయందు గలదు. ఇవి యెట్టివో విచారించవలెను.

ఒకరకము గ్రంథములు సంగ్రహములని చెప్పవచ్చును. అంగిరసుని స్మృతియం దిట్లున్నది.

గృహాశ్రమేషు ధర్మేషు వర్ణానా మనుపూర్వశః
ప్రాయశ్చిత్త విధిం దృష్ట్వా అంగిరాముని రబ్రవీత్॥

ప్రవృత్తిలోని వాటిని సంగ్రహించినవి కొన్ని; యమస్మృతిలోని యీశ్లోకము జూడుడు.

అథాతోహ్యస్య ధర్మస్య ప్రాయశ్చిత్తాభిధాయకం
చతుర్ణామపి వర్ణానాం ధర్మశాస్త్రం ప్రవర్తతే॥

కాత్యాయన స్మృతిలోని యీ క్రిందిశ్లోకమును జూడుడు.

అథాతో గోభిలోక్తానా మన్యేషాం చైవకర్మణాం
అస్పష్టానాం విధిం సమ్యగ్దర్శయిష్యే ప్రదీపవత్॥

లిఖిత స్మృతియందును గౌతమశాతాతపవశిష్ఠ సంహితలయందును నెట్టి యుపోద్ఘాతమును లేకపోవుటచే వాటినిగూర్చి యేమియును జెప్పుటకు వీలులేదు.

దక్షాదుల కల్పనయు, బ్రహ్మాదులు వక్తలగుటయు, యాజ్ఞవల్క్యాదులు చెప్పుటయు నెట్టిదో మనకు స్పష్టముగా తెలియుటకు గాను ముందు ధర్మస్వరూపమును ధర్మప్రమాణములను విచారించి చూచెదము.

ధర్మస్వరూపమునుగూర్చి మనుస్మృతియం దీ క్రిందిశ్లోకములు గలవు.

విద్వద్భిస్సేవిత స్సద్భి ర్నిత్య మద్వేషరాగిభిః
హృదయే నాభ్యను జ్ఞాతః యో ధర్మ స్తన్నిబోధత॥

రాగద్వేషములు లేని విద్వాంసులచే నాచరింపబడినదియు హృదయానుజ్ఞను పొందినదియు ధర్మమని వీటివలన తెలియును. అందుచే రాగద్వేష మూలకము గానట్టిదియు, మనఃపూర్వకముగ నాచరించుటకు తగినట్టిదియు ధర్మమని తోచుచున్నది. ఇట్టి ధర్మమునకు లక్షణ మీ క్రిందిశ్లోకముల నున్నది.

వేదః స్మృతి స్సదాచారః స్వస్యచ ప్రియమాత్మనః
ఏత చ్చతుర్విధం ప్రాహు స్సాక్షా ద్ధర్మస్య లక్షణం॥ II అ॥
ధృతిః క్షమాదమో௨ స్తేయం శౌచ మింద్రియ నిగ్రహః
ధీర్విద్యా సత్య మక్రోధో దశకం ధర్మలక్షణం॥ VIIఅ॥మనుస్మృతి.

వేదము, ధర్మశాస్త్రము, ఆత్మప్రియము శిష్టాచారము ఈ నాలుగున్నూ ధర్మమును సూచించునట్టివి. వీటివలన సూచించబడిన వాటిలో ధృత్యాదులగు పదిన్నీ ముఖ్యమైన లక్షణముగా జెప్పబడినవి. ఈ యభిప్రాయ మీక్రింది శ్లోకములచర్చవలన స్పష్టపడగలదు.

దేశకాల విధానేన ద్రవ్యం శ్రద్ధా సమన్వితం
పాత్రే ప్రదీయతే యత్తద్ధర్మస్య ప్రసాధనం॥ మనుస్మృతి.

తగిన దేశకాల పాత్రములు చూచిచేసిన ద్రవ్యత్యాగము ధర్మమునకు ప్రసాధనమని దీనివలన తెలియవచ్చుచున్నది. ప్రసాధన మనగా శ్రేష్ఠమైన సాధనమని యొక యర్థము : అలంకారమని మరియొక యర్థము. ఇందేయర్థ మిచ్చట గ్రహించవలెనన్నది నిశ్చయించుట కీ క్రిందిశ్లోకమును విచారించిచూతము.

యమాన్ సేవేత సతతం ననిత్యం నియమాద్బుధః
యమాన్ పతత్య కుర్వాణో నియమాన్ కేవలాన్ భజన్॥
మనుస్మృతి.

యమము లనగా ధృత్యాదులు. వీటిని నిత్యమును సేవించవలెను. కేవల నియమములను సేవించుచు యమములను చేయనివాడు పతితుడగుచున్నాడు. అందుచే ద్రవ్య త్యాగరూపమైన నియమధర్మము యమముల కలంకారము వంటిదని తోచక మానదు.

ఇంతవరకు చూచిన దానింబట్టి యాత్మాభివృద్ధికి హేతువులగు కర్మలు ధర్మ శబ్దవాచ్యములగుచున్నవని మానవ ధర్మశాస్త్ర గ్రంథముయొక్క యభిప్రాయముగా గన్పడును. మేధాతిథి వ్రాసిన మనుస్మృతి వ్యాఖ్యానమునందలి యీ క్రిందివాక్యము పై యభిప్రాయమును బలపరుచుచున్నది.

"వేదవిద్భిరప్యనుష్ఠితః సంశయరహితశ్చధర్మఇతి"
వేదవేత్తలు ఆచరించినదిన్నీ సంశయరహితమైనదిన్నీ ధర్మము.

ఇదిగాక విశ్వామిత్రుడుచెప్పిన లక్షణముగూడ పైయభిప్రాయమును బలపరుచుచున్నది.

యమార్యాః క్రియమాణంతు శంస న్త్యాగమవేదినః
సధర్మో యం విగర్హన్తే త మధర్మం ప్రచక్షతే॥

దీనియర్థమేమిటంటే: ఏకర్మను వేదవేత్తలు మంచిదని చెప్పుదురో అది ధర్మము; వేదవేత్తలు నిందించునది అధర్మము.

ధర్మవిషయమున యాజ్ఞవల్క్య స్మృతియందిట్లున్నది:
దేశకాల ఉపాయేన ద్రవ్యం శ్రద్ధా సమన్వితం
పాత్రే ప్రదీయతే యత్తత్సకలం ధర్మలక్షణం॥
దేశకాల పాత్రము లాలోచించి చేసిన ద్రవ్యత్యాగము ధర్మము.
అయంతు పరమో ధర్మః యద్యోగే నాత్మదర్శనం॥

మనోనిగ్రహముల సంపాదించిన యాత్మదర్శనము పరమ ధర్మము. ఇంతవరకున్నూ మనుస్మృతియందు చెప్పినదిన్నీ యాజ్ఞవల్క్య స్మృతియందు చెప్పినదిన్నీ ఒక్కమోస్తరుగానే యున్నది.

విశ్వామిత్రుడు చెప్పిన వేదవేత్తయంగీకారమున్నూ కల్లాకభట్టు చెప్పిన సంశయరహితత్వమున్నూ ఎట్లుకలుగుచున్నవో చూచుటకు యాజ్ఞవల్క్య స్మృతిలోని యీక్రింది శ్లోకము కొంత యాధారము కల్పించునని తోచుచున్నది.

చత్వారో వేదధర్మజ్ఞాః పర్షత్త్రైవిద్యమేవవా
సాబ్రూతేయం స ధర్మస్స్యాదేకో వాధ్యాత్మవిత్తమః॥

వేదధర్మములను తెలిసినవారు నలుగురుగాని ముగ్గురుగాని పరిషత్తుగాగూడి దేనిని ధర్మమని చెప్పుదురో అదియే ధర్మము. అధ్యాత్మ వేత్తయైన వాడొక్కడు చెప్పినను అది ధర్మమే యగుచున్నది.

ఇంతవరకు జరిగిన ధర్మస్వరూప చర్చవలన మనకు తెలిసినదేమిటంటే; ధర్మము క్రియారూపము: వేదధర్మజ్ఞులు పరిషత్తుగాగూడి నిశ్చయము చేసినది.

ఇక ధర్మమూలములను ధర్మప్రమాణములను కొంత విమర్శింతము. మనుస్మృతియం దిట్లున్నది.

వేదోఽఖిలో ధర్మమూలం స్మృతిశీలేచ తద్విదాం
ఆచారశ్చైవ సాధూనామాత్మన స్తుష్టిరేవచ॥

యాజ్ఞవల్క్య స్మృతియం దిట్లున్నది :

పురాణ న్యాయ మీమాంసా ధర్మ శాస్త్రాంగ మిశ్రితాః
వేదాః స్థానాని విద్యానాం ధర్మస్యచ చతుర్దశ॥

మనుస్మృతియందలి ధర్మమూలములను యాజ్ఞవల్క్య స్మృతియందలి ధర్మస్థానములను ఆలోచించిచూడగా అంగసహితములగు

వేదములు, ధర్మశాస్త్రము, పురాణములు (శిష్టాచారమును తెలియ జేయునట్టివి), న్యాయమీమాంసలు (ఆత్మతుష్టి హేతువులు) యివ న్నియు ధర్మ నిశ్చయమునకు సాధనములని తెలియవచ్చుచున్నవి: అనగా వీటినిబట్టి ధర్మనిశ్చయము చేయవలయునని తోచుచున్నది.

వృద్ధ గౌతమసంహితయం దిట్లున్నది.

ధర్మం జిజ్ఞాసమానానాం ప్రమాణం ప్రథమం శ్రుతిః
ద్వితీయంతు స్వశాస్త్రాణి తృతీయం లోక సంగ్రహః॥

ధర్మము తెలుసుకొనుటకు మొదటి సాధనము వేదము; రెండ వది స్వకీయమైన శాస్త్రములు; మూడవది లోకసంగ్రహము అనగా శిష్టాచారము. దీనింబట్టి చూడగా శాస్త్రములలో ధర్మశాస్త్రములు న్యాయమీమాంసలు చేరియుండునని యును శిష్టాచారమున పురాణము లు చేరియుండునని యును యిదివరకు మనము చూచిన స్మృతుల నిరోధముచే చెప్పవలసియుండును.

ధర్మస్థానములందున్న ధర్మముల నాచరణకు తెచ్చుటలో సాయము చేయునదేదియని మనకు తెలియవలసియున్నది. ఈవిష యము మనుస్మృతియం దిట్లున్నది.

ఆర్షం ధర్మోపదేశంచ వేదశాస్త్రావిరోధినా
యస్తర్కేణాను సంధత్తే స ధర్మం వేద నేతరః॥

ఆర్ష ధర్మోపదేశములను వేదశాస్త్రావిరోధియగు తర్కముచే యోజన చేసినగాని ధర్మము తెలియదని దీని యభిప్రాయము. ఇందలి తర్కసాధనములగురించి మనుస్మృతియం దిట్లుగలదు.

ప్రత్యక్షం చానుమానంచ శాస్త్రంచ వివిధాగమం
త్రయం సువిదితం కార్యం ధర్మశుద్ధి మభీప్సతా॥

శుద్ధమైన ధర్మమును నిరూపించుటకు ప్రత్యక్షానుమాన శబ్ద ములు ప్రమాణములని దీని యభిప్రాయము. ఈమూడు ప్రమాణ

ములనుబట్టి తర్కించునప్పు డొకవిశేషము మనుస్మృతియందే కనిపించుచున్నది : ఈక్రింది శ్లోకముల జూడుడు.

సర్వంతు సమవేక్ష్యేదం నిఖిలం జ్ఞానచక్షుషా
శ్రుతి ప్రామాణ్యతో విద్వా న్స్వధర్మే నివసేత వై॥
ధర్మం జిజ్ఞాసమానానాం ప్రమాణం పరమం శ్రుతిః
శ్రుతిద్వైధంతు యత్రస్యా త్తత్ర ధర్మావుభౌ స్మృతౌ॥

మీమాంస చేయుటయందు వేదప్రామాణ్యమును నిరాకరించగూడదు. వేదమందు రెండు విధములుగ నున్నప్పుడు రెండునూ ధర్మములని నిశ్చయించవలెను. ఇదియే మనుధర్మశాస్త్రమందలి పరమోపదేశము. ఇదియే వేదశాస్త్రావిరోధియగు తర్కము. ఇచ్చట శాస్త్రమనగా మీమాంసాశాస్త్రముగాని మరియొకటి కాదు. ఆలాగు కాకపోయినట్టయితే వేదప్రమాణముచేతనే ధర్మనిశ్చయము చేయుమని చెప్పరు.

ఇంతవరకు మనము చేసిన ధర్మస్వరూప ధర్మప్రమాణముల విచారణనుబట్టి మనకు తెలిసిన యంశము: ౧ ధర్మము క్రియారూపము. ధర్మనిర్ణయము చేయుటయందు వేదమునకును మీమాంసాశాస్త్రమునకును విరోధముగ నుండగూడదు. ఇందుచేత ధర్మశాస్త్రములు ముఖ్యము గావని తోచుచున్నది. ఈగ్రంథములు వేదములవంటివిగావు. పురాణములు మొదలుగాగల వాటివలెనే ధర్మస్థానములేగాని ధర్మనిర్ణయము చేయునవి గావని తోచుచున్నది. ఇంకను మరియొక విషయము పై చర్చవలన తేలినది. ధర్మములు పరిషన్నిర్ణీతములయినగాని శుద్ధములుగావన్నందున మన్వాదులకుగల ధర్మశాస్త్రకర్తృత్వము విషయమునగాని పరిషత్తులవిషయమునగాని యెట్టిసంబంధమున్నదో నిశ్చితముగా తెలియలేదుగాని పరిషన్నిర్ణీతములే ధర్మములన్న యనుమానము గలిగినది. మన్వాదులవాక్యము లున్న

యెడల వాటినార్ష ధర్మోపదేశములుగ గ్రహించి వాటికి తర్కయోజన కలుగ చేసినగాని వాటి ధర్మత్వము నిశ్చయించలేమని తోచక మానదు. అందుచేత ధర్మశాస్త్ర గ్రంథములు పరిషన్నిర్ణయముల సంగ్రహము లన్న యనుమానమునకు వీలుకలుగుచున్నది. భారతము అనుశాసన పర్వమున నుమామహేశ్వర సంవాదములోనివని పరాశర మాధవీయమందున్న యీక్రింది శ్లోకములను జూతము.

> ధర్మా బహువిధా లోకే శ్రుతి భేద ముఖోద్భవాః
> దేశ ధర్మాశ్చ దృశ్యంతే కులధర్మా స్తథైవచ॥
> జాతిధర్మా వయోధర్మా గుణధర్మాశ్చ శోభనే
> శరీరకాల ధర్మాశ్చ ఆపద్ధర్మా స్తథైవచ।
> ఏతద్ధర్మస్య నానాత్వం క్రియతే లోకవాసిభిః॥

దీనియం దిట్లున్నది: ధర్మములు పలురకములు. ఈ బహువిధత్వము లోకములోనివారిచే చేయబడినదేను.

దీనింబట్టియు యిదివరకు మనకు గలిగిన యనుమానము బట్టియు నాలోచించగా ధర్మములన్నియు పరిషత్తులచే చేయబడిన వన్నయనుమానము బలమగుచున్నది. మన్వాదిస్మృతు లీనిశ్చయముల సంగ్రహములన్న యనుమానము కలుగుటకు వీలున్నది. ఇది నిశ్చయముచేసినచో ధర్మశాస్త్ర కర్తృత్వ విషయకమగు సమస్య పూర్తి కాగలదని తోచవచ్చును. మన్వాదిస్మృతులు పరిషన్నిర్ణయముల సంగ్రహములాయన్నవిషయము నిశ్చయించుటకు మనుస్మృతియన్న గ్రంథమును విమర్శించి చూచెదము. అన్నిస్మృతులను విచారించుట కవకాశముచాలదు. అన్నిటి విచారణయును అవసరముగూడ గానేరదు. ఒకదాని విచారించినచో స్థాలీపులాకన్యాయమున నన్నిటి తాలూకునిజమును మనకు బోధపడగలదు గనుక మనుస్మృతినే చర్చించిచూతము.

భగవన్ బ్రహ్మణాయత్తు సంప్రోక్తం స్వాయమ్భువో౽పురా।
తత్సర్వం పరమం ధర్మం వక్తుమర్హసి మే౽నఘ॥

అని వృద్ధహారీతసంహితలోని వాక్యములవలన బ్రహ్మ మనువున కుజెప్పిన ధర్మములు కొన్నిగలవని తోచుచున్నది.

ధర్మసారం మహారాజ మనునా ప్రోక్త మాదితః
ప్రవక్ష్యామి మనుప్రోక్తం పౌరాణం శ్రుతిసంతతం॥

అని వృద్ధ గౌతమ సంహితయందును "దేశధర్మ జాతిధర్మ కులధర్మాన్ శ్రుత్యభావా దబ్రవీ న్మనుః" అని వసిష్ఠ సంహితయందును ఉండుటచే మనుప్రోక్తమగు సంహిత ఒకటియున్నదన్న యనుమానము కలుగుచున్నది. ఇదిన్ని వృద్ధహారీత సంహితలోనిదిన్ని ఒక్కటే అవునాకాదా యనుదానిని నిశ్చయించుటకు మనుస్మృతియందేమున్నదో చూతము. అందు గ్రంథాదియందిట్లున్నది:

మను మేకాగ్ర మాసీన మభిగమ్య మహర్షయః
ప్రతి పూజ్య యథాన్యాయ మిదం వచన మబ్రువన్॥

మహర్షులందరును మనువును సమీపించి ప్రశ్న చేసిరి. ఈమను వెవ్వరని తెలియుట కీక్రింది శ్లోకములను జూడవలెను.

ద్విధాకృత్వాత్మనో దేహ మర్ధేన పురుషో౽భవత్।
అర్ధేన నారీ తస్యాం సవిరాజ మసృజ త్ప్రభుః॥
తప స్తప్త్వా సృజద్యంతు సస్వయం పురుషోవిరాట్।
తంమాం విత్తాస్య సర్వస్య స్రష్టారం ద్విజసత్తమాః॥
అహం ప్రజా స్సిసృక్షుస్తు తప స్తప్త్వా సుదుశ్చరం।
పతీ న్ప్రజానా మసృజం మహర్షీ నాదితో౽దశ॥
మరీచి మత్ర్యంగిరసం పులస్త్యం పులహంక్రతుం।

*　*　*　*　*　*　*

ఏతేమనూం స్తు సప్తాన్యా నసృజన్ భూరి తేజసః॥

జగత్ప్రభువైన ఆదినారాయణుడు అర్ధనారీశ్వరుడయ్యెను. అర్ధాంగమగు స్త్రీవలన విరాట్పురుషుని సృజించెను. ఆ విరాట్పురుషుడు తపస్సుచేసి నన్ను సృజించెను. నేను ఈ ప్రపంచమునకంతకును సృష్టికర్తను. నేను తపస్సుచేసి మరీచ్యాదులను సృష్టించితిని. వారు ఏడుగురు మనువులను సృజించిరి అని వీటియర్థము. దీనిం బట్టి తెలియునదేమిటంటే: మహర్షులందరు ఏమనువును సమీపించి ప్రశ్నచేసిరో ఆమనువు విరాట్పురుషునిచే సృజింపబడినవాడున్నూ ఏడుగురు మనువులను సృష్టిచేసిన మరీచ్యాది మహర్షులను సృజించినవాడున్నూ ఇతనే. మనువన్న విషయమునుచెప్పు శ్లోకము మరియొకటి గలదు. అది యీక్రిందను వ్రాయుచున్నాను.

మనోర్హైరణ్య గర్భస్య యేమరీచ్యాదయస్సుతాః॥

మరీచ్యాదులను సృజించిన మనువు గలడు. అతనినే ఋషులు ప్రశ్నించినట్లున్నది. అమనువు పరమపురుషునివలన ధర్మశాస్త్రమును గ్రహించి మరీచ్యాదులకు చెప్పెననిన్నీ ఆశాస్త్రమునే భృగువు మహర్షులకు చెప్పెననిన్నీ యీక్రింది శ్లోకములవలన తెలియనగుచున్నది.

ఇదంశాస్త్రంతు కృత్వాసౌ మామేవ స్వయమాదితః
విధివద్గ్రాహయామాస మరీచ్యాదీం స్త్వహం మునీన్
ఏతద్వోయం భృగుః శాస్త్రం శ్రావయిష్య త్యశేషతః.

అందుచే ఈశాస్త్రమునకు కర్త పరమేశ్వరుడే. బ్రహ్మ మనువునకు చెప్పినదన్న హారీతవచనమునందలి బ్రహ్మ పరమేశ్వరుడే కావచ్చును. గాని వృద్ధగౌతమ సంహితయందును వసిష్ఠసంహితయందును చెప్పిన మనువు పరమేశ్వరుడుగాక మరియొకడు కావలెను. ఈక్రిందివాక్యములను చూడుడు.

* * * బ్రాహ్మణస్య * * *

తస్యకర్మ వివేకార్థం శేషాణాం చానుపూర్వశః।
స్వాయంభువో మను ర్ధీమా నిదం శాస్త్ర మకల్పయత్॥

దీనింబట్టి ఈశాస్త్రమును కల్పనచేసినవారు స్వాయంభువమనువు. మరీచ్యాదులచే సృజింపబడిన యేడుగురు మనువులలోని వాడగు స్వాయంభువమనువు కావలెను.

ఇంతవరకును జరిగినవిచారణనుబట్టి శాస్త్ర కర్తలు పరమేశ్వరుడు స్వాయంభువ మనువు, మనువు అని తెలియవచ్చుచున్నది. ఈవిషయముననే మరికొన్ని నిదర్శనములుగలవు.

ననిష్క్రియ విసర్గాభ్యాం భర్తుర్భార్యా విముచ్యతే।
ఏవంధర్మం విజానీమః ప్రాక్ప్రజాపతి నిర్మితం॥

ఇందలి ధర్మము ప్రజాపతి నిర్మించినదని యున్నది. ఈప్రజాపతి మనువా మరియొకరా యనువిషయ మీాక్రిందిశ్లోకముల వెల్లడియగును.

త్రయోధర్మా నివర్తన్తే బ్రాహ్మణాత్ క్షత్రియంప్రతి।
అధ్యాపనం యాజనం చ తృతీయశ్చ ప్రతిగ్రహః॥
వైశ్యంప్రతితథైవైతే నివర్తేర న్నితిస్థితిః॥
నతౌప్రతి హితాన్ ధర్మా న్మను రాహ ప్రజాపతిః॥

ప్రజాపతియైన మనువుచెప్పిన ధర్మములని యీాశ్లోకములయందున్నది. అందుచే ప్రజాపతిన్నీ మనువున్నూ ఒకరే కావచ్చును. ఈక్రింది శ్లోకమును జూచిన నిది మనువుచెప్పినట్లున్నది.

ఋణే దేయే ప్రతిజ్ఞాతే పంచకం శతమర్హతి।
అపహ్నవేతుద్విగుణం తన్మనో రనుశాసనం॥

ఈక్రిందిది స్వాయంభువ మనువుచెప్పెను.

దశస్థానాని దండస్య మనుఃస్వాయంభువోఽబ్రవీత్॥

ఇంతవరకు జూచిన వచనములబట్టి మనుకర్తృకములని స్వాయంభువమను కర్తృకములని తెలియుచున్నది.

ఈక్రింది వాక్యములు జూచిన మరికొన్ని విషయములు తెలియగలవు.

ఏషోఽఖిలః కర్మవిధి రుక్తో రాజ్ఞ స్సనాతనః
నాస్తిస్త్రీణాం క్రియామన్త్రై రితి ధర్మో వ్యవస్థితః॥

దీనింబట్టి సనాతనధర్మములని వ్యవస్థితధర్మములని కొన్ని గలవని తెలియవచ్చినది. ఇట్టివి మచ్చునకుమట్టుకు కొన్ని చూపించితిని గాని సనాతనధర్మములనీ వ్యవస్థితధర్మములనీ స్థితధర్మములనీ మనువు చెప్పినవనీ స్వాయంభువ మనువుచెప్పినవనీ అనేకములుగలవు. మనుస్మృతిని సాంతముగా జాగ్రతతో జూచిన నవన్నియు స్పష్టపడగలవు. ఇవన్నియు పరమేశ్వరుడు చెప్పినట్లు మనుస్మృతివలన తెలియవచ్చినది. అందుచే నీగ్రంథమును రచించినవాఁ డొకడుకాడన్నయనుమానము గలుగకమానదు.

ఈగ్రంథ మొకకాలమునందుగూడ రచియింపబడినదిగాదని చెప్పుటకు కొన్నిప్రమాణములున్నవి. వాటిని కొన్నింటి నిందు జూపించెదను.

వేనో వినష్టోఽవినయా న్నహుషశ్చైవ పార్థివః।
సుదాః పైజవనశ్చైవ సుముఖో నిమిరేవచ॥
పృథుస్తు వినయాద్రాజ్యం ప్రాప్తవా న్మనురేవచ।
కుబేరస్తు ధనైశ్వర్యం బ్రాహ్మణ్యంచైవ గాధిజః॥
పృథోరపీమాం పృథివీం భార్యాం పూర్వవిదోవిదుః॥
అనేనతు విధానేన పురాచక్రే సపుత్రికాః
వివృద్ధ్యర్థం స్వవంశస్య స్వయం దక్షః ప్రజాపతిః॥

ఇందుచెప్పబడిన వారందరు నొకకాలమువారు కారనుటకు విష్ణుపురాణమునందలి యీవంశావళినిజూడుడు.




విశ్వామిత్ర నహుషాదులు దక్షుని మనుమడగు వైవస్వత మనువు సంతతిలోనివారని విష్ణుపురాణ వంశావళులనుబట్టి తెలియగలదు. అందుచేతనే ఈగ్రంథము మరీచ్యాదుల తండ్రియగు మనువుచే చెప్పబడినదనుటకు వీలులేదు. స్వాయంభువ మనువు చెప్పినవి మనువుచెప్పినవిగూడ నిందుంటచే నిందలి ధర్మము లేకకాలభవములు కానేరవు.

ఈక్రింది శ్లోకములు భిన్నకాలములందలి వ్యవస్థలను గలిగి యున్నవి.

అయం ద్విజైర్హి విద్వద్భిః పశుధర్మో వ్యవస్థితః
మనుష్యాణామపి ప్రోక్తో వేనే రాజ్యం ప్రశాసతి॥
సమహీమఖిలాం భుంజ న్రాజర్షిప్రవరః పురా
వర్ణానాం సంకరం చక్రే కామోపహతచేతసః
తదాప్రభృతియో మోహాత్ప్రమీతపతికాం స్త్రియం
నియోజయ త్యపత్యార్థే తం విగర్హన్తి సాధవః॥

యస్యా మ్రియేత కన్యాయా వాచా సత్యే కృతే పతిః।
తా మనేన విధానేన నిజో విందేత దేవరః॥
యథావి ధ్యధిగమ్యైనాం శుక్లవస్త్రాం శుచివ్రతాం।
మిథో భజేతా ప్రసవా త్సకృత్సకృ దృతావృతౌ॥

వేనుడు రాజ్యము చేయుచుండగా నియోగమువలన వర్ణ సంకరము కలిగినది. సాధుపురుషులచే నటుతరువాత నింద్యముగా నెంచబడినది. అయినను వాగ్దత్తయైన స్త్రీయొక్క పతిచచ్చిపోయిన యెడల నీక్రింది విధానమున నామె సంతానమును పొందవచ్చును. ఇది పైశ్లోకముల యభిప్రాయము. వేనుని రాజ్యాంతమువరకు నున్న ధర్మము దానివలన గలిగిన నష్టము దానినిషేధము దాని తరువాతను కలిగిన మార్పు ఇవన్నియు నిందువలన తెలియవచ్చుచున్నవి. ఇందలి ధర్మములన్నియు నేకకాలికములు గావనుట కిదియొక ప్రబల ప్రమాణము.

ఇంతవరకు చూపిన ప్రమాణములబట్టి ధర్మములయందు కాలకృతభేద మంగీకరించ వలయునన్న యనుమానము కలుగక తీరదు.

"దేశధర్మాన్ జాతిధర్మాన్కులధర్మాంశ్చ శాశ్వతాన్। పాషండ గణధర్మాంశ్చ శాస్త్రేస్మి న్నుక్తవా న్మనుః"

అను శ్లోకమువలన ధర్మములందు దేశకృత భేదముండునన్న యనుమానము కలుగవచ్చునుగాని అది యెంతవరకు మనుస్మృతియం దున్నదో చూతము. ఈవిషయమున మనుస్మృతి మొదటి యధ్యాయమున కొన్ని శ్లోకములుగలవు. అవియిందు వ్రాయుచున్నాను.

సరస్వతీ దృషద్వత్యో ర్దేవనద్యో ర్యదన్తరం
తం దేవనిర్మితం దేశం బ్రహ్మావర్తం ప్రచక్షతే॥
తస్మిన్దేశే య ఆచారః పారంపర్య క్రమాగతః।
వర్ణానాం సాంతరాలానాం సస దాచార ఉచ్యతే॥

కురుక్షేత్రం చ మత్స్యాశ్చ పంచాలా శ్శూరసేనకాః
ఏష బ్రహ్మర్షి దేశో వై బ్రహ్మావర్తా దనన్తరః॥
ఏతద్దేశ ప్రసూతస్య సకాశా దగ్రజన్మనః
స్వంస్వం చరిత్రం శిక్షేయుః పృథివ్యాం సర్వమానవాః॥
హిమవ ద్వింధ్యయో ర్మధ్యం యత్ప్రా గ్వినశనాదపి
ప్రత్యగేవ ప్రయాగాచ్చ మధ్యదేశః ప్రకీర్తితః॥
ఆసముద్రాత్తు వై పూర్వా దాసముద్రాత్తు పశ్చిమాత్
తయోరేవా న్తరం గిర్యో రార్యావర్తం విదు ర్బుధాః॥
కృష్ణసార స్తు చరతి మృగో యత్ర స్వభావతః
స జ్ఞేయో యజ్ఞియో దేశో మ్లేచ్ఛ దేశ స్త్వతఃపరః॥
ఏతా న్ద్విజాతయో దేశా న్సంశ్రయేర న్ప్రయత్నతః
శూద్ర స్తు యస్మిన్కస్మిన్వా నివసే ద్వృత్తి కర్శితః॥

మధ్యదేశమును, ఆర్యావర్తమును చెప్పి యజ్ఞములకు యోగ్యమైన దేశమును మ్లేచ్ఛదేశమును విభజించి చెప్పినది ద్విజాతుల నివాస నిమిత్తమని స్పష్టముగా చెప్పియున్నది. సదాచారవిషయమున నొక దేశమును చరిత్ర లేక లోకవృత్తమువిషయమున నొక దేశమును చెప్పుటచే నన్ని దేశములయందున్ను ఒక్కవిధమైన యాచారమున్ను లోకవృత్తమున్ను వుండవలయుననే మనుస్మృతి యభిప్రాయము. దేశభేదమువలన ధర్మభేదము గలుగునని మనుస్మృతియం దెచ్చటనూ లేదు. దేశభేదమువలన గలిగిన ధర్మభేదములు మనుస్మృతియం దెచ్చటనూ ఉన్నట్లు కనబడలేదు. గ్రంథాంతమున "చాతుర్వర్ణ్యస్య కృత్స్నోయ ముక్తోధర్మః" అని యుండుటచే నాల్గువర్ణములున్ను పాలించవలసిన ధర్మములు పూర్తిగా చెప్పెను. అందుచే దేశభేదముచే ధర్మము భేదించునని దీనివలన చెప్పలేము. కాలభేద మొక్కటే అంగీకరించవలయును.

ధర్మము సార్వత్రికమును సార్వకాలికమునుగాని కాలాను సారముగ మారదన్న మీమాంసా శాస్త్రాభిప్రాయము వైదిక ధర్మములైన యాగాదులకుగాని స్మార్త ధర్మములకు గాదని చెప్పవలసి యుంటుంది. ధర్మములు వైదికములనియు స్మార్తములనియు రెండు విధములుగ నున్నవని యీక్రింది వాక్యమువలన తెలియనగును.

ఆచారః పరమోధర్మః శ్రుత్యుక్త స్మార్తఏవచ॥

స్మార్తధర్మముల కాలకృత భేదమును స్మృత్యంతరముల సమరస చేయుచో పూర్వాచార్యులగు మాధవాదులు వాడినారుగాని యింత వరకు మనము చూచినదానింబట్టి ఒక్క గ్రంథమగు మనుస్మృతి యందీభేదమున్నట్లు తెలియవచ్చుచున్నది. ఈవిషయమును బలపరుచునట్టి వేదవిరుద్ధ వచనములను పరస్పర భిన్నవచనములను కొన్నిటిని పమర్శించిచూచెదము.

షట్త్రింశ దాబ్దికం చర్యం గురౌ త్రైవేదికం వ్రతం।
తదర్ధికం పాదికం వా గ్రహణాంతికమేవ వా॥

"గర్భాష్టమే బ్రాహ్మణ ముపనీయీత" యను వేదవచనము ప్రకారము ఏడవ సంవత్సరమున నుపనీతుడైనవాడు పై శ్లోకమును బట్టి 36 సంవత్సరములుగాని 18 ఏండ్లుగాని 9 వర్షములుగాని లేక విద్య పూర్తియగువరకుగాని గురువుద్దనున్నచో 44–వసంవత్సరమున గాని 26 నగాని 17 నగాని అనియతముగాగాని బ్రహ్మచర్యము పూర్తి యగును. ఈవిషయమున మరియొక శ్లోకము గలదు. దానిని చూడుడు.

చతుర్థమాయుషో భాగ ముషిత్వాద్యం గురౌ ద్విజః॥
ద్వితీయమాయుషో భాగం కృతదారో గృహే వసేత్॥

ఆయుర్దాయములో మొదటి నాల్గవ భాగము గురువద్ద నుండవలెనని దీనివలన తెలియును. వేదోక్తాయుష్యము శతపరిమితము.

అందు నాల్గవ భాగము 25 సంవత్సరములు. ఏడేండ్ల కుపనయనము. గనుక బ్రహ్మచర్యము పూర్తియగు సరికి 32 సంవత్సరములగును. గ్రహాయుర్దాయ ప్రకారము చూచినచో నాలవవంతు 30 సంవత్సరములు గనుక బ్రహ్మచర్యము పూర్తియగుసరికి 37 ఏండ్లు వయస్సు అగుచున్నది. ఏప్రకారము చూచినను విరోధపరిహారము కాలేదు. అందుచే నీరెండును ఏకకాలికములు గానేరవు. మరియొకయుదాహరణము. దాయభాగమునందలి యీశ్లోకముల చూడుడు.

బ్రాహ్మణ స్యానుపూర్వ్యేణ చతస్రస్తు యది స్త్రియః
తాసాం పుత్రేషు జాతేషు విభాగే ఽ యం విధిః స్మృతః॥
త్రింశం దాయాద్ధరే ద్విప్రః ద్వావంశౌ క్షత్రియాసుతః।
వైశ్యజోధ్యర్ధమేవాంశ మంశం శూద్రా సుతోహరేత్॥

*  *  *  *

సర్వంవా రిక్థజాతం తద్దశధా పరికల్పయేత్।
ధర్మ్యంవిభాగం కుర్వీత విధినానేన ధర్మవిత్।
చతురోంశాన్ హరేద్విప్రః త్రీనంశాన్ క్షత్రియాసుతః।
వైశ్యాపుత్రో హరేదంశ మంశం శూద్రాసుతోహరేత్॥

ఈశ్లోకములలో రెండు మోస్తరులుగా దాయవిభాగము చెప్పినారు. ఆరెండిటిలోనుకూడ శూద్రాపుత్రునకు ఒకవంతు దాయమున్నట్లున్నది. ఈక్రింది శ్లోకమున మరియొక విధమున నున్నది.

బ్రాహ్మణ క్షత్రియ విశాం శూద్రా పుత్రోనరిక్థభాక్।
యదేవాస్య పితా దద్యాత్తదేవాస్య ధనం భవేత్॥

ఈశ్లోకమున శూద్రాపుత్రునకు దాయములో భాగములేదని చెయున్నదిగాని తండ్రిధనమిచ్చినచో నది వానిదేయని యున్నది. పైశ్లోకములలో జెప్పినది తండ్రి యిచ్చినదానికి కాదని యుండలి

'హరే' త్తను పదమువలన దెలియవచ్చుచునే యున్నది. అదీగాక దాయవిభాగము తల్లిదండ్రులు గతించిన తరువాతను కొమాళ్లు చేసుకోవలసినదని చెప్పినట్లున్నది. ఈ శ్లోకమును చూడండి.

ఊర్ధ్వం పితుశ్చ మాతుశ్చ సమేత్య భ్రాతరస్సమం
భజేరన్ పైతృకం రిక్థ మనీశా స్తేహ జీవతోః॥

అందుచేత శూద్రాపుత్రదాయభాగ విషయమున విరోధమున్నది. ఇదియు కాలకృత భేదమును సూచించుచున్నది.

మరియొక యుదాహరణము :

అధీత్య విధివ ద్వేదా న్పుత్రాం శ్చోత్పాద్య ధర్మతః
ఇష్ట్వాచ శక్తితో యజ్ఞై ర్మనో మోక్షే నివేశయేత్॥
అనధీత్య ద్విజో వేదా ననుత్పాద్య తథా ప్రజాః
అనిష్ట్వా చైవ యజ్ఞైశ్చ మోక్ష మిచ్ఛ న్వ్రజత్యథః॥
వనేషుచ విహృత్యైవం తృతీయంభాగ మాయుషః
చతుర్థమాయుషో భాగం త్యక్త్వా సంగా న్పరివ్రజేత్॥

మొదట బ్రహ్మచారిగా ఉండి పిదప పెళ్లిచేసుకొని కర్మలు చేసి పిల్లలుకలిగియుండి తరువాత వానప్రస్థుడయి తరువాతను సన్యసించవలెను. యజ్ఞములు చేయనిదిన్నీ సంతానము లేనిదిన్నీ మోక్షమందుబుద్ధి ఉంచినచో పతితుడగుచున్నాడు. ఇది పై శ్లోకములయర్థము. ఈధర్మము వేదమందున్నదని నమ్ముటకుగాను ఈ క్రింది శ్లోకమును చూడుడు.

యఃకశ్చిత్కస్యచి ద్ధర్మో మనునా పరికీర్తితః।
స సర్వోభిహితో వేదే సర్వజ్ఞాన మయోహి సః॥

దీనింబట్టి మనుస్మృతియందున్నదంతయు వేదమునం దున్నదే యని తోచునుగాని 'యదహరేవ విరజేత్తదహరేవ ప్రవ్రజేత్త'ని

యుపనిషత్తులందున్నది. మనుస్మృతియందున్న దానికిని వేదములం దున్నదానికిని విరోధముగలదు. సర్వ ధర్మములును వేదమూలకము లేయన్న కాలమున నిందు విచారించిన వేదభిన్న ధర్మముండ నేరదు. అందుచే నిందలి విరోధముగూడ కాలకృత భేదమునే సూచించు చున్నది.

ఇంతవరకు చూచిన యుదాహరణముల వేదభిన్నత్వ మూలక కాలకృత భేదమును పరస్పర భిన్నత్వ మూలక కాలకృత భేదమును గన్పడుచున్నవి. ఉభయమూలకమైన కాలకృత భేదమును చూపు విషయములుగూడ గలవు. అందుచెందిన యొక విషయమును విచారించిచూతము.

> భార్యా దాసశ్చ పుత్రశ్చ నిర్ధనా స్సర్వఏవ తే।
> యత్తేసమధిగచ్ఛన్తి యస్యతే తస్య తద్ధనం॥

భార్యయున్నూ దాసుడున్నూ కౌమారుడున్నూ ప్రత్యేకము ధనము లేనివారు. వారికేవిధముననైన ధనము లభించినయెడల నది వారిదిగాక గృహయజమానుని దగును. అందుచేతనే స్త్రీకి ప్రత్యేకము ధనము లేదనిన్నీ ఆమెకు తండ్రివల్లను వచ్చినదిగాని వివాహ కాలమందిచ్చినదిగాని భర్తదేయగుచున్నది. ఇట్లుండ 'ప్రతిషిద్ధాపిచే ద్యాతుమద్యమభ్యుదయేష్వపి। ప్రేక్షాసమాజౌ గచ్ఛేద్వా దండ్యాసా కృష్ణలానిషట్॥ అను శ్లోకమువలన వెళ్లవద్దని చెప్పినప్పటికిన్ని ప్రేక్షా సమాజములకు వెళ్లినా త్రాగవద్దని చెప్పినప్పు డభ్యుదయములందు త్రాగినా స్త్రీకి ఆరుకృష్ణలములు జరిమానా విధించవలెనని తెలియ వచ్చుచున్నది. ధనము లేని స్త్రీకి ధనదండనవిధించిన లాభమేమియు లేదు. జరిమానా సొమ్ము భర్తయే చెల్లించినచో దండనవలన నిషిద్ధ కర్మాచరణము తగ్గకపోవును. దండనయొక్క ప్రయోజనమే పోవును. ఎందుచేతనంటే భర్త నిషేధించినను చేసినపనులు గనుక ప్రతిషేధము

విఫలమయి దండనవలన కలుగవలసిన నిషిద్ధకార్యానాదరణ రూప లాభ ముండకపోవుటయేగాక నిషిద్ధకార్యాచరణమం దాదరణ మధిక మగును.

ఇది యిట్లుండ "పత్నీవై పారిణాయ్యస్యఈశ్టే" యను వేద వచనమువలన వివాహకాలమందు స్త్రీకిచ్చిన ధనము స్త్రీదేయగు చున్నది. ఇవికాక

బ్రాహ్మదైవార్ష గంధర్వ ప్రాజాపత్యేషు యద్ధనం
అప్రజాయా మతీతాయాం భర్తురేవ తదిష్యతే॥

అను వచన ముండుటచే బ్రాహ్మదైవార్ష గాంధర్వప్రాజాపత్య వివాహములయందు స్త్రీకిచ్చిన ధనము సంతానము లేకుండా స్త్రీ మరణించినయెడల భర్తదే యగును కాబట్టి స్త్రీబ్రతికియుండగా నాఱైదువివాహములయందును స్త్రీకి వచ్చిన ధనము స్త్రీదేయగును. అందుచే కృష్ణల దండన కవకాశమున్నదని చెప్పినయెడలను అష్టవిధ వివాహములలోనే అయిదింటియందే అవకాశమున్నదిగాని మిగిలిన మూడింటియందును లేకపోవుటచే దండనవిధికి నిరవకాశములగు స్థలములు మిగిలియేయున్నవి. ఇదిగాక స్త్రీ సర్వథా నిర్ధనయే యన్నదానికిని అయిదు వివాహములలో స్త్రీకి ధనమున్న దన్న దానికిని విరోధముండనేయున్నది. స్త్రీకి యాగకర్తృత్వమున్నదా యను విషయమున జైమిని సూత్రములలోనున్న చర్చ ప్రస్తుత విషయమున కుపకారకమైయుండును గనుక దానిని కొంత యీదిగువను వ్రాయు చున్నాను.

జైమిని సూత్రములలో ఆరవ యధ్యాయమున మొదటి పాద మున 12, 13, 14, 15 సూత్రములలో స్త్రీయొక్క నిర్ధనత్వమును గూర్చిన చర్చగలదు: 12–వ సూత్రమునకు శబరస్వామి రచించిన భాష్యమున నీక్రింద సంగ్రహించిన విషయమున్నది:

యత్తయా అన్యేన ప్రకారేణ ఉపార్జ్యతే తత్పత్యురేవ
స్వం భవితు మర్హతి ఏవంచ స్మరతి॥
"భార్యాదాసశ్చ పుత్రశ్చ నిర్ధనా స్సర్వ ఏవతే।
యత్తే సమధిగచ్ఛన్తి యస్యతే తస్య తద్ధనం"॥

దీనివలన తెలియునదేమనగా స్మృతివలన స్త్రీకి ధనములేదు గనుక యజ్ఞములు చేయవలనుపడదు. ఇదియొకపక్షము వారుచెప్పినది. దీనికి జైమిని యిచ్చిన సమాధానము 13, 14 సూత్రములయం దున్నది. అవియిట్లున్నవి.

ఫలోత్సాహా విశేషాత్తు ॥13॥ అర్థేనచసమవేతత్వాత్ ॥14॥

ఈసూత్రములకు భాష్య మిట్లున్నది: "నచైతదస్తినిర్ధనాస్త్రీతి। ద్రవ్యవతీహసా। ఫలోత్సాహా విశేషాత్। స్మృతిప్రామాణ్యాదస్యయా తయా భవితవ్యం ఫలార్థిన్యాపి। శ్రుతివిశేషా త్ఫలార్థిన్యా యష్టవ్యం। యదిస్మృతి మనురుధ్యమానా పరవశానిర్ధనాచస్యాత్ యజేతేత్యుక్తే సతినయజేత। తత్రస్మృత్యాశ్రుతిర్బాధ్యతే। నచైతన్న్యాయ్యం। తస్మా త్ఫలార్థినీ సతీస్మృతిమప్రమాణీకృత్యద్రవ్యం పరిగృహ్ణీయాత్ యజేత చేతి॥ అర్థేనచాస్యాః సమవేతత్వంభవతి। ఏవంచాసకాలే సంవాదః క్రియతే, ధర్మేచ, అర్థేచ, కామేచ నాతిచరితవ్యేతి" యస్మాద్వచ్యతే భార్యాదయోనిర్ధనా ఇతిస్మర్యమాణమపి నిర్ధనత్వ మన్యాయ్యమేవ శ్రుతివిరోధాత్॥"

ఈపంక్తులవలన తెలియవలసిన దేమిటంటే స్మృతిలో నిర్ధనత్వము చెప్పినప్పటికీ అది రెండుకారణములచే అన్యాయమైయున్నది. ఆ రెండుకారణములూ ఏమిటంటే ఒకటి శ్రుతివిరోధము రెండవది ప్రతిజ్ఞావిరోధము. వేదమువల్ల యజ్ఞాధికారము ప్రాప్తించినది. వివాహకాలమందలి 'అర్థేనాతిచరామి' అను ప్రతిజ్ఞవలన ధనము ప్రాప్తించినది. అందుచే స్మృతియందలి నిర్ధనత్వము తప్పు.

ఇందుచేత ఈ సూత్రభాష్యము రచించునాటికి కృష్ణలదండన స్మృతిలోని కెక్కియుండదని యూహింపవచ్చును. అందుచే కాలభేద మంగీకరించక తప్పదు.

ఈవిషయమున నింకను ననేకములగు భాగములున్నవి. జాతుల ధర్మములందును, జాతుల పరస్పర సంబంధములందును, కర్మల విషయమునను, వివాహవిషయమునను, ఆశౌచవిషయమునను, విద్యావిషయమునను ప్రాయశ్చిత్త విషయమునను, రాజకీయ వ్యవహార విషయమునను ఆర్థికవ్యవహారవిషయముననుగూడ కాలకృత భేదములను దెల్పునట్టి యంశములుగలవు. వాటినన్నిటిని జూపిన గ్రంథము పెరుగును గాన యింతటితో విరమించి ముందువిషయముల చర్చించెదను. ఇంతవరకు జరిగిన చర్చనుబట్టి తేలిన దేమిటంటే ఏకకర్తృకమనిన్నీ మనుకర్తృకమనిన్నీ వ్యవహారమందున్న మనుస్మృతియందలి ధర్మములన్నియు నేకకాలికములు గావన్న యనుమానము దృఢమైనది. వేదమూలకములు గావన్న యనుమానముగూడ బలపడినది.

ఈ మనుస్మృతియందలి ధర్మము లెవరుచేసినవో విచారించవలసియున్నది.

ఇంతకుముందు మనముచూచినదానింబట్టి యీ గ్రంథమునందున్నవి సనాతనధర్మములును వ్యవస్థితధర్మములును గలవని తెలియవచ్చినది. వీటిస్వరూపములు తెలియుటకు రెండుదాహరించుచున్నాను.

రథాశ్వం హస్తినం ఛత్రం ధనంధాన్యం పశూంస్త్రియః
సర్వద్రవ్యాణికుప్యంచ యోయజ్జయతితస్యతత్
రాజ్ఞశ్చదద్యురుద్ధారమిత్యేషా వైదికీశ్రుతిః
రాజ్ఞాచ సర్వయోధేభ్యో దాతవ్య మపృథగ్జితం
ఏషోనుపస్కృతః ప్రోక్తో యోధధర్మ స్సనాతనః॥




వేదమందు చెప్పబడినది సనాతనధర్మమని తెలియనగును.

ఏతానాహుః కౌటసాక్ష్యే ప్రోక్తాన్దండా న్మనీషిభిః
ధర్మస్యా వభిచారార్థ మధర్మ నియమాయచ॥

ధర్మసంకరము కాకుండుటకున్నూ అధర్మము పోగొట్టుటకున్నూ విద్వాంసులు నిర్ణయించినధర్మములు వ్యవస్థితధర్మములని తెలియవచ్చును. స్థితధర్మములని కొన్నిటినిచెప్పినట్లు చూచినాము. పూర్వవ్యవస్థలు మారకుండా యున్నయెడల నవియే స్థితధర్మములని తోచుచున్నది.

ఇట్టిధర్మములన్నియు పరిషన్నిర్ణీతములే యనుటకు ఈక్రింది శ్లోకములు సహాయముచేయుచున్నవి.

నైశ్రేయసమిదంకర్మ యథోదిత మశేషతః।
మానవస్యాస్యశాస్త్రస్య రహస్య ముపదేక్ష్యతే॥
అనామ్నాతేషు ధర్మేషు కథంస్యాదితిచేత్ భవేత్।
యంశిష్టా బ్రాహ్మణాబ్రూయు స్సధర్మస్స్యా దశంకితః॥
ధర్మేణాధిగతాయైస్తు వేద స్స పరిబృంహణః।
తేశిష్టా బ్రాహ్మణా జ్ఞేయా శ్శ్రుతిప్రత్యక్షహేతవః॥
దశావరావాపరిషద్యం ధర్మం పరికల్పయేత్।
త్ర్యవరావాపివృత్తస్థాతం ధర్మం నవిచారయేత్॥
త్రైవిద్యో హేతుకస్తర్కీ నైరుక్తో ధర్మపాఠకః।
త్రయశ్చాశ్రమిణఃపూర్వే పరిషత్స్యా దశావరా॥
ఋగ్వేదవి ద్యజుర్విచ్చ సామవేద విదేవచ।
త్ర్యవరా పరిషత్ జ్ఞేయా ధర్మసంశయనిర్ణయే॥
ఏకోపివేదవిద్ధర్మం యం వ్యవస్యే ద్ద్విజోత్తమః।
సవిజ్ఞేయః పరోధర్మః నాజ్ఞానా ముదితాయుతైః॥
ఏవం స భగవా న్దేవో లోకానాం హితకామ్యయా।
ధర్మస్య పరమంగుహ్యాం మమేదం సర్వముక్తవాన్॥

ఈ శ్లోకములలో మానవధర్మశాస్త్రరహస్య . మున్నదని చెప్పినారు. అదేమిటంటే: చెప్పలేదు గదా ఏలాగంటే శిష్టు నడిగి చేయండి. వేదములు బాగా చదువుకున్నవారు శిష్టులు. ఇది ఆచరణ విషయమని తెలియవలసి యున్నది. ఎందుచేతనంటే శాస్త్రమం దున్నను శిష్టజనపరిగ్రహము లేనప్పుడు ధర్మము శుద్ధమైనది కాదని ధర్మలక్షణము చెప్పుచున్నది. పదిమందిగాని ముగ్గురుగాని పరిషత్తుగా గూడి ఏధర్మమును కల్పించెదరో అదే ధర్మము. దాని నాచరించ వలయు.

పదిమంది చేరిన పరిషత్తునందు మూడు వేదములకు ముగ్గురు, మీమాంసకుడు, తార్కికుడు, నైరుక్తకుడు, ధర్మశాస్త్రము చదివిన వాడు, మూడాశ్రమములకు ముగ్గురు గలిసి పదిమంది యగుచున్నారు. ఇది ధర్మకల్పన చేయుటకు అనగా నూతనముగా చేయుటకని చెప్ప వలెను. ఎందుచేతనంటే: మూడు వేదములకు ముగ్గురున్నూ గూడిన పరిషత్తు ధర్మసంశయమును నిశ్చయించునని తెలియవచ్చుచున్నది. గనుక ఈధర్మశాస్త్రరహస్యమని చెప్పిన దానివలన తెలియవలసిన దేమిటంటే ధర్మసంశయమున్నప్పుడున్నూ కొత్తధర్మములు కల్పించ వలసివచ్చినప్పుడున్నూ పరిషత్తులు చేయవలసినదని చెప్పుటచే ధర్మ ములన్నియు పరిషన్నిర్ణీతములే యని చెప్పవచ్చును. ఈవిషయమును బలపరుచునది మరియొక వచనము గలదు. అది 'సమయశ్చాపి సా ధూనాం ప్రమాణం వేదవద్భవేత్'' అనునది. అందుచే ధర్మము లన్నియు పరిషత్సమయములు లేక సాధుసమయములనిన్నీ, వాటికి వేదమునకు వలెనే ప్రామాణ్యముగలదనిన్నీ తెలియవలెను. దీనింబట్టి చూడగా మనుస్మృతి పరిషత్సమయముల సంగ్రహమని చెప్పవలసి యున్నది. యాజ్ఞవల్క్యాదిస్మృతు లీతరగతిలోనివే గనుక నవియు మను స్మృతివంటివే. ఇక మరియొకవిషయము విచారించవలసియున్నది. మను

స్మృతి బ్రహ్మ చెప్పినట్లు మనము చూచినాము. ఇంతేగాక 'ప్రజాపతి రిదం శాస్త్రం తపసై వాఽసృజత్ప్రభుః' అని యున్నది. కొన్ని గ్రంథ ములు విష్ణువు చెప్పినట్లున్నవి. పరాశర స్మృతియం దీక్రింది శ్లోక మున్నది.

కల్పే కల్పే క్షయోత్పత్త్యా బ్రహ్మవిష్ణుమహేశ్వరాః
శ్రుతిస్మృతి సదాచార। నిర్ణేతారశ్చ సర్వదా॥

బ్రహ్మవిష్ణుమహేశ్వరులు ధర్మనిర్ణేతలని దీని యర్థము. ఈవిష యమునున్నూ పైని మనము నిశ్చయించిన విషయమునున్నూ సమ న్వయము చేయుటకు విష్ణుపురాణము కొంత సహాయము చేయ వచ్చును. అందిట్లున్నది.

శక్తయో యస్య దేవస్య బ్రహ్మవిష్ణుశివాత్మికాః।
భవన్త్యభూతపూర్వస్య అంశ 1. అ. 9.

వీనింబట్టి బ్రహ్మవిష్ణుమహేశ్వరు లీశ్వరశక్తులని తెలియవచ్చు చున్నది. మరియొకవిషయము గూడ గలదు. అదేమిటంటే

భూరాద్యాం శ్చతురో లోకా న్పూర్వవ త్సమకల్పయత్।
బ్రహ్మరూపధరో దేవః తతోఽసౌ రజసావృతః।
చకార సృష్టిం భగవాం శ్చతుర్వక్త్రధరో హరిః।
నిమిత్తమాత్రమేవాసౌ సృజ్యానాం సర్గకర్మణి
ప్రధానకారణీభూతా యతో వై సృజ్యశక్తయః
నిమిత్తమాత్రం ముక్త్వైనం నాన్య త్కించి దపేక్షతే॥
నీయతే తపతాంశ్రేష్ఠ స్వశక్త్యా వస్తు వస్తుతాం॥ అంశ 1. అ 8.

ఈశ్లోకములకు శ్రీధరాచార్యులు వ్రాసినవాఖ్యయం దిట్లున్నది.

అయమర్థః—సృజ్యానాం సర్గే బ్రహ్మ నిమిత్తమాత్రం పర్జన్యవత్। సన్నిధిమాత్రేణ సాధారణకారణమేవ నతు ప్రతిసృజ్యం స్వయం వ్యాప్రియతే॥

దీని అర్థమేమిటంటే: సృష్టికర్మయందు బ్రహ్మ ఉన్నాడన్న మాటయే. ప్రతివస్తువు తయారగుటలో బ్రహ్మయొక్క వ్యాపార మేమియు నుండదు. స్వశక్తివలననే వస్తువు వస్తుత్వమును పొందు చున్నదని. ఇది యిట్లుండగా మొదటి శ్లోకములో బ్రహ్మ సృష్టిచేసెనని యున్నది. ఏవస్తువు సృజింపబడినా బ్రహ్మయొక్క సన్నిధానము మాత్రము గలదు. వస్తుశక్తులే వస్తువును తయారుచేయునని గూడ యున్నది. అందుచేత దీనికే బ్రహ్మ సృష్టిచేసినాడని చెప్పుదురని చెప్పవలెను.

ఈవిషయమును దృఢపఱచుటకు మరియొక శ్లోకమున నిట్లున్నది.

సన్నిధానా ద్యథాకాశకాలాద్యాః కారణం తరోః
తథైవాఽపరిణామేన విశ్వస్య భగవాన్ హరిః॥ అంశ 2. అ 8

బ్రహ్మ మార్పులను జెందకుండా సన్నిధిచేసి యుండును; వృక్షము తయారగుటకు ఆకాశము, కాలము మొదలగునవి ఎట్టికార ణములో ఈశ్వరుడుకూడా అట్టికారణమే యని పై శ్లోకమున కర్థము.

ఈ విష్ణుపురాణవచనములను బట్టి చూచినచో బ్రహ్మవిష్ణు మహేశ్వరులు చేసినారన్నదానికి కాలక్రమమున ప్రవృత్తిలోకి వచ్చినదన్న యర్థము చెప్పవలెను. అందుచే ప్రజలచే పరిషత్తుల యందు నిశ్చయించబడిన ధర్మములను బ్రహ్మాదులు చెప్పినారని చెప్పవచ్చునని తోచుచున్నది.

ఇంతవరకు జరిగిన చర్చలో మనకు తెలిసిన విషయమిది: మన్వాదిస్మృతులయందున్న ధర్మములు పరిషన్నిర్ణీతములు. మన్వాదు లన్న పురుషులు సంగ్రహకర్తలు గావచ్చును, లేదా పరిషదధ్యక్షులు గావచ్చును, లేదా రాజులుగాని రాజపురుషులుగాని గావచ్చును, బ్రహ్మవిష్ణువులు చెప్పినవన్నివి పరిషత్తులయందు నిర్ణయించబడినవి. ఇవి ఏ ఋషి యడిగినట్లుంటే ఆ ఋషి యాధర్మముల సంగ్రహించిన వాడని చెప్పవచ్చును.

పరిషన్నిర్ణీతధర్మములు రాజానుమతిని పొంది వ్యవహారము నకు వచ్చునని తోచుచున్నది. ఎందుచేతనంటే వీటికి విరుద్ధముగా నడుచువానికి రాజు స్వధర్మము చెప్పవలెనని రాజధర్మములయం దున్నది. ఈక్రింది శ్లోకమును చూడండి.

జాతిజానపదాన్ ధర్మాన్ శ్రేణీధర్మాంశ్చ తత్త్వవిత్
సమీక్ష్య కులధర్మాంశ్చ స్వధర్మం ప్రతిపాదయేత్॥

దీనింబట్టి చూడగా పరిషన్నిర్ణీతములన్నియు రాజునకు పంప బడుననియు రాజు తనయొద్ద వాటిని సంగ్రహించి యుంచవలెననియు తెలియవచ్చును.

పైని చెప్పిన ప్రకారము రాజు ధర్మమును ప్రతిపాదించు చుండగా ప్రాచీన ధర్మములే నిలిచియుండునుగాన క్రొత్త ధర్మము లెట్టు కలుగునన్న సంశయము గలుగుచున్నది. దీనికి సమాధానము చూడవలెను. మనుస్మృతిలోని ఈక్రింది శ్లోకముల జూడుడు.

యత్కర్మ కుర్వతోఽస్య స్యాత్పరితోషోఽంతరాత్మనః
తత్ప్రయత్నేన కుర్వీత విపరీతంతు వర్జయేత్॥

దీనింబట్టి చూడగా కర్మాచరణయందు ప్రతివ్యక్తికీ స్వతంత్రత గలదు. దీనికి కారణ మాత్మపరితుష్టిమూలకమగు సుఖాభివృద్ధి యని పైశ్లోకము చెప్పుచున్నది. ఇట్టి సమయముల వివాదము సంభ వించినచో రాజునకు కొంత యధికారమిచ్చిన ట్లీక్రింది శ్లోకమున వెల్లడియగును.

సద్భిరాచరితం యత్స్యాద్ధార్మికైశ్చ ద్విజాతిభిః
తద్దేశకులజాతీనా మవిరుద్ధం ప్రకల్పయేత్॥

ఇందు రాజునకు కల్పనాధికారమున్నది. ధార్మికులు సత్పురు షులునగు వారాచరించినపుడు అది దేశకులజాతుల కవిరుద్ధమైనచో ధర్మముగా కల్పింపబడును.

దీనివలన తెలియునదేమనగా: వ్యక్తులచే నాచరింపబడి వివాదము వచ్చినపుడు రాజావలంబనము కలిగియున్న నది • ధర్మమేగాని యది సర్వజనాదరణీయ మగుటకు మనుస్మృతియం దున్నటుల దశావశా పరిపత్తున పరిష్కరింపబడవలయును. ఈప్రకారము ధర్మములు మారుచుండును. ఇంతవరకు మనము చేసిన చర్చవలన మనమిట్లు నిశ్చయించవచ్చునని తోచుచున్నది. ధర్మస్వరూపమును విచారించినను, ధర్మప్రమాణములను విచారించినను మానవధర్మశాస్త్ర రహస్యమును జూచినను ధర్మములు పరిషన్నిర్ణీతములు. ఇవి రాజునొద్దకు పంపబడి వాని యంగీకారమును పొంది వారి యాస్థానమున సంగ్రహించబడి యుండును. రాజపురుషులు వీటికి ప్రవర్తకులుగా నుందురు. ఆప్రకార మాయా కాలముల మన్వాదులు ప్రవర్తకులుగా నున్నారని యాజ్ఞవల్క్య స్మృతివలన తెలియవచ్చినది. ధర్మములకును మన్వాదులకును ప్రవర్త్య ప్రవర్తక సంబంధమే గలదని చూచినాము. కర్తృత్వమున్నదని చెప్పిన చోట్ల సంగ్రహ కర్తృత్వమే యని యెంచవలయును.

పర్లాకిమిడి గాదె నరసింగరావుగారు

# బాష్పాంజలి

కోలవెన్ను రామకోటీశ్వరరావుగారు, బి. ఏ., బి. ఎల్.

మాఖ శుద్ధ పంచమి మా హనుమంతరావుగారి నిర్యాణ దినము. విజ్ఞానమూ, త్యాగమూ, రసపిపాసా, మూర్తీభవించిన ఆ మహానుభావుని స్మరించకుండా ఎవరుండగలరు ? అందులోనూ, నిన్న మొన్నటివరకూ కళాశాలలోనే ఉండి పనిచేసిన నావంటి వారి సంగతి చెప్పేదేమిటి ?

అదంతా చిత్రంగా జరిగిపోయింది. ఎందువల్లనో, నాకు చిన్నప్పటినుంచీ కళాశాల అంటే విపరీతమైన అభిమానము. కొండా వేంకటప్పయ్య పంతులుగారు మొట్టమొదట ప్రారంభోత్సవము జరిపినపుడు నేను బందరులోనే ఇంటర్మీడియేటు తరగతిలో చదువుతుండేవాడను. ఆరోజున శ్రీతిరుపతి వేంకటకవులు చదివిన పద్యాలూ,

పట్టాభి సీతారామయ్యగారి నివేదికా, హనుమంతరావుగారి ముసి ముసి నగవులూ, అంతా కళ్లకు కట్టినట్టుగా ఉన్నది. తరువాత చెన్న పట్టణములో చదివే రోజులలోనూ, నర్సారావుపేటలో ప్లీడరీ చేసే టప్పుడూ, దీపావళి పండుగకు తప్పకుండా కళాశాల భిక్షలు వసూలు చేసి, ధన్యుడనైనానని సంతోషించేవాడను. ఏదో వీలుచేసుకుని సంవత్సరోత్సవాలకు కూడా సిద్ధమైనాను. శ్రీమతి సరోజినీదేవిగారూ, ఆనీబిసెంటుగారూ ఇచ్చిన ఉపన్యాసాలు బాగా జ్ఞాపకము. ప్రతిసారీ హనుమంతరావుగారు పెద్దపెద్ద వ్యాసాలు వ్రాసి, జాతీయ విద్యా స్వరూపాన్ని నిరూపిస్తూ ఉండేవారు. ఆయన చదువుతుంటే చాలామంది విసుగుకొని లేచిపోయేవాళ్లు. ఇంకా ఎన్ని పేజీలున్నవని లెక్కపెట్టే వాళ్లు. నాకు మాత్రము ఆయన చెప్పేదంతా ఆనందంగానే ఉండేది.

అసహాయోద్యమము వచ్చినప్పుడు కళాశాలవారు కాంగ్రెసు సహాయమును స్వీకరించి, సర్కారు గ్రాంటులను త్రోసిపుచ్చినారు. అప్పటి సందర్భాలు నాకు బాగా తెలియవుగాని, మొదట ఆపద్ధతికి హనుమంతరావుగారు ఒప్పుకోలేదనీ పట్టాభిగారు ఆయనకు నచ్చ చెప్పి చివరకు ఒప్పించారనీ అనుకున్నారు. గాంధీగారు బెజవాడ వచ్చినప్పుడు బందరు కూడా వెళ్లి కళాశాలనుచూసి ఆనందించారు. కాని, "ఈపాడు యంత్రాలన్నీ మానివేయండి. వాటిమీద పెద్ద బురకాలు కప్పితే బాగుంటుంది" అని అన్నారట. ఆపని అప్పుడే చేయిస్తే అంతా బాగానే జరిగేది. అసలు ఆయంత్రాలను నిలప డానికే ముందుముందు కళాశాలకు వ్రతభంగమవుతుందని ఎవరను కున్నారు?

'స్వరాజ్య' లో నేను సహాయ సంపాదకుడుగా ఉండేటప్పుడే హనుమంతరావుగారు పోయినారు. ఆరోజు మాఆఫీసుకు శలవు. ఆది వారము కాబోలు. ఎందుకో మధ్యాహ్నము బ్రాడ్వేపైపువెళ్లి, ఏమైనా సంగతులున్నవేమో కనుక్కుందామని లోపలికి పోయినాను. "టెలిగ్రాములలో విశేషాలేమిటండీ" అని అడిగితే "ఏమీలేదండీ, పాపము, హనుమంత రావుగారు చనిపోయినారట" అని ఎవరో చెప్పినారు. నాకేమిటో గుండెలోరాయిపడ్డది. ఎవరో ఆప్తబంధువులు

పోయినట్టుగా పరితపించాను. బ్రాడ్వే చుట్టుప్రక్కల వీధులన్నీ పిచ్చి ఎత్తినవాడివలె తిరిగి తిరిగి కొంపచేరుకున్నాను. మరునాడు ఆఫీసుకు వెళ్లితే, కృపానిధిగారు నన్నుపిలిచి, "ఏమండీ, హనుమంతరావు గారిని గురించి సంపాదకీయము వ్రాయాలి. మాకు వారినిగురించి అంతబాగా తెలియదు. మీరువ్రాయండి" అన్నారు. నాకు చెప్ప నలవిగాని దుఃఖమూవచ్చింది. ఈవిధంగానైనా ఆయనకు బాష్పాంజలి విడువ కలుగుదునని మనశ్శాంతీ కలిగింది. దుఃఖము ఎక్కువగా ఉన్నప్పుడు ఏమివ్రాయగలము? ఆవ్రాసిందే ఎంతోబాగుందని తరు వాత పట్టాభిగారు ఎప్పుడో అన్నారు. 'మహాభాగ్య' మనుకున్నాను.

జాతీయ విద్యాలయములు సర్కారు డబ్బు తీసుకోనకూడదని నాకు మొదటినుంచీ వెర్రిపట్టుదల. పోనీ, పారిశ్రామిక శాఖకేకదా అని సరిపెట్టుకునేవాళ్లను చూస్తే నాకువిసుగు. మొత్తమంతా ఒకటే కళాశాల అయితే, ఇందులో ఒక శాఖకే తీసుకున్నామని సమాధాన మేమిటి ? స్వరాజ్యము అనుభవించే దేశాలలో ఎట్లావున్నా, పర రాజులకు లోబడ్డ మనదేశములో సర్కారు సహాయముతోనే జాతీ యవిద్య సాగిస్తామని చెప్పడము అనాలోచితము. అసలు కళాశాల వారు యథాపూర్వముగా గ్రాంటులు తీసుకుంటూనే ఉంటే, నేను 'స్వరాజ్య' వదలి కళాశాలకు వెళ్లేవాడనేకాను. కాని, తత్వమంతా మారిందనీ జాతీయవాద పత్రికలో పనిచేసినా జాతీయ విద్యాల యములో ఉన్నా ఒకటేననీ, నాకు నమ్మకము కలగడమువల్ల అవకాశము దొరికినప్పుడు శ్రీ ప్రకాశముగారి అనుమతితో బందరు వెళ్లినాను.

కొన్నాళ్లు అంతా సక్రమంగానే జరిగిపోయింది. ఏకొద్దిమంది విద్యార్థులకో తెలుగులోనే ఉత్తమ తరగతులలో చరిత్రా రాజనీతీ బోధించాను. ప్రక్కగదిలోనే, మాసత్యనారాయణగారు పాటలూ పద్యాలూ పాడుతుంటే,కొంతవరకు తెలుగు సారస్వతములో అభిరుచి ఏర్పడ్డది. పూజ్యులైన ప్రమోదకుమార చటర్జీగారి చిత్రాలను చూసి మహానందము పొందినాను. సావగాశమున్నప్పుడల్లా, తివాచీ నేతను పరిశీలిస్తూ, ఆరంగుల కలయికకూ ఆనేత విన్నాణముకూ పొంగిపోయినాను. గోపాలరెడ్డి,కూడా కృష్ణమూర్తి,ఆనందమోహన్,

లీలాసరోజిని, నరశింహారావు మొదలైన విద్యార్థులకు ఆంగ్లమూ, చరిత్రా బోధించి, వారి ప్రేమను సంపాదించడమే నాకు గొప్పదశగా తోచింది.

ఇంతలోకే, మళ్లీ సర్కారు డబ్బు పుచ్చుకోవడము విషయమై చర్చలు బయలుదేరినవి. నాకు ఇది కంటకమైనది. అన్నిసంగతులూ విచారించమని పాలక సంఘమువారు కొందరిని నియమిస్తే వారు పదహారునెలలు విచారించి విచారించి చివరకు గ్రాంటు పుచ్చుకో వచ్చునని శిఫార్సుచేశారు. అందులో అసహాయోద్యమ నాయకులైన నాగేశ్వరరావుగారుకూడాను! దీనితో నామొఱ అరణ్యరోదనమ యింది. గాంధీగారికి వ్రాసుకుంటే వారు పట్టాభిగారికి వ్రాశారు. పట్టాభిగారు మిర్జాపురము వ్యవహారములో మునిగి ఉండడమువల్ల జవాబైనా ఇచ్చినట్టులేదు. దేశభక్త కొండ వేంకటప్పయ్యగారివంటి మహానాయకులంతా మాట్లాడక ఊరుకున్నారు. చివరకు పాలక సంఘమువారు గ్రాంటు పుచ్చుకోవచ్చుననే తీర్మానించారు.

ఇంక, నాకూ నాప్రియతమమైన కళాశాలకూ ఋణము తీరి పోయింది. వదలి పెట్టడము ఎంతకష్టమైనా తప్పిందికాదు. అసలు రాజీనామా ఇవ్వడానికైనా, అదివరకు క్రమముగాఎన్నుకోబడ్డ పాలక సంఘమును ఏవో అర్థములేని కారణాలు చెప్పి, అక్రమముగా తొలగించి స్థానిక బలముగల కొందరు కళాశాలను స్వాధీన పరచుకున్నారు. వాళ్లతో నాకేమి సంబంధము? మాట్లాడక వచ్చివేశాను. చక్రవర్తి గారు జాలిపడ్డారు. ఎవరిని పలుకరించడానికీ నాకు కష్టమనిపించింది. తివాచీల సాహెబు ప్రత్యేకముగా వచ్చి నన్నుచూసి కంటతడి పెట్టు కున్నాడు. క్రిందటి హనుమంతరాయ వర్థంతికి నేను కళాశాలలోనే ఉన్నాను. ఇంతలో ఎడబాటు కలుగుతుందనీ, ఎక్కడో చెన్నపట్టణ ములో కూర్చుని యీవిధముగావిలపిస్తూ వ్రాయవలసివస్తుందనీ ఎప్పు డూ కలలోకూడా అనుకోలేదు.

ఆయన మహాశయములు కళాశాలలోకంటే మా 'జయంతి', 'త్రివేణి', పత్రికల మూలముగానే ఎక్కువ బాగా నెరవేర్చ వచ్చు నేమో! కాలగర్భములో ఏమున్నదో ఎవరు చూశారు?

చెన్నపట్టణము

కోలవెన్ను రామకోటీశ్వరరావు

# కైరసు : పారశీకశూరుడు

గూడా కృష్ణమూర్తిగారు

'అస్టైజసు' అను రాజు 'మీడియా' దేశమును పరిపాలించు చుండెను. అతనికి 'మందని' యను కుమార్తె గలదు. ఆమె తన శయనాగారమున నిద్రించుసమయమున, నోటినుండి యొక గొప్ప జలప్రవాహము వెలువడి, రాజధానియేకాకుండ ఆసియాఖండ మంతయు జలప్రళయమైనట్లు కల గనెను. ఈ విషయము జనకునికి తెలియజెప్పినవెంటనే, యాతడు భయకంపితుడయ్యెను. ఏలనో కాని, తత్క్షణమే తన కుమార్తెకు వివాహమొనర్చనని నుడివెను. కాని కుమార్తెకు యుక్తవయస్సు రాగానే వివాహముచేయుట అవసర మయ్యెను. కాన పారశీక దేశపు రాజగు 'కాంబెసీసు'నకిచ్చి పెండ్లిచేసెను.

వివాహితమైన యొక వత్సరకాలము నాటికే 'అస్టైజసు' మరల తన కుమార్తె గర్భమునుండి ద్రాక్షలత యుద్భవిల్లి ప్రపంచ మెల్లెడల నల్లుకొనిపోయినట్లు కలగాంచెను. ఇట్టి యాశ్చర్యకరమగు కల గనుట వలన మిగుల భయమంది తన యనుచరులతోగూడ ముచ్చటించెను. వారలలో నొకడు "ఆమెకు కల్గిన కుమారుడు తాతగారి సింహాసన మపహరించు"నని నుడివెను. అంతట రాజా మాటలకు వెగడొంది, అయ్యది నిజమేనని యనుకొని, తన్ను తా రక్షించుకొనుటకై, కుమార్తె శిశువును గనిన వెంటనే జంపనెంచి, తన ప్రాణమిత్రుడును, రాజకార్య ధురంధరుడును, యుగంధరుని బోలు మేధావియునగు, తన ముఖ్యమంత్రి 'హార్పెగసు'ను రావించి యాతనితో నిట్లు చెప్ప దొడంగెను. "నీవు నా ప్రాణమిత్రుడవై యుండి, కన్న కుమారునికన్నను ప్రేమాస్పదుడ వగుటచే, నే జెప్పెడు కార్యము తప్పక నెరవేర్చెదవని నా నమ్మకము. అది యేది యన, నా కుమార్తెయగు 'మందని' కొమరుని నీవు నీ గృహమునకు

గొనిపోయి వధించవలయును.'' 'హార్పెగసు' నివ్వెరపోయి చేయు నది లేక యించుక సేపాలోచించి రాజాజ్ఞ శిరసావహించెను.

అనంతర మా రాకుమారుని తీసికొనిపోయి 'మిత్రడేటసు' అను గొల్లవానికిచ్చి, ధనాశజూపి, ఆ పసిపాపని అడవులమధ్య వన మృగముల కెఱగా వదలిరమ్మని యాజ్ఞాపించెను. కాని తానొకటి తలచిన దైవమొకటి తలచును. ఆనాడే 'మిత్రడేటసు' భార్య గర్భము నందే చనిపోయిన మగశిశువును గనెను. ఆమె తన దుర్భాగ్యమునకు చింతిల్లి రోదనచేయుచున్నతరి 'మిత్రడేటసు' రాకొమరు నొడియం దుంచుకొని స్వగృహమునకు విచ్చేసి, జరిగిన కార్యమునకు విచా రించి, తాఁ జేయబోవు కార్యము భార్య కెరింగించి యడవికి పయన మగుచుండ, భార్య హృదయముకరిగి, నిజశిశువును యడవుల పాల్జేసి రాకుమారుని తన కీయుమని భర్తను వేవిధముల ప్రార్థింప, ఆతడును సంతోషించి యట్లేయని, నిజశిశువును ఒకానొక పర్వతాగ్రమున నునిచి వెనుకకు మరలివచ్చెను. 'మిత్రడేటసు,' యాతని భార్యయు నీ రాకుమారుని అమితప్రేమతో పెంచుకొనుచు సుఖముగ కాలము గడపుచుండిరి. నాటనుండియు, యీ బాలుడు 'కైరసు' అనుపేర యా గొల్లపల్లెలో నందరి ప్రేమకును పాత్రుడై, బహు గారాపుబిడ్డడై పెరుగుచుండెను.

కాని యీ రహస్యము దాగలేదు. బాలునికి దశవర్షములు నిండుసరికి, ఈమోసము 'ఆస్టైజసు'నకు తెలిసెను. ఒకదినమున నీ పెంపుడు తండ్రియగు గొల్లడు కైరసుతో కలిసియుండ, రాజాతనిని చూచుట తటస్థించెను. అంతట రాజు 'మిత్రడేటసు'ను భయపెట్టి జరిగిన మోసమునంతయు సామూలాగ్రముగ నెరింగెను. రాజు నిజ మందిరమునకేగి, మంత్రియగు 'హార్పెగసు'కు కబురంపి యడుగగా, నాతడు కొన్ని వాక్కు లతిసందిగ్ధముగ జెప్పుటచే రాజు చేయునది లేక యప్పటి కూరకుండెను. కాని రాజు నిజముగ చాల కోపోద్దీపి

తుడై యుండెను. తన కోపమునంతయు నణచుకొని, 'హెర్పెగసు'తో నాతని కుమారుని, తన మనుమడగు కైరసుతో నాడుకొనుటకు పంపుమని జెప్పెను. అంతేకాక తనమనుమడగు కైరసు అడవిమృగములనోటి కాహారముగా నీయబడియు మరల దైవయోగమున రక్షింపబడుటచే ఆనంద సూచకముగ నొకవిందు నొసర్తునని జెప్పి, యాతని నచ్చుటకు విచ్చేయవలయునని కోరెను. హెర్పెగసు ఇయ్యది విని సంతసించి, తనను శిక్షించుటకు మారు విందునకు గూడ బిలిచెనని యానందించెను.

'హెర్పెగసు'న కొకడే కుమారుడు. ఆతనికి పదమూడువత్సరములు. స్వామియాజ్ఞ నెరవేర్చుటకై తండ్రికుమారుని రాజమందిరమున కంపెను. 'ఆస్టైజసు' తన భార్యతో జరిగిన మోస మెరిగించి, మంత్రికుమారుడు రాగానే, ఆతనినరికి యా మాంసమును చక్కగ వండమనిజెప్పి, శిరస్సును, పాదములును, చేతులును మాత్రము దాచియుంచ నియమించెను. మంత్రికుమారుని మాంసమును చక్కగవండి విందులో నాతనితండ్రి కది వడ్డించుటకు తగు యేర్పాటులు చేసెను. 'హెర్పెగసు' కూడ ఆవిందునాటి కందరివలెనే వచ్చెను. ఇతర యతిథులకు వేరుమాంసము వడ్డించి, హెర్పగసునకు మాత్రము కుమారుని మాంసము వడ్డించిరి. అందరు సంతుష్టిగ భుజించియున్నపిమ్మట రాజు 'హెర్పెగసు' కడకు జేరి, ''భోజ్యములెట్లున్నవి? నీవు భుజించిన మాంస మెట్లున్నది?'' అని ప్రశ్నించెను. ఆతడును విందు చాల చక్కగ జరిగినదనియు, మాంసముకూడ చాల బాగున్నదనియు, సవినయముగ నుడివెను. అంతట రాజు తాను వేరుగ దీసియుంచిన శిరము, చేతులు మొదలగునవి మంత్రిముందట నుంచగా, నాతడు నిశ్చేష్టుడై, తన తనయుని శిరముమట్టుకు చేత బట్టుకొని ఎట్టి దుర్భావములుగాని కోపముగాని వెలువడనీయక, అట్టి దురవస్థయందుగూడ రాజున కతి వినయముగనుండి, యాతని ఆ

నందమే తన ఆనందముగనటించి, రాజును తృప్తిపరచి తన గృహ మునకేగి ఆ శిరస్సునకు తగు రీతిని దహనాదిక్రియ లొనర్చెను.

కైరసు జననీ జనకులకడ మెల్లమెల్లగ యభివృద్ధినొందుచు, బలమునందును, సౌందర్యమందును, అన్నిటికిని తోడు సహజ స్వతం త్రతయందును తోడి బాలుర నందరను మించుచుండెను. ఇయ్యది కనిపెట్టి, 'హార్పెగసు' రాజుపై పగదీర్చుకొనుటకు తగు యదను దొరకునాయని వేచియుండిన వాడగుటచే, నయ్యది సాధింపదలంచి, యందులకు కైరసీతనకు ముఖ్యసాధనముగ నుండిననేగాని తన ప్రయ త్నము సఫలముగాదని యెఱింగి, ఆతనితో మంచి మాటలాడి, ఆత నికి బహుమానములనిచ్చి, యాతని యనుగ్రహమునకు పాత్రు డగుటకై ప్రయత్నములు సల్పుచు, ఫలోన్ముఖుడగుచుండెను. అన్నిటి కన్నను ముఖ్యముగ కైరసు జీవితాంశము నెరింగి, యందులకు దా ర్కాణముగానున్న యాతని శౌర్య, ధైర్య, పౌరుషముల జూచి, యాతనిచెంత జేరుచుండెను. ఈరీతిని పారశీకశూరుడు నిజగృహం బున బెరుగుచుండెను.

'అస్టైజసు' మీడుల నతి కఠినముగా పరిపాలించుటచే మీడు లతో, హార్పెగసు, కైరసుయొక్క నిజస్థితిని వెలిబుచ్చుచు పారశీక మందున్న కైరసుతో ఉత్తర ప్రత్యుత్తరములు జరుపుటకు నిశ్చ యించుకొనెను. ఇట్లు కైరసుయొక్క అభ్యుదయమునకును, రాజుపై తన పగదీర్చుకొనుటకును ననేకవిధముల ప్రయత్నము చేయుచుండె ను. అప్పుడప్పుడు 'హార్పెగసు' ఒక కుందేటినిదెచ్చి, దాని పొట్ట చీల్చి, అందొక యుత్తరమునుంచి, తనకు బాగుగ నమ్మకస్తుడగు సేవకునిబిలిచి, మరల ఆకుందేటి పొట్ట యథారీతిగ కుట్టి, ఆసేవకుడు దానిని వేటాడి పట్టుకొనుటకు ప్రయత్నించుచునటులుగా నటించుచు ఆకుందేలు కైరసు ముందటికి పోవువర కట్లుచేసి రహస్యముగ నుత్త రము లందజేయుచుండెను. కుందేటిని తరుముకొనిపోయిన సేవకుని

తో, కైరసునకే తప్ప యితరు లెవ్వరికి నాజాబు నీయరాదనియు, దాని నాతడే విప్పిజూడవలయుననియు బోధించుచుండెను. సేవకుడును స్వామికార్య పరాయణుడై దానిని కైరసునకే ఒప్పగించుచుండెను. అందొకజాబునం దిట్లుండెను. "కాంబెసీసు యొక్క కుమారుడవగు నీకు దైవ మనుకూలించుగాక. అస్టైజసు నిన్ను చంపుటకై ప్రయత్నించి నిష్ఫలుడై చేయునది లేక, ఖిన్నుడైయుండెను. నీయొక్క మరణమును జూడలేక నే గొల్లవానికీయగా, మరల నీవు కనుపించిన తరి కోపోద్దీపితుడై నాకే హాని యొనర్చెను. నీతో యాడుకొనుటకు పంపమని నా కుమారుని ముక్క ముక్కలుగాకోసి వాని మాంసము నాచేతనే తినిపించిన ఘోరపాపి. నీవు ప్రథమమున పారశీకులను పురికొల్పి మీడులమీదికి దండువెడలుము. అట్టి యుద్ధసమయమున 'అస్టైజసు' నన్నే మీడుల సైన్యముల కంతకు అధ్యక్షునిగ జేసి తీరును. ఇట్టి యదనున మనకోరిక నెరవేఱునని వేరుగ జెప్పవలయునా? గాన నిట్టి తిరుగుబాటునకు తక్షణమే ప్రయత్నపడి రావలయును."

'కైరసు' ఇట్టిసమయమున బాగుగ నాలోచించి తన దేశజుల నెల్లరను రావించి పెద్దసభగావించెను. వారియెదుటనే యీయుత్తరమును జదివి వారిని పురిగొల్పి దండువెడలెను. పారశీకులెల్లరును నొకచోట గూడి, మొదటిదినమున మిగుల శ్రమపడి ఒక మహారణ్యమున నిరువదిఫర్లాంగుల దూరమును శుభ్రపరచుకొని, యచ్చట కైరసు జెప్పినరీతి నడచుకొనుచుండిరి. కైరసు వారితోగూడ నివసించి, రెండవదినమున మంచిమాంసమును, యితరభోజ్యములును వారికిచ్చి బాగుగ తృప్తినందజేసెను. మరునాడు వారల హాయిగ నిద్దురపోనిచ్చెను. అట్లుచేసి యనంతరము కైరసు "మీ కేదినము హాయిగనున్నదని" ప్రశ్నించెను. వారును రెండవ, మూడవరోజులు హాయిగ నున్నవనిరి. అప్పుడు కైరసు వారిని పురిగొల్పుటకిదే మంచిసమయమని తలంచి యటుల నుద్రేకపూరితుల జేసెను.

“ఓ పారశీక సోదరులారా! బానిసత్వమున గుందుచుండిన పారశీకమునకు యిట్టి సౌఖ్యదినములు రావలెనన్న యీ మీడుల నోడించవలయు”నని వివిధరీతుల వారిని ప్రోత్సహించెను.

చిరకాలమునుండి బానిసత్వమున గుందుచుండినను, స్వాతంత్ర్యమునుపురిగొల్పు నీ కైరసుపలుకులు వినిన నెవరి కుత్సాహము జనించదు? పారశీకులందరు గంగాప్రవంతివలె పొంగి పొరలుచుండిరి. మాతృదేశవిముక్తికై తమరక్తము ధారవోయ సమకట్టిరి. అనంతరము పారశీకులదాడి 'అస్టైజసు'నకు తెలిసెను. అతడు తొల్లి తాను హార్పెగసునకు జేసిన యపకారమును మరచిపోయి మీడుల సైన్యాధ్యక్షపదవి నాతనికే యొసంగెను. కైరసు జయభేరుల మ్రోగించుకొనుచు మీడుల రాజధానిలోనికి ప్రవేశించెను. అస్టైజసు తన ఓటమిని విని, స్వప్నములు నిజమాటగని మొదట కైరసును యడవులపాల్జేయుమనిన వారిని జంపించెను. అనంతరము ధైర్యమువీడక తానే స్వయముగ యుద్ధమునకు జని పరాజితుడై సర్వసైన్యమును కోల్పోయి, ఖైదీగా పట్టుబడెను. ఇదియే మంచిసమయమని యెంచి హార్పెగసు, అస్టైజసును నిందించి, “ఆనాడు విందుగదా! ఆనాడు బాలుని యడవులజంపుటకై చేసిన దురాలోచనగదా! అవియే అంతటి మహారాజును యిప్పుడిట్టిబానిసగా నొనర్చె”నని యనేక రీతుల ఎత్తిపొడిచెను.

అస్టైజసు తాను ప్రజలకుజేసిన యపకారములను దలంచుకొనుచు, రాజ్యతృష్ణచే తా నొనరించిన దురంతముల నెంచి, విచారించి పశ్చాత్తాపపడి కొంతకాలమునకు చనిపోయెను. కైరసు చక్రవర్తియై దేదీప్యమానముగ రాజ్యమేలెను.

చెన్నపట్టణము.    గూడా కృష్ణబాయి.